# తెలుగు వైతాళికులు

## II

(ఉపన్యాసాల సంపుటము)




ప్రచురణ

ధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు.

# తెలుగు వైతాళికులు

## II

(ఉపన్యాసాల సంపుటము)




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాదు.

# తొలి పలుకు

గడచిన శతాబ్దములో జన్మించి ఈ శతాబ్ది ఆరంభంలో చరిత్ర నిర్మాణము గావించిన మహనీయులు చాలా మంది మనదేశములో వివిధ ప్రాంతాలలో ఉన్నారు. తెలుగు సాహిత్యరంగంలో ఒక నూతన చైతన్యమును తీసికొని వచ్చి మార్గదర్శకులైన సాహిత్యమూర్తులను, సంస్కృతీపరులను, యీ శ్రేణిలో చేర్చవచ్చును. ఇటువంటి వారిని గూర్చి యీ తరానికి వివరాలు పూర్తిగా తెలియక పోవచ్చును. అందుచేత వీరిని సంస్మరించి వీరు చేసిన భాషాసేవ యీనాటి తరానికి, రాబోవు తరాలకు పరిచయము చేయవలెనని ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ ఉద్దేశించినది.

ఈ ఉద్దేశానికి అనుగుణంగా తెలుగు సాహిత్యము, తెలుగు సంస్కృతి రంగాలలో వైతాళికులైన కొందరిని గూర్చి ఉపన్యాసములు, సాహిత్య అకాడమీ పక్షాన ఏర్పాటు చేయనైనది. ఇటువంటి ఉపన్యాసాలు ప్రతి సంవత్సరము కొన్ని చేయించవలెనని సాహిత్య అకాడమి ఉద్దేశము. ప్రముఖులైన విద్వాంసుల చేత యీ వైతాళికులను గూర్చి ఉపన్యాసములు చేయించనైనది. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి అనుసరిస్తున్న సంప్రదాయము ప్రకారము యీ ఉపన్యాసాలు గ్రంథరూపములో వెలువరించనైనది. అట్టి పరంపరలో ఈ గ్రంథము రెండవది.

ఈ గ్రంథంలో చేర్చిన ఉపన్యాసాలు ఏడు. ఈ ఉపన్యాసాలు 1976 సంవత్సరమున ఏప్రిల్ 17, ఆగస్టు 7, అక్టోబరు 31 వ తేదీన, 1977 సంవత్సరమున జనవరి 30, మరియు ఏప్రిల్ 16 తేదీలలో జరిగినవి. ఇదివరలో ప్రచురితమైన ఉపన్యాసాల సంపుటమును ఆదరించినట్లే ఈ సంపుటాన్ని కూడా ఆంధ్రపాఠక లోకము ఆదరింపగలదని విశ్వసిస్తున్నాను.

హైదరాబాదు
25-7-77

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

## విషయ సూచిక

# అగ్రశ్రేణికి చెందిన ఆంధ్ర మహాపురుషుడు

## శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమ రావుగారి జీవిత చరిత్ర

రచన : 'కళాప్రపూర్ణ' పాతూరి నాగభూషణం
(ఆం. ప్ర. గ్రంథాలయసంఘ కార్యదర్శి)

అధ్యక్షా ! మాన్య మహాశయులారా !

నేడు చాలాసుదినం. మరుగున బడిన పాత తరానికి చెందిన ఒక మహనీయుని, మాతృసేవకై తన జీవితాన్ని ధారపోసిన పుణ్యపురుషుని - నేటితరం వారికి పరిచయంచేసే తలంపుతో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ఈ సభను ఏర్పాటు చేసినారు. వారి జీవితమును గురించి ప్రసంగించవలసినదిగా నన్నాదేశించినారు దీనిని మహద్భాగ్యంగా భావించి దీనికి సమ్మతించి మీ యెదుట నిలబడినాను. రెండు దశాబ్దాలకు పైగా మేరు పర్వతమును బోలిన యీ ధీర చరితుని వెంటనుండి వారధ్యక్షులుగానున్న ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు కార్యదర్శి పదవిని నిర్వహిస్తూ, వారు సాగించిన వయోజన విద్యావ్యాపన కార్యక్రమంలో పాల్గొంటూ వచ్చినవాడ నగుటచేత వారి సహచరులలో నాకుగల స్థానమునుబట్టి బహుశః నాకీ ఆహ్వానమును మన సాహిత్య అకాడమీవారు పంపినారని తలంచుచున్నాను. వారి సాహచర్యంద్వారా నాజీవితం ధన్యమైనదని నేనెంచుచున్నాను. కాని వారి మహోన్నతమగు జీవిత కథను సామాన్యుడనగు నేను - నాకంటె ఎన్నో విషయముల అధికులైన యీ సభాసదులకు రక్తిగట్టు రీతిని చెప్పగలనో, లేదో అను భయము సన్నావహిస్తున్నది. నా శక్తిలోపమును మన్నించి నేను చెప్పు విషయములను మాత్రము గ్రహించ గోరుతున్నాను.

నేటి మన కథానాయకుని గురించి ప్రజాకవి శ్రీ కాళోజీ చెప్పిన కవితను ముందు మీకు వినిపిస్తాను.

వందేమాతర మనగనె – వచ్చితీరు యెవని పేరు ?
వయోజనుల విద్యనగనె – వచ్చితీరు యెవని పేరు ?
గ్రామగ్రామమున వెలసెటి – గ్రంథాలయ మెవనికి గుడి ?
అరగని తరగని వాడవని – అక్షరదానం బెవనిది ?
అరువదేండ్లు ప్రజల కొరకు – అరిగిన కాయం బెవనిది ?
తన బరువును మోయలేని – తనువును చాలించె నెవడు ?
తరతరాలు యెవని మేలు – తరలుచు పొరలుచు నుండును ?
అందరి కెవనితో పొత్తు – అఖిలాంధ్రం బెవనిసొత్తు
ఏ స్థాన కవిని నేనో – ఆ స్థానాధీశు డెవరు ?
వయోవృద్ధుడగు యువకుడు – వాస్తవ జీవిత మతనిది
"హరి సర్వోత్తము" డాతడు – ఆంధ్రులపాలిటి దేవుడు.

ఆంధ్రదేశంలో శకపురుషుడుగా భావింపబడుతున్న వీరేశలింగం పంతులు గారిని గురించిన చిన్న పద్యమొకటున్నది.

– తన దేహము తన గేహము
తన విద్యయు తన ధనంబు ...
జగజ్జనులకు వినియోగించిన ఘనుడీ
వీరేశలింగకవి జనులారా ! –

వీరేశలింగకవి హెచ్చుగా భాషాసేవ గావించినారు. తన రచనలద్వారా, కార్యక్రమములద్వారా నాటి సంఘంలోని చెడుగును తొలగించుటకు విశేషముగా పాటుబడినారు. సార్థక నామధేయుడైన శ్రీ సర్వోత్తమరావుగారు కూడ చిన్ననాడే దేశమాతసేవకు కంకణం కట్టుకొని కష్టనష్టములను సరకుగొనక, స్వార్థ చింతను దరికి రానీక జీవితాంతం వరకు దేశాభ్యుదయాని కుపకరించే అనేక ఉద్యమాలలో బహుముఖముల పాల్గొన్నారు. వీరి సేవలు ఏ ఒక్క రంగానికో పరిమితం కాలేదు. చేజిక్కిన ఏ ఒక్క అవకాశాన్నికూడా వారు వదలలేదు.

ప్రతి పనిని మీదవేసుకొని వాటిని చక్కగా నిర్వహించినారు. వారు పూనిన పని మీద చిత్తమును పూర్తిగా లగ్నం చేసినారు. పనులలో గాని, వ్యక్తులలోగాని వారుచ్చ నీచములను పాటించలేదు. అన్ని మతములను, కులములను ప్రాంతములను, భాషలను సమానముగా ఆదరించినారు. పురుషులవలె స్త్రీలకుకూడా సమాన హక్కులుండవలెనని చాటినారు. రాజకీయంగా కాంగ్రెసుకు చెందినవారైనప్పటికీ సేవాకార్యములలో వారు ఇతర పార్టీలతో కలసి పనిచేసినారు. "మానవసేవయే మాధవసేవ" యని భావించినారు. పనినే ప్రార్థనగా అమలు జరిపినారు.

## జీవిత సంగ్రహము

శ్రీ సర్వోత్తమ రావుగారి పూర్తి పేరు "హరి సర్వోత్తమరావు". ఇంటి పేరు గాడిచర్ల. వీరి తండ్రి వెంకట్రావుగారు. తల్లి భాగీరథీబాయి. వీరు 1883వ సం. సెప్టెంబరు 14వ తేదీన కర్నూలులో జన్మించినారు. వీరి బాల్యం అక్కడనే గడచినది వీరి పూర్వీకుల జన్మస్థానం కడపజిల్లా పులివెందల తాలూకాలోని సింహాద్రిపురం అనే గ్రామం. తండ్రిగారు ఉద్యోగరీత్యా కర్నూలు మండలమునకు వచ్చినారు. ఆరునెలల ప్రాయంలోనే కన్నతల్లి మరణించగా, వీరిని పెదతల్లి సాకింది. వకీలువృత్తిలో నున్న పినతండ్రి శ్రీ శ్రీనివాసరావుగారి వద్ద కొంతకాలం, మేనమామగారి యింట్లో కొంతకాలం వీరు పెరిగినారు వీరికి అక్షరాభ్యాసం కంభం తాలూకా రావిపాడులో జరిగింది 8వ యేట ఉపనయనం చేశారు. కర్నూలు మునిసిపల్ పాఠశాలలోను, గుంతకల్లులోని లండన్ మిషన్ పాఠశాలలోను విద్యాభ్యాసం చేశారు 1893 సం. నుండి 1900 సం. వరకు హైస్కూలు విద్యను పూర్తిచేసుకున్నారు. విద్యార్థిగా ఉన్నప్పుడే హైస్కూలులో సారస్వత సభలు నిర్వహించేవారు. నిత్యం వ్యాయామం చేసేవారు. కుస్తీ, చెడుగుడు మొదలయిన ఆటలలో పాల్గొనేవారు. చదువులోకూడ చురుకుగా ఉండేవారు. పబ్లిక్ పరీక్షలో ఆయన ప్రథములుగా నెగ్గినారు దీని ఫలితంగా వారికి ఉపకారవేతనం (స్కాలర్‌షిప్) లభించింది. మదరాసులోని క్రిష్టియన్ కాలేజిలో సీటు దొరికింది. 1901 నుండి 1906 సం. వరకు అక్కడ చదివి ఎం. ఏ. పట్టం సంపాదించినారు. అక్కడకూడ సభలు నడుపుతూ, ఆంధ్రాంగ్లభాషలలో ఉపన్యాసాలిస్తూ

వుండేవారు. బి. ఎ. లో వారు చరిత్ర, అర్థశాస్త్రం, రాజకీయ శాస్త్రం అభ్యసించి నారు. ఎం. ఏ. లో ఆంధ్ర కన్నడ భాషలు, భాషాశాస్త్రం చదివి నారు. విద్యార్థి దశలోనే నగరంలోని సంఘసేవా కార్యక్రమాలలో పాల్గొంటూ వుండేవారు. వారి దస్తూరికి యూనివర్సిటీవారు స్వర్ణపతకం యిచ్చారు. సత్ప్రవర్తనకుతోడు మాతృదేశాభిమానము. చదువులపై శ్రద్ధ, గురువులయెడ భక్తి, ఉత్తమ గ్రంథ పఠనాసక్తి వారి కుండేవి. ఈ లక్షణాలన్నీ వారి భవిష్యత్తును తీర్చిదిద్దినవని చెప్పవచ్చును.

మదరాసు క్రిస్టియన్ కళాశాలలో చదువుతున్నప్పుడే జాతీయ విద్యాభి వృద్ధికై పాటుబడవలెనను సంకల్పం వీరికి కలిగింది

1906వ సం.లో మదరాసులో శ్రీ కొమర్రాజు వెంకట లక్ష్మణ రావుగారు 'విజ్ఞాన చంద్రికా గ్రంథ మండలిని' స్థాపించినారు. మాతృభాషలో గ్రంథ ప్రచురణను సాగించుటకై ఈసంస్థ ప్రారంభించబడినది. దీనిద్వారా దేశచరిత్రలు, శాస్త్ర గ్రంథములు, మహాపురుషుల జీవిత చరిత్రలు మున్నగు వాటిని వెలువరించి నారు. తెలుగులో "విజ్ఞాన సర్వస్వ" ప్రచురణకు కూడ వీరు పూనుకొన్నారు. ఈ సంస్థకు శ్రీ లక్ష్మణరావుగారు ప్రధాన సంపాదకులు శ్రీ కాశేశ్వరరావుగారు, శ్రీ హరి సర్వోత్తమరావు గారు కార్యదర్శులుగా నుండిరి. ఈ గ్రంథమాలలో మొదటిగా వెలువడిన "అబ్రహాం లింకన్ చరిత్ర"కు శ్రీ హరి సర్వోత్తమ రావు గారే గ్రంథకర్త. వీరు ఇంగ్లీషులోని థేయర్స్ అను రచయిత వ్రాసిన రచనకు అనువాదం చేసినారు విజ్ఞాన సర్వస్వ ప్రచురణలో కూడ శ్రీ సర్వోత్తమ రావు భాగస్వాములు. దీనిలో అచ్చుయంత్రములను గురించి, అట్టకట్టుట(బైండింగ్) ను గురించి వీరి అమూల్య రచన లున్నవి. జటిలమైన సాంకేతిక విషయములను సులభగ్రాహ్యముగ నుండునట్లు వీరి రచనలను గావించినారు.

ఎం.ఏ. డిగ్రీ తీసుకొన్న తరువాత శ్రీ సర్వోత్తమ రావుగారు ఉపాధ్యాయ శిక్షణ బడయు సంకల్పంతో రాజమహేంద్రవరం లోని గవర్నమెంటు టీచర్స్ ట్రైనింగ్ కాలేజిలో ప్రవేశించినారు. తానొక ప్రక్క పగలు చదువుకొంటూ వయోజనులకు రాత్రి పాఠశాలను ప్రారంభించినారు. దీనిలో 90 మంది వయో

జనులు విద్యార్థులుగా చేరినారు. వీరికి అక్షరాలు నేర్పడంతోపాటు పత్రికలను చదివి వినిపిస్తూ అబ్రహాం లింకన్ చరిత్రను చెప్పేవారు.

బెంగాల్ విభజన జరిగినప్పుడు బయలుదేరిన వందేమాతరమ్ ఉద్యమారంభంలో బిపిన్ చంద్రపాల్ రాజమండ్రికి వచ్చి అక్కడ చేసిన ప్రసంగాల మూలంగా విద్యార్థిలోకంలో గొప్ప ప్రబోధం కలిగింది. దీనిపై విద్యార్థులు "వందే మాతరమ్" బిళ్ళలు ధరించి కాలెజీకి హాజరైనారు. వాటిని తీసివేయుడని ప్రిన్సిపాల్ హంటర్ గద్దించినాడు. విద్యార్థులాయన ఆదేశాన్ని పాటించలేదు. అప్పుడతడు వారిని కాలేజినుండి వెళ్ళిపొమ్మన్నాడు. విద్యార్థులు గేలిచేస్తు కేకలనారంభించినారు. ఆసమయంలో శ్రీ హరి సర్వోత్తమరావు వచ్చి విద్యార్థులను శాంతింపజేసినారు. దీనిపై రావుగారే దీనికంతా కారణమని చెప్పి హంటర్ ఆయనను కాలెజినుండి బర్తరఫ్ చేసినాడు. అప్పుడు విద్యార్థులంతా బయటకు వచ్చి, గోదావరిలో స్నానంచేసి తిరిగి కళాశాలకు పోమని శపథం చేసినారు. వీరికి నాయకుడైనాడు మన కథానాయకుడు. 160 మంది విద్యార్థులకు జరిమానాలు విధి చడంతో పాటు ప్రభుత్వం శ్రీ సర్వోత్తమ రావుగారికి ఎక్కడా ఉద్యోగమివ్వరాదని ఆంక్ష విధించింది. (ఈ ఆంక్షను కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడిన అనంతరం 1937 అక్టోబరు 25వ తేదీన మదరాసు ప్రభుత్వ- విద్య, ప్రజారోగ్య శాఖవారి 2498 జి వో. ద్వారా రద్దు చేసింది )

తదుపరి శ్రీ బిపిన్ చంద్రపాల్ ఆంధ్రదేశ పర్యటనకు వచ్చినప్పుడు శ్రీ సర్వోత్తమ రావుగారు కూడ ఆ పర్యటనలో పాల్గొన్నారు. 'వందేమాతరమ్' ఉద్యమం మరికొన్ని పట్టణాలకు కూడ ప్రాకింది పాశ్చాత్య విద్యాలయాల బహిష్కరణ తీర్మానంతో దేశం నలుమూలల జాతీయ విద్యాలయాలు బయలు దేరినవి. బందరులోని ఆంధ్రజాతీయ కళాశాల ఆవిధంగా ఏర్పడినదే దీని స్థాపన ప్రయత్నాలలోను, దీని పోషణకు విరాళాలు వసూలు చేయుటలోను శ్రీ సర్వోత్తమ రావుగారు భాగస్వాములుగా నున్నారు. ఈ సంస్థ పాలకవర్గంలో వీరు చాలా కాలం సభ్యులుగా ఉన్నారు.

స్వరాజ్యమును గురించిన భావాల ప్రచారం నిమిత్తం ఆరోజులలో దేశభక్తుల పత్రికలను సాధనాలుగా చేసుకొన్నారు. దీనికి చక్కని ఉదాహరణ

తిలక్ గారి "కేసరి" వంటి పత్రికలు. శ్రీ హరి సర్వోత్తమ రావుగారు బెజవాడకు వచ్చి శ్రీ బోడి నారాయణరావు, శ్రీ పింగళి లక్ష్మీనారాయణ గార్లను కలసి "స్వరాజ్య" పేరుతో తెలుగు వారపత్రికను ప్రారంభించినారు. దీనికి శ్రీ సర్వోత్తమ రావుగారు ప్రధాన సంపాదకులు.

1908వ సం. లో విప్లవకారులు తిరునల్వేలి జిల్లాలో ఆంగ్లేయాధికారిని చంపగా, అక్కడ గుమిగూడిన ప్రజలపై పోలీసులు కాల్పులు జరిపినారు. ఈ సంఘటనలో ముగ్గురు దేశీయులు మరణించారు. దీనిపై శ్రీ రావుగారు "స్వరాజ్య" లో తీవ్రమైన భాషలో సంపాదకీయం వ్రాసినారు. అపైన ప్రభుత్వం సంపాదకుని పైన, ముద్రాపకులైన శ్రీ బోడి నారాయణరావు గారిపైన రాజద్రోహనేరం మోపి మన కథానాయకునికి 6 నెలలు, శ్రీ నారాయణరావుగారికి 9 నెలలు శిక్ష విధించింది దీనిపై ప్రభుత్వం హైకోర్టుకు అప్పీలు చేయగా శ్రీ సర్వోత్తమరావు గారి శిక్షను 3 సంవత్సరాలకు పెంచారు. లోకమాన్య బాలగంగాధర తిలక్‌ను కూడ శ్రీ సర్వోత్తమరావు గారిని అరెస్టు చేసిన నాడే పూనాలో అరెస్టుచేసి 6 సంవత్సరాలు కఠినశిక్ష విధించి, బర్మాలోని మాండలే జెయిలులో నిర్బంధించారు. ఈవిధంగా మన కథానాయకుడు ఆంధ్రదేశంలో ప్రథమ రాజకీయ ఖైదియైనారు. ఆంధ్రుల దేశభక్తిని, పౌరుషాన్ని లోకానికి చాటినారు. ఆరోజులలో "ఆంధ్ర తిలక్"గా శ్రీ సర్వోత్తమరావు వ్యవహరింపబడినారు.

శ్రీ సర్వోత్తమరావు ఎం. ఏ పట్టభద్రులు. నిండుయౌవనంలోనున్న వ్యక్తి. వీరిని చోరులు, హంతకులమధ్య వెల్లూరు సెంట్రల్ జైలులో ప్రభుత్వం నిర్బంధించింది. వీరికి మానసంరక్షణకు రెండు గోచీలు, మూరెడు చదరం గల రెండు తువ్వాళ్ళు, పండుకొనుటకు చిన్న ఈతాకుచాప, అన్నంతినడానికి మట్టి చట్టి, నీళ్ళు త్రాగడానికి మట్టిముంత, మలమూత్ర విసర్జనకు మరొక మట్టి చట్టి యిచ్చినారు. కాలికి లావాటి కడియం, మెడకు మరొక కడియం వేసి ఒక కొయ్యముక్కను వీటిలో దూర్చారు. మొలత్రాడు, జందెము తీసివేశారు. పండ్లు మట్టితో తోముకోవాలి. స్నానానికి రెండు, మూడు ముంతల నీళ్ళు మాత్ర మిచ్చేవారు. ఈ స్నానంకూడ నిత్యం ఉండేదికాదని వారు నాతో చెప్పారు. ఇక భోజనం రాగి సంకటి ముద్ద - దీనిలో రాళ్ళు, పుల్లలు, మట్టి ప్రత్యక్ష

మయ్యేవి. శాకపాకముల క్రింద ఆకులలములతో. వాటి నంటియుండు గడ్డి గాదములు పురుగులతో కలిసిన "పులుసు నీరు" పోసేవారు. కుక్కలైనా ముట్టని యీ తిండితో వారు 3 సంవత్సరాలు ఎలా కాలక్షేపం చేశారో ఈశ్వరునికే ఎరుక! ఎంత నిగ్రహం, దీక్ష లేకుంటే ఈ మహాయోగాని కవకాశముంటుంది! ఈ విద్వాంసుడు చదువుకొనుటకు పుస్తకములు తెప్పించుకొనుటకు వీలులేదు. జైలు అధికారులెవ్వరుగాని వారితో మాట్లాడినా, వారిపట్ల సానుభూతి చూపినా ఉద్యోగాలు పోతాయని భయపడే వారట! 3 నెలల కొక పర్యాయం ఒక ఉత్తరం వ్రాయడానికి, ఒక ఉత్తరం పొందడానికి మాత్రమే అవకాశ ముండేది. ఈ విషయమొక్కటేచాలు - శ్రీ సర్వోత్తమరావు మహిమను చాటుటకు. గవర్నరు జైలును సందర్శించినప్పుడు తన్ను మనుష్యమాత్రునిగా చూడవలసి నదిగా వారు కోరగా, ఆ అధికార మదాంధుడు దుర్భాషలను పలికినాడట!

"అచ్చటి జీవితాన్ని నేనంతటి ఔదాసీన్యంతో చూచుటకు నాకీశ్వరుడు శక్తి నిచ్చెను." అని శ్రీ సర్వోత్తమరావుగారు తమ జైలు అనుభవాలను గురించి స్వయంగా చెప్పుకొన్న మాటలలో మన కొక గొప్ప కర్మయోగి దర్శన మిస్తాడు.

3 సంవత్సరాలు తాము కారాగారంలో నున్నప్పుడు అష్టకష్టముల ననుభ వించి, వాటినన్నిటిని ఓర్పుతో భరించి, తాము విడుదలయైననాడు పూల మాలతో, చిరునగవుతో తన్ను పూజింపవచ్చిన ప్రియసతి శ్రీమతి రామాబాయి గారి వంటి సతి వారికి లభించటం పూర్వపుణ్య విశేషమే ననిపిస్తుంది

1914వ సం. లో డాక్టర్ అనిబిసెంట్, తిలక్ మహాశయుడు ప్రారం భించిన "హోంరూల్ లీగ్"కు ఆంధ్రలో ఏర్పడిన శాఖకు శ్రీ సర్వోత్తమరావు కార్యదర్శిగా నుండి రాష్ట్రమంతటా పర్యటించి ప్రచారం చేశారు. వేలాది ప్రజల సంతకాలతో స్వరాజ్యకాంక్షను వెల్లడిస్తూ ప్రభుత్వానికి వినతిపత్రాలు పంపినారు.

1920వ సం.లో కలకత్తాలో జరిగిన "ప్రత్యేక కాంగ్రెస్"లో సహాయ నిరాకరణ తీర్మానం ఆమోదించబడినది. శ్రీ సర్వోత్తమరావు దక్షిణ భారత

సత్యాగ్రహ సంఘ సంయుక్త కార్యదర్శిగ నియమింపబడి ప్రచార కార్యక్రమంలో పాల్గొన్నారు.

1923 లో జరిగిన కాకినాడ కాంగ్రెసుకు పిమ్మట మోతిలాల్ నెహ్రూ, చిత్తరంజన్ దాస్ ప్రభృతులు ఏర్పాటు చేసిన స్వరాజ్యపార్టీలో శ్రీ సర్వోత్తమ రావుగారు చేరారు. దీని నిర్వహణ బాధ్యతలను వారికి అప్పగిస్తూ 1924 నవంబరు 28వ తేదీన మోతీలాల్ నెహ్రూ వారికొక జాబు వ్రాశారు. శ్రీ సర్వోత్తమరావు వంటి దేశభక్తుడు స్వరాజ్య పార్టీలో చేరడానికి చేసుకొన్న నిర్ణయం చాల విజ్ఞతతో కూడినదని శ్రీ మోతీలాల్ ఆ లేఖలో అభినందించారు.

మదరాసు రాష్ట్రంలో నున్న ఆంధ్ర జిల్లాలకు ప్రత్యేక రాష్ట్ర కాంగ్రెసు సంఘం ఏర్పడినప్పుడు దీనికి శ్రీ సర్వోత్తమ రావు గారొక కార్యదర్శిగ నియమింపబడినారు కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలను వీరి కార్యక్షేత్రంగా నిర్ణయించినారు కాంగ్రెస్ కార్యక్రమంలో నిర్మాణ కార్యక్రమానికి ప్రముఖస్థాన ముండేది. ఖద్దరు బోర్డులకు కూడ వీరు ప్రధాన కార్యదర్శిగ పనిచేసేవారు. స్వయంగా ఖద్దరు విక్రయిస్తూండేవారు.

1924 జనవరి 1,2 తేదీలలో కాకినాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు వలంటీర్ల మహాసభ ద్వారా ఏర్పడిన "హిందుస్థానీ సేవాదళ్" నిర్మాతలలో ప్రధానపాత్రధారి శ్రీ సర్వోత్తమరావు. రాష్ట్ర వలంటీరు మహాసభలకు వీరు హాజరవుతూ వుండేవారు,

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘం నిర్ణయానుసారం 1927లో కాంగ్రెస్ పక్షాన శ్రీ సర్వోత్తమ రావుగారు కర్నూలు జిల్లానుండి మదరాసు కౌన్సిలు సభ్యత్వానికి పోటీచేసి అత్యధికమైన మెజారిటీతో ఎన్నికైనారు, వీరి ప్రత్యర్థి శ్రీ శరభారెడ్డి వీరి గుణగణాలను ప్రశంసించి ఆయన కాంగ్రెసువాడు గనుక ఆయనకు పోటీ ఉంటినన్నాడు. మదరాసు కౌన్సిలు సభ్యులుగా వున్నకాలంలో తన నియోజకవర్గం ప్రజలకు శ్రీ సర్వోత్తమరావు గారొనర్చిన సేవ ఆదర్శప్రాయ మైనది. మదరాసు కౌన్సిలులో సభ్యులుగా వుంటున్నప్పుడు ఆంధ్ర యూనివర్సిటీ సెనేట్ సభ్యులుగా కూడా అనధికార సభ్యుల నియోజకవర్గం నుండి ఎన్నికై ఆసంస్థ అభివృద్ధికి ఎంతో పాటుబడినారు.

మహానంది క్షేత్రంలో జరిగిన ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభలో జాతీయ విద్యాప్రణాళికను తయారు చేయుటకు శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య, శ్రీ హరి సర్వోత్తమ రావు గార్లకు బాధ్యత నిచ్చినారు. దీనికై జాతీయ విద్యా ఉపసంఘం ఏర్పాటు చేసినారు వీరు తమ నివేదికలో స్థానిక పరిపాలనా సంస్థలలో నిర్మాణ కార్యక్రమమును కొనసాగించ వలసిన తీరును వివరించినారు.

## నిర్మాణ కార్యక్రమాలు

1905వ సం. నుండి 1930వ సం. వరకు ఆంధ్ర రాజకీయాలలో ప్రధాన పాత్ర వహించిన శ్రీ సర్వోత్తమ రావుగారి కృషి అటుపైన హెచ్చుగా నిర్మాణ కార్యక్రమము వైపునకు మరలి ఎన్నో సేవా కార్యక్రమాలలో వారు భాగస్వాములైనారు. ముఖ్యంగా గ్రంథాలయాలు, వయోజన విద్యలకు సంబంధించిన ఉద్యమానికి వారు నాయకులైనారు. అయితే రాజకీయములకు వారు పూర్తిగా దూరం కాలేదు. వివిధ సమస్యలపై తమ భావములను నిర్ద్వంద్వంగా ప్రకటిస్తూవచ్చినారు. దీనికి 'గ్రంథాలయ సర్వస్వము' లోను, 'కౌమోదకి', 'మాతృసేవ' మున్నగు పత్రికలలోను ప్రచురితమైన వ్యాసములే సాక్ష్యమివ్వగలవు.

మన దేశప్రజలలో విద్యావ్యాప్తికై ఎందరో మహనీయులు కృషి చేశారు. ఆంధ్రదేశంలో 1914వ సం.లో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ మేర్పడినది. ఇది భారతదేశంలో మొట్ట మొదటిగా బయలుదేరిన గ్రంథాలయ సంఘము. సరస్వతీ పూజలో అగ్రగణ్యులైన శ్రీహరి సర్వోత్తమ రావుగారు అపారజ్ఞానాన్ని సంపాదించినారు తమ శక్తి యుక్తులను స్వార్థం కొరకు ఉపయోగించుకొనక పామర జనుల శ్రేయస్సుకు వినియోగించినారు. వయోజన విద్యా భాగంగా గ్రంథాలయోద్యమానికి తమ జీవితాన్ని అర్పణ చేసినారు. 1934 సం. నుండి జీవితాంతం వరకు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి అధ్యక్షులుగా నుండి నిరంతరాయ

మైన ప్రచారంలో తమ కాలాన్ని వెచ్చించినారు. సంఘానికి వీరధ్యక్షులుగా నున్న కాలంలో చాలాపని జరిగినది. దీనికి స్థిరవసతి ఏర్పడినది. పటమట లంక సమీపంలో ఎకరం స్థలం సంపాదించి దీనికో సంఘ కార్యస్థానానికి దివ్యమైన రెండంతస్థుల భవనం నిర్మించ బడినది. అద్వితీయ మైన వీరి సేవకు చిహ్నంగా ఈ భవనాన్ని వీరి పేరట నామకరణం చేసినారు. సంఘానికి మద్దతుగా కీ. శే. కొమ్మా సీతారామయ్యగారేర్పాటుచేసిన ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టుకు సంఘంతో పాటు యావజ్జీవ అధ్యక్షులుగా నియమితులైనారు. దీని పక్షాన శ్రీ సర్వోత్తమ రావుగారి వయోజన విద్య పుస్తకాలు, అక్షరాభ్యాస పటము, శ్రీ గోటేటి జోగిరాజు గారి వ్యవసాయ విజ్ఞాన సంపుటాలు - పదుల సంఖ్యలో ఎన్నో కూర్పులు వెలువరింపబడినవి. వీరి త్యాగాన్ని పురస్కరించుకొని పలువురు దాతలు ముందుకు వచ్చి శ్రీ సర్వోత్తమ భవనానికి విరివిగా విరాళములు నిచ్చి నారు. "బాపూజీ మందిర" మని నామకరణం చేసిన పై అంతస్థు నిర్మాణానికి కేంద్ర ప్రభుత్వం, గాంధీ స్మారక నిధి వారు ధనసహాయం చేసి తోడ్పడినారు. శ్రీ సర్వోత్తమ భవన ప్రవేశ సమయమున 'వ్యవసాయ ధురీణ' శ్రీ గోటేటి జోగిరాజు, 'విజ్ఞానవేత్త' శ్రీ కాశీపట్నం కొండయ్య, 'అభినవ సహదేవ' శ్రీ యేజెళ్ళ శ్రీరాములు గార్లను; బాపూజీమందిర ప్రారంభోత్సవ సమయమున సుప్రసిద్ధ దేశభక్తులు, సంఘ సంస్కర్తలు నగు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారిని సన్మానించారు. వార్షికంగా జరిగే ఆంధ్రదేశ గ్రంథాలయ మహా సభలలో ప్రచార నిర్వహణ, వయోజన విద్య శాఖల ప్రత్యేక సమావేశాలు. చక్కని ప్రదర్శనలు ఏర్పాటైనవి 23 నుండి 28 వరకు మహాసభల విశేషా లతో ప్రత్యేక సంచికలు ప్రచురించబడినవి. సంఘ పక్షమున నడచిన 'గ్రంథా లయ సర్వస్వము', 'ఆంధ్ర గ్రంథాలయ పత్రిక' లకు వీరు సంపాదకులుగా నుండినారు. ప్రతి మహాసభతోను నిర్వహించిన వివిధ శాఖా సమావేశములలో తాము స్వయముగ వ్రాసిన వ్యాసములను వీరు చదివినారు. దీనికొరకు వారు గ్రంథాలయ శాస్త్ర గ్రంధములను సహితము పఠించినారు. వయోజనవిద్యాశాఖా సమావేశములలో పెద్దలకు "మాదిరి పాఠములు" బోధించేవారు.

వివిధ ప్రాంతములలో ఆంధ్రదేశ గ్రంథాలయసంఘం నిర్వహించిన శిక్షణ తరగతులకు వీరు ప్రధానాధ్యాపకులుగా నుండి ఆర్థిక రాజకీయ విషయములు, సాహిత్య చరిత్రలు. వయోజన విద్య, భూగోళము, వాతావరణ శాస్త్రము, గాంధిజీ నిర్మాణ కార్యక్రమము మున్నగు వివిధ విషయములు బోధించెడివారు. గ్రంధాలయ కార్యకర్తలకు వయోజన విద్యాబోధకులకు సంఘం వేరువేరు తావులలో నిర్వహించిన తాత్కాలిక శిబిరములకు కూడ తప్పక వచ్చి, పాఠములు చెప్పెడివారు. ఈ శిబిరములు నడుపునప్పుడు శిక్షణ నిమిత్తం వచ్చే అభ్యర్థులతో పాటు ఆయా గ్రామాలలోని ప్రజలుకూడ వీరి పాఠములకు హాజరై ఎంతో ఆసక్తితో వింటూవుండేవారు. పగలు రాత్రికూడ, వేసవిలో సహితము విశ్రాంతిని కోరక, పునశ్చరణ తరగతులను నిర్వహిస్తూ విద్యార్థులచేత తాము నేర్పిన అంశములను చెప్పించుచు వుండేవారు ఆనాటి విద్యార్థులు కూడ ఓపికతో, శ్రద్ధతో వారు చెప్పు విషయములను వినడమేకాక, వారి జీవితమును గమనించి ఎంతో ప్రభావితులయ్యేవారు

1938వ సం. లో నేను ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘకార్యదర్శినైన తదుపరి మొదటిసారిగా విజయవాడ తాలూకా పటమట గ్రామంలో శ్రీ అచ్చయ్య ధర్మగ్రంథాలయంలో 1941వ సం. మే నెలలో నెలదినములపాటు గ్రంథాలయ ప్రవేశ తరగతిని నిర్వహించినాము. దీనికి శ్రీ సర్వోత్తమ రావుగారే ప్రధానాచార్యులు. ఆనాడు పటమటలో పోస్టాఫీసు లేదు. మేము విద్యార్థులకు ఉచిత భోజన వసతుల నేర్పరచినాము. ఈ యేర్పాట్లు శ్రీ కొమ్మా సీతారామయ్యగారు చూచినారు. పాఠములు చెప్పుటకు నేను, శ్రీ సర్వోత్తమరావుగారు గాక, మరి కొందరిని కూడ ఆహ్వానించినాము. వీరికొరకు నేను తరచు తిరుగవలసి వచ్చేది. నాకు సహాయకు లెవ్వరు లేనందున టపాతెచ్చు బాధ్యతకూడ నాపై బడినది. ముందు మాట యిచ్చిన కొందరు అధ్యాపకులు రాలేదు. దీనిపై నేను ఆందోళన పడుట శ్రీ రావుగారు కనిపెట్టినారు. వారు నాతో యిలా అన్నారు. "నాగభూషణంగారూ! మీరు భయపడవలసిన పనిలేదు. ఒక్క సైన్సుతప్ప తక్కిన విషయాలేవైనను నేను చెప్పగలను. నాకు కావలసిన పుస్తకాలు తెచ్చియివ్వండి."

ఇలా అనడమే గాక సమయం చాలకున్నను. శ్రమ అధికమైనను లెక్క సేయక, వారు ఒక్కొక్క రోజు తెల్లవారుఝాము వరకు మేల్కొని పాఠములు సిద్ధంచేసుకొనేవారు. ఒకనాటి రాత్రి మూత్రవిసర్జనకై బయటికి పోయినప్పుడు వారిని తేలు కుట్టినది. ఆ బాధను వారు లక్ష్యపెట్టకుండా పాఠములను సిద్ధము చేసుకొను పనికి పూనికతో కూర్చున్నారు. దీనిని స్వయంగా చూచిన విద్యార్థులకు వారిపై కుదిరిన భక్తిని గురించి నేను వర్ణించలేను. వారి ఆచరణప్రభావము ఆ నాటి మా విద్యార్థులపై బాగా పడినది.

అంతకుముందు మూడు సంవత్సరములనుండి సంఘానికి వారధ్యక్షులుగ, నేను కార్యదర్శిగ ఉన్నప్పటికీ మాకంతగా సన్నిహితత్వం లేదు. వారి గొప్పతనాన్ని గురించి విని మనసులో నేను వారిపట్ల ఎంతో గౌరవం కలిగి యుండెడివాడను. నాపై వారికెట్టి అభిప్రాయం ఉండేదో తెలియదు. తీరిక సమయాలలో అప్పుడప్పుడు జీవితంలో వారనుభవించిన యిబ్బందులను వారి ద్వారా విని నేను చాల బాధపడినాను. ఇంతటి మహనీయుడు తన మనుగడకు ఇబ్బంది పడటం నేను సహించలేకపోయాను. అప్పుడు వారితో నేనొక మాట అన్నాను. "మాష్టరుగారూ! మీరేమీ బాధపడవద్దు. మీకవసరమైనప్పుడు నాకు వ్రాయండి. నేను కలిగినవాడిని కాకపోయినప్పటికీ మీపేరు చెప్పి కొంత సంపాదించి మీకు పంపగల"నని మనవి చేశాను. ఈ నా మాట వారినెంతో సంతోషపెట్టి వుంటుంది. వారిని నేను జీవితాంతంవరకు తండ్రిగా తలచుకొన్నాను. వారుకూడ నన్ను పుత్రవతుగా చూచుకొన్నారు. మాసంబంధం ఒక సంస్థలో అధ్యక్ష కార్యదర్శుల సంబంధం కాదు; ఒక కుటుంబంలోని తండ్రీబిడ్డల సంబంధం. ఇది నా మహద్భాగ్యం. వారితోడి సంబంధం నాజీవితానికెంతో వన్నెతెచ్చిందన్న సంగతి మా సన్నిహితులందరికీ తెలిసినదే!

కొందరు వ్యక్తులు నాపై ఏవో ఆరోపణలు చేసినప్పుడు వారికి శ్రీ రావు గారు చెప్పిన సమాధానం ద్వారా వారికి నాపైగల సదభిప్రాయం వ్యక్తమయ్యేది. అది నన్నెంతో అలరించింది.

శ్రీ సర్వోత్తమ రావుగారి జీవితంతో నాకు చాల ప్రమేయమున్నందున ఒకటి రెండు స్వవిషయాల నిచ్చట ప్రస్తావించటం అప్రస్తుత మనుకొనను.

ఆయనకు షష్టిపూర్తి అయినది. దీనిపై వారికి ఆంధ్రదేశంలోని 60 ప్రదేశాలలో ఉత్సవాలు నిర్వహించి వారిని గౌరవించడంతోపాటు వారి సందేశాన్ని అన్ని ప్రాంతాలవారికి అందించాలని, ఈ సందర్భాన్ని పురస్కరించు కొని కానుకలు వసూలుచేసి, దీనితో గ్రంథాలయ సంఘానికి మేము సేకరించిన స్థలంలో భవనాన్ని నిర్మించి, దీనికి రావుగారి పేరు పెట్టాలనీ నాకు సంకల్పం కలిగింది దేశసేవలో, ముఖ్యంగా గ్రంథాలయసేవలో, పండిన ఉద్దండుని ఈ మాత్రంగానైనా గౌరవించుకొనజాలని పక్షంలో మన జాతి కృతఘ్నతా దోషానికి గురియౌతుందని నా తలంపు. దీనిపై వారి షష్టిపూర్తి ఉత్సవాలను జరుపాలన్న నా సంకల్పాన్ని నేను వారికి చెప్పగా వారు "అనవసరంగా లేనిపోని బాధనెందుకు పెట్టుకుంటా"వని నన్ను మందలించినారు. సన్మానాలు, జన్మదినోత్సవాలు కోరి జరిపించు కొనే ఈ రోజులలో ఇట్టి కర్మయోగులుండడం విచిత్రంగానే వుంటుంది. ఆపైన నా పూర్తిపథకాన్ని వారికి చెప్పగా "నా నెపంతో పని ఏదైనా జరిగే లాగుంటే నన్ను నీయిష్టం వచ్చిన రీతిని వినియోగించుకొనవచ్చు" నని వారు నాకు పర్మిషన్ యిచ్చినారు.

శ్రీ రావుగారి సేవలను దీర్ఘకాలం అధికంగా పొందిన ఉద్యమాలు - గ్రంథాలయోద్యమం, వయోజన విద్యోద్యమమని చెప్పవచ్చును సంస్థలు-ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘము, దక్షిణ భారత వయోజన విద్యాసంఘము. ఏకదీక్షగా 50 సంవత్సరాలకు పైగా నడచిన వీరి సేవాజీవితంలో దాదాపు సగంకాలం గ్రంథాలయ సేవలోనే నడచినది. ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘానికి శ్రీరావుగారొనర్చిన సేవలను కొంత పైన ప్రస్తావించాను. ఇప్పుడు ఇక దక్షిణ భారత వయోజన విద్యాసంఘము సంగతి కొంత వివరిస్తాను. దీనికి కార్యదర్శిగా నుండిన కీ.శే.టి.జె.ఆర్. గోపాల్ - హరిసర్వోత్తమ రావుగారిని తమ సంఘ సేవలో బాగా ఉపయోగించుకున్నారు. ఈ సంఘానికి శ్రీ రావుగారు కొంతకాలం

అధ్యక్షులుగా నున్నారు. ఈ సంఘం నిర్వహించిన మహాసభలలోను, గోష్ఠుల లోను వీరు పూర్తిగా పాల్గొన్నారు. వీరి పత్రిక "అడల్ట్ ఎడ్యుకేషన్ రెవ్యూ" (వయోజన విద్యాసమీక్ష)కు వీరు సంపాదకులుగా నుండి అమూల్యమైన తమ రచనలతో దీనిని నింపినారు. దక్షిణ భారతంలో వీరు వయోజన విద్యావారోత్సవాలను నిర్వహించినారు. ఈ సంఘంలో నన్ను ఆంధ్రప్రాంతానికి కార్యదర్శిగా నియమించినారు. ఈ సంఘం ఆదేశాలను పాటించి ఆంధ్రదేశంలో వీరి కార్యక్రమాన్ని ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము చేపట్టి, నిర్వహించినది.

1941వ సం.లో మదరాసు ప్రభుత్వం వయోజన విద్యను నిషేధించినప్పుడు ఆంధ్రదేశ గ్రంథాలయసంఘం తెనాలిలో ప్రత్యేక మహాసభ నేర్పాటు చేసినది దీనికి శ్రీ రావుగారే అధ్యక్షులు. దక్షిణ భారత వయోజన విద్యా సంఘానికి తోడుగా మదరాసులో స్థాపింపబడిన The South Indian Adult Education Co-operative Publishing Society Ltd. (దక్షిణ భారత వయోజన విద్యా సహకార ప్రచురణ సమితి లిమిటెడ్)నిర్వహణలో శ్రీ రావుగారి పాత్ర ఎంతో ముఖ్యమైనది. దీనికి వీరే అధ్యక్షులు ఈ సంస్థపక్షమున క్రొత్తగా అక్షరాస్యులైనవారి నిమిత్తం కొన్ని చిరుపొత్తములు ప్రచురించినారు ఈ రచనలకు పోటీలు నిర్వహించి బహుమతుల నొసంగినారు. వీటి ప్రచురణకు ప్రభుత్వ సహాయమునుకూడ పొందినారు. అక్షరాస్యతా వ్యాప్తి కక్కరకువచ్చే అభ్యాస పటములను అరవంలోను, తెలుగులోను వీరు ప్రకటించినారు. తెలుగులో ప్రపంచ వయోజన విద్యావేత్త డాక్టరు లాబక్ సిద్ధపరచిన అక్షరాభ్యాస పటమును రావుగారు సంస్కరించి యిచ్చినారు. దీని నిటీవల ఆంధ్రగ్రంథాలయట్రస్టువారు పునర్ముద్రణ చేసినారు.

మదరాసులోని పెరంబూరులో శ్రీ రావుగారు పై సంఘ పక్షాన వయోజనులగు కార్మికుల నిమిత్తం రాత్రివేళల నడచు హైస్కూలును కొంతకాలం నిర్వహించినారు.

వయోజన విద్యపై వారికి గల మక్కువ ప్రజాసంస్థలద్వారా జరిగే పనితో వారిని తృప్తిపడనీయలేదు. ప్రభుత్వాన్నికూడా ఈ పనిలో భాగస్వాములుగా చేయుటకు ప్రయత్నించి కృతకృత్యులైనారు. 1948 సం.లో మదరాసు ప్రభుత్వం అక్షరాస్యత నాధారంగా వయోజన విద్యా ప్రణాళికను సిద్ధంచేసింది. బోధకుల శిక్షణకు దీనిలో ఏర్పాటుచేసినారు. ఆంధ్రప్రాంతానికి శ్రీరావుగారిని వయోజన విద్యా గౌరవ డైరెక్టరుగా ప్రభుత్వం నియమించింది. వీరి అధ్వర్యంతో వయోజనవిద్యాబోధకుల శిక్షణ తరగతులు ప్రభుత్వపరంగా ప్రప్రథమంగా శ్రీ సర్వోత్తమ భవనంలో ప్రారంభమైనవి. దీనిలో శిక్షణ పొందు భాగ్యం నాకు కలిగినది. తదుపరి ఈ తరగతులు వేటపాలెం, మహానంది, అనకాపల్లి, నందలూరు, మంగాపురం మున్నగు తావులలో జరిగినవి. అన్ని జిల్లాలనుండి వేలాది ఉపాధ్యాయులు ఈ తరగతులలో చేరి శిక్షణ పొందినారు. కొంతకాలం వీరిలో పలువురు తమతమ తావులలో వయోజన విద్యాలయాలను నిర్వహించినారు. ఒకవంక శిక్షణ కార్యక్రమాన్ని, వేరొకవంక వివిధ ప్రదేశాలలోని వయోజన విద్యాలయాలను పర్యవేక్షణను చేస్తూ, శిక్షణాలయంలో స్వయంగా పాఠాలు చెపుతూ, వీరు తమ కాలంలో అత్యధిక భాగాన్ని వయోజన విద్యాప్రచారానికి వెచ్చించినారు. కాలేజీల అధ్యాపకులు, విద్యాశాఖ ఇన్‌స్పెక్టర్లుకూడ ఈ శిక్షణ కార్యక్రమంలో పాల్గొనునట్లు వీరు ప్రోత్సహించినారు. ఆంధ్ర మహాసభ, ఆంధ్ర సారస్వత పరిషత్తువంటి సేవా సంస్థల పక్షాన నడచిన శిక్షణాలయములకు కూడ వీరు సపరివారంగా వెళ్ళి వయోజనవిద్యకు సంబంధించి ప్రబోధం చేస్తూ శిక్షణ యిస్తూ వచ్చారు.

గ్రంథాలయాలకు. వయోజనవిద్యకు సంబంధించిన వీరికృషి యావద్భారత రంగంలోకూడ కొంత నడచినది. ఇండియన్ లైబ్రరీ అసోసియేషన్‌లో ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు సభ్యత్వముంటూ వచ్చినది. అఖిల భారత గ్రంథాలయ సభలకు వీరు తరచు హాజరవుతూ, అందలి చర్చలలో పాల్గొంటూ వుండేవారు. హైదరాబాదులో పదవ అఖిల భారత గ్రంథాలయ మహాసభను జరు

పుటకు వీరు కారణభూతులైనారు. ఇండియన్ లైబ్రరీ అసోసియేషన్‌కు వీరు కొంతకాలం ఉపాధ్యక్షులుగా కూడ ఉన్నారు.

భారత వయోజన విద్యాసంఘంలో వీరు ప్రముఖ పాత్రధారులు. నాగపూరులో ఈ సంఘంవారు నిర్వహించిన అఖిల భారత వయోజన విద్యా మహాసభకు వీరధ్యక్షులుగా ఎన్నుకోబడినారు. దీనికి ముందు వీరు సొంత ఖర్చుతో వివిధ రాష్ట్రాలను దర్శించి, అక్కడ నడుస్తున్న కార్యక్రమాలను పరిశీలించి, దేశవ్యాప్తంగా జరుగుతున్న కార్యక్రమాన్ని సమీక్షచేస్తూ తమ అధ్యక్షోపన్యాసం చేసిన సభకు నేనుకూడ హాజరైనాను. ఆనాడు వారచ్చట పొందిన ఆదరం ఎన్నదగినది. వారి శక్తి యుక్తులు సభవారిని ముగ్ధులను గావించినవి. బీహారులోని "ఐక్యమ్" అనుచోట ఈ సంఘంవారు నిర్వహించిన గోష్ఠికి శ్రీ రావుగారు డైరెక్టరుగా నుండి, దీనిని కడు సమర్థతతో నిర్వహించి ప్రతినిధుల మెప్పును పొందినారు. ఈ సమావేశాల నివేదికలు అచ్చయినవి. వివరాలు కావలసినవారు వీటిని చూడవచ్చును. జాతీయంగానే గాక అంతర్జాతీయంగా కూడ వీరి పాత్ర కొలదిగా ఉన్నది. ఒకటి రెండు అంతర్జాతీయ సమావేశాలకు కూడ భారత ప్రభుత్వ ప్రతినిధిగ వీరు పాల్గొన్నారు.

ఈ విధంగా చెప్పుకుంటూ పోతే సాహిత్య అకాడమీ వారు నాకిచ్చిన సమయం చాలదు వివరాలు కావలసిన వారు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘం ప్రచురించిన శ్రీ మాదల వీరభద్ర రావుగారి రచన "శ్రీ సర్వోత్తమ జీవితం" చదువవచ్చు. "గ్రంథాలయ సర్వస్వము" ప్రత్యేక సంచికలను, అప్పుడప్పుడీ పత్రికలో మేము వెలువరించిన సంపాదకీయాది వ్యాసాలను చూడవచ్చు.

ఇప్పుడు శ్రీహరి సర్వోత్తమ రావుగారిని గురించి పత్రికలు, సంస్థలు, వ్యక్తులు, వెలువరించిన అభిప్రాయాలతో నా ప్రసంగాన్ని ముగిస్తాను. ఈ అభిప్రాయాల ద్వారా శ్రీ రావుగారి విశిష్టత శ్రోతలకు చక్కగా విశదమవుతుంది. ఈ పని చేసేటందుకు ముందు శ్రీ రావుగారు కడపటి దినాలలో గ్రంథా

లయ, వయోజన విద్యారంగముల కంటి పెట్టుకొని పనిచేయుటకు గల కారణాన్ని వారి స్వంత మాటలలో నివేదింతును:

"మన ప్రజకు విజ్ఞానము వ్యాపింపకుండుటే మన యధోగతికి కారణము. ఎల్ల యభివృద్ధికిని విజ్ఞాన వ్యాపనమే ప్రథమాధారము. అక్షరజ్ఞత దానికి మూల సాధనము. దీనితో పాటు విజ్ఞానమును వ్యాపింపజేయుటకు ఇతర సాధనము లున్నవి. పత్రికలు, గ్రంథములు చదివి వినిపించుట; ఉపన్యాసములు, మ్యాజిక్ లాంతరు సినిమా ప్రదర్శనములు, భజనలు, హరికథలు- ఇట్టివి అనంతములు. వీటన్నిటిని ఏర్పరచి కృషిచేయునట్టి ఉద్యమము గ్రంథాలయోద్యమము. ఏ యుద్యమము నందు ఉత్సాహము కొరవడినను ఈ యుద్యమము సాగుచుండెనా, ప్రజలను అంధకారము వరించదు అంధకారమున పడిపోనంతకాలము మానవుడు తల యెత్తుకొనుటకు మార్గములున్నవి. కావుననే జ్ఞానయోగమున కంత ప్రాముఖ్యము.అందుచేత సరస్వతీ మందిరము సదా సేవించదగినది.దీనిని మరువరాదు."

## శ్రీ రావుగారిని గురించిన ప్రశంసలు

వేలమంది శిష్యులకు విద్యాదానము చేయుచున్న వారిని పూర్వం 'కులపతి' అనే వారు. ఆ స్థానము నేటికి శ్రీహరి సర్వోత్తమ రావుగారికే చెందినది. వీరు అనేక భాషా విశారదులు."

– మారేపల్లి రామచంద్ర శాస్త్రి.

'నిజమున కానాడు ఆంధ్రమున హరి సర్వోత్తమ రావుగారు జన్మించి యుండని యెడల రాజకీయోద్యమమునకు పునాదియే లేకపోయి యుండవచ్చును ఆంధ్రములో రాజకీయమునకు ఆదిపురుషుడు శ్రీ హరి సర్వోత్తమ రావు'.

– యర్రమిల్లి జగ్గన్న శాస్త్రి.

"వారి సహృదయత, సాంఘిక సమభావము, గ్రామముల యెడ అపారాభిమానము, ఎత్తులు వేయని రాజకీయ వర్తనము–అన్ని తరముల వారికి ఆదర్శ

ప్రాయము. గ్రామీణుల ధోరణిని ప్రేమించెడివారు. వారి సేవకు ఉత్సాహపడెడి వారు"

– నాగినేని వెంకయ్య.

"హరి సర్వోత్తమ రావుగారి జీవిత రహస్యాలను గూర్చి చెప్పవలసిన వెన్నో ఉన్నవి. వీరు మాకు చిరస్మరణీయులైన ఆచార్యులు. అనేక రంగాలలో ప్రవీణులు. కార్యరంగంలో నడుంగట్టి దూకుతారు. విజ్ఞాన రంగంలో తోడి మిత్రులతో ఆలోచించి నెరవేరుస్తారు వారెంత కార్యశూరులో అంత వేత్తలు. వేదాంతమంటే ఉత్త తర్కంగా పరిగణించక వీరు నిత్యజీవితంలో అనుష్ఠిస్తారు. వారి జీవితంతో సన్నిహిత సంబంధం కలిగించుకొని చూచేవారికి వారి నిత్య జీవితమే వేదాంతాన్ని బోధిస్తుంది. ఆంధ్రదేశంలో సాటిలేని విజ్ఞానవేత్త. ఏ విషయంలో నైనా సరే వారికి తెలియని భాగం చాల స్వల్పం. వారి వ్యాసాలను చదివి నేను చకితుణ్ణవుతాను, జీవితంలో ఒక్క క్షణం కూడా వృథా చేయరు."

– ప్రతాపగిరి రామమూర్తి.

"వందేమాతరోద్యమంలో కొదమ సింగంవలె దూకారు. విశ్రాంతి లేకుండా అన్ని రంగాల్లో పని చేస్తున్నారు. ఆదర్శ శాసనసభ్యుడు ఎట్లుండాలో ప్రపంచానికి చాటారు. తాము గట్టిగా విశ్వసించిన దాన్ని మొగమాటానికి వదలక గట్టిగా వాదిస్తారు. తమది తప్పని తోస్తే ఒప్పుకుంటారు నీతి. నియమం, శీలం గల వారాయన."

– వావిలాల గోపాలకృష్ణయ్య.

"వీరిది పటాటోప మెరుగని నిరాడంబర జీవితం. స్త్రీవిద్యాభిమానం అపరిమితం."

– అయ్యదేవర బాలా త్రిపుర సుందరమ్మ.

"అసలు మాష్టరు గారి జీవితమే, ఏమాత్రం తెలిసిన వారినైన వారి పట్ల భక్తి పరవశులను చేస్తుంది. అయన 60 సంవత్సరములకు పైగా ఒక తాత్త్విక చింతననూ, దాని అనుష్ఠానాన్ని పరిణతి పొందించుకొని పరిపక్వము గావించు

కొన్నారు... గీతాతత్త్వాన్ని జీర్ణించుకొని నరనరాలలో ఎక్కించుకొని అది బోధించిన లక్షణాని కాయన లక్ష్యమైనారు.

"గీతోపదేశాన్ని అక్షరాలా తమ జీవితంలో ఆచరించారు కర్మిమికై వీరు తాపత్రయ పడలేదు లేమికి అణుమాత్రం చలించలేదు. దేశానికి సేవచేస్తామని చిరుత ప్రాయంలోనే శపథం చేశారు- రక్తాక్షరాలతో. దేశ సేవకులను సృష్టించ డానికి అధ్యాపక వృత్తిని ఎన్నుకొన్నారు

"ఆయన జీవితమే ఒక విశ్వవిద్యాలయం. పొట్టబోసి కొనుటకు పట్టభద్రులను సృష్టించు యూనివర్సిటీల వలె గాక మహదాశయ పూరితులైన దేశారాధకులను అగణితమైన సంఖ్యలో సృష్టించింది వారి జీవితవిద్యాలయం. ఎంతమంది ఈ సజీవ విద్యాలయంలో సుస్నాతులైనారో చెప్పలేము...

"ఆయన బహిరంగ సభలో ఉపన్యసిస్తుంటే ఒక పెద్ద క్లాసుకు పాఠం చెపుతున్నట్లుండేది....

"వారు పుస్తకాలు వ్రాసినా పత్రికలలో వ్యాసాలు వ్రాసినా ప్రజలకు విజ్ఞాన వికాసాలు కలిగించాలనే తీవ్ర కాంక్ష వారిలో ద్యోతక మౌతూ వుండేది.

"వారి ఎన్నికల ప్రచారం ప్రజాసామాన్యానికి రాజకీయ విద్యాలయం వంటిది.

"ప్రజలలో విద్యా వికాసాలు కలిగించాలనే తీవ్రమైన వారి ఆకాంక్షకు, అధ్యాపక చిత్తవృత్తికీ ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమం, వయోజన ఉద్యమం బంగారమునకు వెలిగారము వలె సరిపోయినవి. అందుకనే 25 సం. లకు పైగా అవిచ్ఛిన్నంగా ఈ ఉద్యమాలకు వారు నాయకత్వం వహించారు. వారీ భూమిని విడిచి వెళ్ళేవరకు ఈ ఉద్యమాలు వారిని వీడలేదు. ఇంతటి దీర్ఘకాలం వారు నాయకత్వం వహించిన ఉద్యమరంగాని, వారి నాయకత్వాన్ని అంగీకరించి, అనుసరించిన సార్వజనిక సేవారంగంకాని మరొకటి లేదు. వారు దశలవారీగా పరిణతి పొందింప జేసుకుంటూ వచ్చిన తాత్త్విక చింతన, అనుష్ఠానము ఈ రంగంలో పరిపక్వమైనవి......

ప్రయోజన విద్య ద్వారా దేశపు యజమానులగు ప్రజలు అంధకారంలో ఉండకుండా వారికి విజ్ఞాన వికాసాలు కలుగ జేయడానికి యత్నించాలి."

— కోదాటి నారాయణరావు.

"శ్రీ సర్వోత్తముని జీవితం మన బాధలను మరపింప జేస్తుంది. పట్టుమని పది వ్యాసాలు వ్రాయగానే అవి అచ్చయ్యేదాకా దుగ్ధ, పదినెలలు ప్రజాసేవంటూ చేసేసరికి ఏదో ప్రతిఫలం రాలేదంటూ అలసట కలగటం లోకంలో చూస్తున్నాం. ఎన్నేళ్ళు, ఎట్టి కష్టాల్లో — ఆయన దేశసేవలో నిమగ్నులై నిష్కామకర్మ చేశారో! రావుగారి జీవిత విధానమే ప్రతి ప్రజాసేవకునికీ మార్గదర్శకమౌతుంది.

"రావుగారే ఒక విజ్ఞానఖని. దానిని తరచి చూచినకొద్దీ ఏ విషయంలోనైనా అనేక మణులను గ్రహించవచ్చు. అది మన సంస్కారంమీద ఆధారపడి వుంటుంది గొప్పవాళ్ళ జీవిత చరిత్రలు తర్వాత తరాలవారికి ఆదర్శప్రాయమౌతాయి.

"త్యాగమయమైన, సౌశీల్యవంతమైన రావుగారి నిరాడంబర జీవితంవల్ల నేటి మన ఆంధ్ర ప్రజాజీవితంలో ఉన్నత ప్రమాణాలు నెలకొల్పడానికీ, నిష్కల్మష హృదయంతో నిస్వార్థసేవ చేయటానికీ స్ఫూర్తిని కలిగిస్తుందనటంలో సందేహమేమాత్రమూ లేదు."

— మాదల వీరభద్రరావు.

"తాను నమ్మిన సత్యపథమున కష్టనష్టములను లెక్కచేయక జీవితము భాగ్యవంతముగ (ఆర్థికముగ కాదు) ఒక యోగముగ గడపిన ధన్యజీవి, ఋషిసత్తముడు — సర్వోత్తమరావు... ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమము జీవించియుండువరకు ఆయనయు జీవించియే యుండురు.

— అయ్యంకి వెంకటరమణయ్య.

"మనమీనాడు చక్కగా యెక్కగలుగుతున్న యీ దివ్య స్వరాజ్యభవనమునకు అట్టడుగున పునాదులలోనున్న పెక్కుమంది పెద్దల సంగతి నేటితరము వారికి

తెలియకు పోవచ్చును. అట్టివారిని స్మరించి, వారికి కృతజ్ఞతాంజలుల నిచ్చుట మన కనీసధర్మము. అట్టివారిలో శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమ రావుగారొకరు."

– మానికొండ సత్యనారాయణశాస్త్రి

"ఎంత సర్వతోముఖం శ్రీ సర్వోత్తమరావుగారి జీవితకథ. సారస్వతం ఆయనను చిన్ననాడే వరించింది. పత్రికారచన ఆయనను ఉగ్గుపాలతో అలవడింది. విజ్ఞాన వ్యాప్తి ఆయన జీవితంతో పెనవేసుకుంది. ఆంధ్రోద్యమం ఆయనతోనే పుట్టి పెరిగింది. దేశసేవ ఆయన జీవితాన్ని ఆహుతి గొన్నది...ఎన్ని ఉద్యమాలకు ఆయన పితృపాదులో, ఎన్ని సంస్థలను ఆయన నిర్వహించారో ఊహించలేము."

– ఆంధ్రప్రభ

"దేశ స్వాతంత్ర్య పోరాటం, రాష్ట్రోద్యమం, గ్రంథరచన, ఆరోగ్య ప్రచారం, పంచాయతీ ఉద్యమం – ఒకటేమిటి, ప్రజాజీవితానికి సంబంధించిన అన్ని రంగాలలోను శ్రీ సర్వోత్తమరావు కృషిచేశారు."

– విశాలాంధ్ర

"యువకులను ప్రోత్సహించి వారిచేత దేశసేవ, భాషాసేవలను చేయించి; కార్యకర్తలను, నాయకులను సృష్టించిన గొప్పవ్యక్తి ఆయన. డెబ్బదియైదేండ్లకు మించిన ప్రాయములోగూడ వారియందు యువకులలోని ఉత్సాహము గోచరించెడిది. త్యాగము, విజ్ఞానము, దృఢదీక్ష మూర్తీభవించిన వ్యక్తిత్వమాయనది."

– గోలకొండ పత్రిక.

"ఆంధ్ర మహాపురుషులలో ప్రముఖస్థానం వహించి తమ జీవితాన్ని పూర్తిగా దేశసేవకే అంకితం చేసినారాయన. దేశాభ్యుదయకరమైన రాజకీయార్థిక సాంఘికాది సమస్త ఉద్యమాలలోను వారు తీవ్రంగా పనిచేసి, ఎంతో త్యాగం చేసి అనేక బాధలకు గురియైనను ఎన్నడు తమ ధీరత్వాన్ని వదలలేదు. రాజకీయ నాయకుడుగ, ప్రముఖవక్తగ, రచయితగ, జర్నలిస్టుగ ఆయన అఖండకీర్తి

ప్రతిష్ఠలను ఆర్జించినారు. పాకీ పనివారల సంఘాధ్యక్షపదవిని, శాసన సభ్యత్వాన్ని సమానదృష్టితో నిర్వహించినారు. వ్యవసాయ పనిముట్ల ఉత్పత్తిదారుల సంఘానికి, హిందూస్థాన్ సేవా దళానికి నాయకత్వం వహించినారు. ఆంధ్ర దినపత్రికకు తొలి సంపాదకుడుగ, విజ్ఞాన చంద్రికకు ప్రథమసేవకుడుగ, ఆంధ్రోద్యమానికి అతిరథుడుగ, ఆంధ్ర గ్రంథాలయోద్యమానికి మొదటి పెద్దగ, భారతావనిలోని వయోజన విద్యా గురువులలో ప్రప్రథముడుగ నుండి వారు సాగించిన బహుముఖ కార్యక్రమం మరువరానిది. ఆయన మేరు పర్వతాన్ని బోలిన వ్యక్తి, విజ్ఞానఖని, సేవావతారము, గొప్ప ఆశావాది, మహాత్యాగి. పని పని యని మరణశయ్యపై నుండి కూడ పలవరించిన కర్మయోగి పరాక్రమముతో పాటు సౌజన్యాన్ని, పాండిత్యానికి తగిన వినయాన్ని పుణికి పుచ్చుకొన్న పుణ్యమూర్తి."

– గ్రంథాలయ సర్వస్వము.

"శ్రీహరి సర్వోత్తమ రావుగారు చిన్ననాటి నుండి బహుస్వతంత్రులు, నిర్భయులు. తాను నమ్మిన దానిని ఖండితముగ చెప్పివేయగల ధీరత ఆయనలో మూర్తీభవించినది. ధనతృష్ణ లేశమైనా ఆయనకు లేదు. దారిద్ర్యమునే సంతోషముతో స్వీకరించి ప్రజాసేవ, భాషాసేవ చేసిన ధన్యజీవుడాయన"

– విజయవాణి.

"కీర్తి ప్రతిష్ఠల నాశించని మహావ్యక్తి. పదవులకై ప్రాకులాడని మహానాయకుడు. ఆయన ఆంధ్రప్రజానీకానికి నిరాడంబరముగా, బహుముఖముగా చేసిన సేవ అపారము."

– పంచాయతీ రాజ్యం.

"ఒకానొక ఉద్యమంలో చేరి తాత్కాలికమైన ఆవేశంతో ముందుకురికి త్యాగము చేయుట వేరు. నిత్య త్యాగయుక్తమైన సేవామయ జీవితమును నిష్కామబుద్ధితో జీవితాంతము కొనసాగించుట వేరు ..... ప్రాచీన పరిభాషలో మొదటిది క్షత్రియ

ధర్మము. రెండవది బ్రాహ్మణ ధర్మము. ఈ రెండు ధర్మములును ఆయనలో మూర్తీభవించినవి.

– సామ్యయోగము.

"మన స్వరాజ్యం సర్వాంగ సుందరమైన ప్రజారాజ్యంగా పరిఢవిల్లాలంటే వయోజన విద్యయే ముఖ్య సాధనమని తమ జీవితము ద్వారా సందేశ మిచ్చిన సచ్చరిత్రులు ఆయన."

– ధర్మజ్యోతి.

... . ...

విన్నారు గదా ఎందరెందరో విజ్ఞులు, ప్రముఖపత్రికలు హరి సర్వోత్తముని గురించి చేసిన ప్రశంసలు! ఇప్పుడు మన ధర్మ మేమిటో ఆలోచించు కొనవలసి యున్నది. శ్రీ రావుగారి వలె మనలోని ప్రతి యొక్కడు ఆదర్శ జీవితం గడిపే టందుకు ముందుకు రావలసి యున్నది. ఇందిరా గాంధీ ఇరవై సూత్రాలను నోటి మాటలతో బలపరచుట గాక గాంధీతత్త్వము ననుసరించి మనం శ్రీ రావు గారి అడుగు జాడలలో నడచుటకు పూనుకొన వలసి యున్నది. అందుకిదియే తరుణము. యువకులైన వారీ విషయమై ఆలోచింతురు గాక!

ఈ సదవకాశమును నాకు కలుగజేసిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీ అధ్యక్ష, కార్యదర్శులకు, ఓపికతో నా ప్రసంగాన్ని విన్న సభాసదులకు నా కృతజ్ఞతను తెలుపుకొనుచున్నారు.

శ్రీ సర్వోత్తమ భవనము — పాతూరి నాగభూషణం
విజయవాడ – 520006 — కార్యదర్శి
5-4-76 — ఆం. ప్ర. గ్రంథాలయ సంఘము

# హరి సర్వోత్తమరావుగారి దేశసేవ

- శ్రీ కోడి నరసింహం

కీ. శే. శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమ రావుగారిని గూర్చి నా పరిచయము, వారి దేశసేవ, విజ్ఞులగు మీ అందరి యెదుట మాట్లాడుటకు నాకు అవకాశము కలుగజేసిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారికి నా కృతజ్ఞతాంజలి అర్పించుచున్నాను. నంద్యాలలో విద్యార్థిగానుండి శ్రీ హరి సర్వోత్తమరావుగారి ఉపన్యాసములు తరచుగా వినుచూ ఉత్తేజితులమై వుంటిమి. వారు 1928వ సంవత్సరము ఆంధ్ర రాజకీయ మహాసభ నంద్యాలలో అద్వితీయముగా జరిపించిరి. కీ. శే. శ్రీ అనిబిసెంట్, సర్వేపల్లి రాధాకృష్ణ, కాశీనాథుని నాగేశ్వరరావు మొదలగు ప్రముఖులు ఆ సభల కేతెంచియుండిరి. విద్యార్థిగా వారి బోధనలను విను నాసక్తితో ఆ సభలకు హాజరైయుంటిని. 1929వ సంవత్సరము మహాత్మాగాంధిగారు ఆంధ్రజిల్లాల పర్యటన సందర్భమున నంద్యాల కేతెంచిరి. శ్రీ హరి సర్వోత్తమరావుగారు మహాత్ముని వెంటనుండి కార్యక్రమమును జరిపించిరి. నాటిరాత్రి మహాత్మాజీగారు విశ్రాంతి తీసుకొని మరుసటి ఉదయము బహిరంగసభలో ప్రసంగించిరి. శ్రీ హరి సర్వోత్తమరావుగారు మహాత్ముని ఉపన్యాసమును ఆంధ్రీకరించిరి. విద్యార్థులమగు మేము ఆ కార్యక్రమమున వాలంటీర్లుగా పని చేసి ఉత్తేజితుల మైతిమి.

మొదట శ్రీ రావుగారితో స్వీయపరిచయము 1931వ సంవత్సరము నంద్యాలలో రాయలసీమ హిందుస్థాన్ సేవాదళ శిబిరమును శ్రీ హరి సర్వోత్తమ రావుగారు ప్రిన్సిపాల్‌గా యుండి జరిపించిరి. అందు రాజకీయ శాస్త్రము, నిర్మాణ కార్యక్రమము గురించి శ్రీ రావుగారు వివరముగా ఉపన్యసించెడివారు. ఆ శిబిరమున వాలంటీరుగా శిక్షణపొందు భాగ్యము నాకు కల్గెను. అందు శిక్షణ పొందిన వారిలో ఎక్కువమంది 1932 ఉద్యమమున పాల్గొని జైలు శిక్షల ననుభవించిరి.

కొందరు తీవ్రవాదుల మిత్రులతో కలసి శ్రీ రావుగారి భావములు మిత వాదమని విమర్శించుచుంటిమి. ఆ రోజులలో కీ. శే. శ్రీ స్వామి నారాయణానంద సరస్వతిగారు కర్నూలు జిల్లాకేతెంచి శ్రీ రావుగారికి వ్యతిరేకముగా మమ్ములను ప్రోత్సహించుచుండిరి.

1932 ఆగష్టు మాసమున జరిగిన ఒక చిన్న సంఘటన నన్ను శ్రీహరి సర్వోత్తమ రావుగారితో సన్నిహిత పరచినది. తన విమర్శకులను కూడ శ్రీ రావుగారు ఎట్లు ఆదరించెడివారో తెలియుటకు అది ఒక నిదర్శనము.

నేను Soap Technology చదువుటకు మలబారునందలి క్యాలికట్‌కు బయలుదేరి మార్గమధ్యమున మిత్రుల కలసుకొనుటకు మద్రాసులో ఆగితిని. అక్కడ శ్రీ హరి సర్వోత్తమరావుగారు అనుకొనని విధముగా తటస్థపడి ఆప్యాయముగా పలుకరించిరి. Soap Technology లో తర్ఫీదు పొందనున్నందులకు నన్ను అభినందించిరి. నేను మంగుళూరు మెయిలులో బయలుదేరు సమయమున సెంట్రల్ స్టేషన్‌కు వచ్చి వీడ్కోలు యిచ్చిరి.

సామాన్యకుటుంబమునకు చెందిన, విషయపరిజ్ఞానము లేకుండ, తమవంటి మేధావుల చులకనగా విమర్శించుచుండిన నన్ను సాదరముగా వీడ్కోలిచ్చి పంపుట నన్ను వారికి సన్నిహిత పరచినది. అప్పటి నుండి నేను వారిని గురుతుల్యునిగా భావించుచుంటిని. నేను నంద్యాలకు తిరిగి వచ్చినప్పటి నుండి శ్రీ రావుగారికి, వారి కుటుంబమునకు సన్నిహితుడనైతిని. శ్రీ నారాయణానంద సరస్వతి గారు నన్ను అసూయతో నేను శ్రీ హరి సర్వోత్తమ రావుగారికి దత్తపుత్రుడనైనానని హేళన చేసెడివారు.

1934వ సంవత్సరములో నంద్యాల యువజన సంఘమును యేర్పరచి శ్రీ రావుగారిని అధ్యక్షులుగా ఎన్నుకొని నేను కార్యదర్శిగా రాజకీయ సమావేశములు, ప్రయోజన విద్యా కేంద్రముల నడతిమి. శ్రీ హరి సర్వోత్తమ రావుగారు ఆదర్శజీవి ఆరోజులలో వారి గృహము ఒక రాజకీయ

కేంద్రము-కుల మత విచక్షణ లేకుండ అందరు వచ్చి అక్కడ సలహాలు పొందు చుండెడివారు. మాటలే గాక చేతలతో అస్పృశ్యతా నిరోధ కార్యక్రమము ప్రచారము చేసెడి వారు. ఇంటిలో సహపంక్తి భోజనము లుండెడివి నిరాడంబరముగా వారి జీవిత విధానము ప్రతిప్రజాసేవకునికి మార్గదర్శకమై యుండెడిది.

1924వ సంవత్సరమున కర్నూలు జిల్లాలో ల్యాండ్సు రిసెటిల్ మెంటు జరుప ప్రభుత్వము వారు ప్రారంభించిరి. శ్రీ హరి సర్వోత్తము రావుగారు ఒక రైతు సంఘమును స్థాపించి రీసెటిల్ మెంట్ అనవసరమని వాదించిరి నంద్యాల యువజన సంఘము తరపున "మద్రాసు భూమి శిస్తు పద్ధతి" అను పుస్తకమును ప్రకటించిరి.

1923 నుండి 1935 వరకు శ్రీ రావుగారు నంద్యాలయందు నివసించిరి. ఆంధ్ర రాజకీయ నాయకులలో పొడచూపిన అసూయ ఈర్ష్యలకు శ్రీ రావుగారు గురియై తన యోగ్యతకు తగిన ఉన్నత పదవులకు రాలేక పోయిరి. 1935లో కేంద్ర శాసనసభకుగాని, 1937లో మదరాసు రాష్ట్ర శాసనసభకుగాని, ఎన్నికగుటకు వారికి అవకాశము యివ్వరైరి. కాని వారు మాత్రము త్రికరణశుద్ధితో రాయలసీమనుండి కాంగ్రెసు అభ్యర్థి శ్రీ అనంతశయనం అయ్యంగారిని, నంద్యాల నియోజక వర్గమునకు కాంగ్రెసు అభ్యర్థి శ్రీ జి. వెంకటరెడ్డిగారిని బలపరచి గెలిపించిరి.

1926 డిసెంబరు నుంచి 1930 వరకు నంద్యాల నియోజక వర్గము నుండి మదరాసు శాసనసభకు శ్రీ హరి సర్వోత్తమ రావుగారు ఎన్నికయై ఆదర్శ శాసనసభ్యులుగా గణుతి కెక్కిరి. రాయలసీమ అభివృద్ధికి పెక్కు సూచన లొసంగి, ప్రజల కష్టములను ప్రభుత్వ దృష్టికి తెచ్చిరి. శాసన సభా రంగమున ప్రతిభావంతుడైన పార్లమెంటేరియన్‌గా ఆనాడు శ్రీ రావుగారు రాణించిరి. ఆనాటి మంత్రుల జీతభత్యములను తగ్గింప వలయునని ప్రభుత్వమును తీవ్రముగా విమర్శించుచుండిరి. శాసనసభ్యుడుగా తన కర్తవ్యమును నిర్వ

హించి యితరులకు మార్గదర్శకులైరి. కర్నూలు జిల్లాలోని మహానంది క్షేత్ర ప్రాంతమును వన్యమృగ సంరక్షణ ప్రాంతముగా ప్రకటించునట్లు జేసిరి. ఆ సందర్భమున "Preservation of Wild Life - claims of Mahanandi" అను చిన్న కరపత్రమును ఇంగ్లీషులో ప్రచురించిరి.

మదరాసు శాసనసభలో జాతి అహంకారియగు ఒక యూరోపియన్ సభ్యుడు భారతీయుల గూర్చి చులకనగా ప్రసంగించిన సందర్భమున శ్రీ హరి సర్వోత్తమ రావుగారు వెంటనే లేచి ఆవేశముతో ఆ అధిక ప్రసంగమును ఖండించిరి జస్టిస్ పార్టీ నాయకులతో సహా సభ్యులెల్లరు శ్రీ రావుగారిని మిక్కిలి అభినందించిరి.

కర్నూలు జిల్లా కాంగ్రెసు సంఘము, కాంగ్రెసు సోషలిస్టు పార్టీ వారి ఆధ్వర్యమున కర్నూలుకు సమీపము నందు శ్రీ కాల్వబుగ్గ క్షేత్రమునందు 1939వ సంవత్సరమున రాజకీయ, ఆర్థిక వేసంగి పాఠశాలను శ్రీ హరి సర్వోత్తమ రావుగారు ప్రిన్సిపల్‌గా నెల రోజులు నిర్వహించిరి. నేను అక్కడ కార్యదర్శిగానుండి ఆ పాఠశాల నిర్వహణ పూర్తి అగువరకు వారికి తోడ్పడుచుంటిని. వివిధ రాజకీయ అభిప్రాయములు గల ప్రముఖులు ఆ పాఠశాలకు ఆహ్వానింపబడి ఉపన్యసించిరి. అందు తర్ఫీదు పొందిన విద్యార్థులలో ఒకరు సర్వోదయ సంఘ ప్రముఖులగు శ్రీ. ఆర్. కె. రాం(చాగలమర్రి)గారు. అక్కడి విద్యార్థులను తమ స్వంత బిడ్డలుగా ఆదరించి శ్రీ రావుగారు వారి అభిమానమును పొందిరి. తన అభిప్రాయములతో కొందరు ఏకీభవించకుండినను వారితో కలసి సౌమ్యముగా వ్యవహరించు ప్రకృతి శ్రీ రావుగారిది.

దేశమునకు కాంగ్రెసు సంస్థ నిర్వహించిన ప్రజాస్వామ్యము తగినదా,లేక కమ్యూనిజమా? అను విషయమున అక్కడికే తెంచి యుండిన కమ్యూనిస్టు ప్రముఖులు శ్రీ జొన్నలగడ్డ రామలింగయ్యగారు ఆవేశపడి శ్రీ సర్వోత్తమ రావుగారితో వాదించిరి. శ్రీ రావుగారు అభిప్రాయభేదమును విశాలదృష్టితో ఆంగీక

రించి తన సహజ సిద్ధమైన చిరునవ్వుతో శ్రీ రామలింగయ్యగారిని శాంత పర చుట శ్రీ రావుగారి ప్రత్యేక ప్రతిభావిశేషము.

ఎన్ని భేదాభిప్రాయములున్నను అందరు కలసి ఐక్యతతో దేశ స్వాతంత్ర్య సిద్ధికి కృషి చేయమని శ్రీ రావుగారు బోధించెడి వారు. జన సామాన్యాన్ని అక్ష రాస్యులుగా చేసి ప్రజలయందు విజ్ఞాన వికాసములు పెంపొందిన, నాడు ప్రజలే నాయకులకు గూడ దారి చూపెట్ట గలరని వారి దృఢ విశ్వాసము దేశానికి యజమానులైన ప్రజలు అజ్ఞానాంధకారములో మగ్గుచున్నన్నాళ్ళు దేశానికి ఉజ్వల శ్రేయస్సు కలుగదని వారు వయోజన విద్యా ప్రచారము వలన దెల్పుచుండిరి.

1946లో నంద్యాలలో జిల్లా రైతు సంఘమువారి ఆధ్వర్యమున రాయల సీమ ప్రాజెక్టుల మహాసభ జరుపబడెను దానికి శ్రీ హరి సర్వోత్తమ రావుగారు అధ్యక్షత వహించిరి. మిత్రులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు సభను ప్రారంభించిరి. అప్పటి సంఘం కార్యదర్శిగా నుండి నేను ఆ మహాసభ నిర్వ హించియుంటిని. రాయలసీమ ఆర్థికాభివృద్ధికి అవసరమగు ప్రాజెక్టు వివరము లన్నిటిని తెల్పి, ఐక్యతతో కృషి చేసి సాధించు వరకు దీక్ష వదల వలదని శ్రీ రావుగారు తమ అధ్యక్షోపన్యాసమున కోరిరి.

మొదటి నుండియు శ్రీహరి సర్వోత్తమ రావుగారు ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర మును కోరుచు అది సాధింప తీవ్రకృషి చేసిరి. ప్రత్యేక ఆంధ్రవిశ్వవిద్యాలయ మునకు కూడ కృషి సల్పి కృతకృత్యులైరి. ఆంధ్ర యూనివర్సిటీ సెనేట్ సభ్యులుగా ఎన్నుకొనబడి మెడికల్, ఇంజనీరింగ్ కాలేజీలలో రాయలసీమ విద్యార్థులకు తగిన ప్రాతినిధ్యము లభించునట్లు చేసిరి.

ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రమున రాయలసీమవాసులకు తగిన న్యాయము చేకూరదనియు, ఉమ్మడి మదరాసు రాష్ట్రమున వుండినచో రాయలసీమకు ఎక్కువ ప్రయోజనము కలుగుననియూ, మేము, ఇతర కొందరు మిత్రులము శ్రీ హరి సర్వోత్తమ రావుగారితో తరచుగా వాదించెడి వారము. కాని వారు మాతో ఏకీభ

వించక ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమునకై కృషిచేసిరి. రాయలసీమ ప్రాంతము వేరుపడవలయు ననుట సంకుచిత ధోరణి అనియు దెల్పుచుండిరి. నిజాయితీ గల వారితో వాదించుటయన శ్రీ రావుగారికి సరదాగా యుండెడిది. అట్టి హరి సర్వోత్తమ రావు గారినే ప్రత్యేక ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానంతరము గుర్తించిన వారెందరు? విజయవాడలో శ్రీ పాతూరి నాగభూషణము గారు, యితర మిత్రుల కృషితో యేర్పడిన "శ్రీ సర్వోత్తమ భవనము" తప్ప వారి జ్ఞాపకచిహ్నములు కానరావు. నంద్యాల పట్టణమున శ్రీ హరి సర్వోత్తమ రావుగారి సంస్మరణార్థము యేదైన చేయవలయునని పార్లమెంటు సభ్యులు శ్రీ పెండెకంటి వెంకట సుబ్బయ్య, ఆంధ్ర రాష్ట్ర శాసన పరిషత్ అధ్యక్షులు శ్రీ నివర్తి వెంకట సుబ్బయ్య, రాష్ట్ర ఆర్థిక మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి గారలు సంకల్పించి యున్నారు. దేశమున ఆదర్శ త్యాగ మూర్తి యగు శ్రీ రావువంటి వారిని విస్మరించుట మిక్కిలి విచారణీయము.

మొదటి నుండియు శ్రీ హరి సర్వోత్తమ రావుగారికి గ్రంథాలయ, వయోజన విద్యలందు ఆసక్తి మెండు. 1949వ సంవత్సరమున మదరాసు రాష్ట్ర ప్రభుత్వమువారు వయోజన విద్యాబోధకుల కార్యక్రమమును ప్రారంభించి శ్రీ రావుగారిని ఆంధ్ర ప్రాంతమునకు గౌరవ డైరెక్టరుగా నియమించి యుండిరి. వివిధ ప్రాంతములలో ఉపాధ్యాయులకు శిక్షణ శిబిరములు నిర్వహింపబడెను. అందొకటి కర్నూలు జిల్లా మహానంది క్షేత్రమున నడిపిరి. నిరక్షరాస్యులగు చెంచుజాతివారికి అక్షరముల నెట్లు సులభముగా నేర్పదగునో శ్రీ రావుగారే స్వయముగా బోధించినది చూచి అక్కడ వుండిన విద్యాధికారులందరు ప్రశంసించిరి.

వారు తరచుగా వివిధ కేంద్రముల పర్యటించి, ఉపాధ్యాయులకు నిర్మాణ యుక్త సలహాల నొసంగుచుండిరి. గౌరవ డైరెక్టరుగా వారి పర్యటనకు ప్రథమ శ్రేణి అలవెన్సులు వుండిననూ వారు వాటిని ఉపయోగించరైరి. తన కనీస అవసరములకు మాత్రమే వాటిని వారు ఉపయోగించెడివారు.

1950 లో ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ కర్నూలు జిల్లా నాగల మర్రిగ్రామమున జరుపబడెను. మదరాసు రాష్ట్ర గవర్నర్ భావనగర్ మహా రాజాగారు ఆ సభను ప్రారంభించిరి. కీ శే. శ్రీ సురవరం ప్రతాపరెడ్డి మున్నగు మేధావులు ఆ సభలకు హాజరై వుచిత సలహాల నొసంగిరి. శ్రీ అర్. కె. రాం గారు ఆ మహాసభల కార్యభారము వహించి జయప్రదముగా నడిపిరి.

శ్రీ హరి సర్వోత్తమరావుగారే ఒక విద్యాసంస్థ. చాలా గ్రంథములు వ్రాసి ప్రకటించిరి. దేశమందలి చాలా పత్రికలకు వ్యాసములు, పుస్తక సమీక్షలు వ్రాయుచుండిరి. నంద్యాలనుండి డాక్టరు కైప సుబ్రహ్మణ్యశర్మగారిచే ప్రకటింప బడుచుండిన "కౌమోదకి" పక్ష పత్రికకు ప్రత్యేక వ్యాసములు వ్రాయుచుండిరి. 1905వ సంవత్సరము మదరాసు క్రిష్టియన్ కాలేజీలో M. A. విద్యార్థిగానుండి, "అబ్రహామ్ లింకన్" అను మొదటి పుస్తకమును ప్రకటించిరి. తన పరీక్షకు తీసిస్‌గా ఆంగ్లమున "The Neglected Emperor-Poet" అను పుస్తకమును వ్రాసి ప్రకటించిరి. అది సివెల్స్ (Sewells ) గారు వ్రాసియుండిన "The Forgotten empire"అను పుస్తకమునకు సవాలుగా వ్రాయపడినదనియు, విజయ నగర సామ్రాజ్యము, శ్రీకృష్ణ దేవరాయలును ఎప్పటికి మరవజాలమనియు శ్రీ రావుగారు నిరూపించినట్లు మిత్రులు దెల్పియుండిరి.

శ్రీ కృష్ణదేవరాయలపై శ్రీ రావుగారికి ఎనలేని అభిమానము. నంద్యాల, యితర పట్టణములందు శ్రీ కృష్ణదేవరాయల జయంత్యుత్సవములు జరిపించిరి. పత్రికలకు ప్రత్యేక వ్యాసములు వ్రాసి, ప్రత్యేక సంచికల విడుదలచేయించిరి. 1928 వరకు దత్తమండలములుగా పిలువబడుచున్న జిల్లాలకు రాయలేలినసీమ– "రాయలసీమ" అని నామకరణ మిడిరి. 1928లో నంద్యాలయందు కీ. శే. శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్‌గారి అధ్యక్షతన జరిగిన ఆంధ్ర మహాసభలో దత్తమం డలములకు రాయలసీమ అని నామకరణము చేసి అంగీకరింపజేసిరి, అనంత రము రాయలసీమ పేరు వాడుకలోకి వచ్చినది. ఈ నామకరణమునకు ముఖ్య కారకులు శ్రీ హరి సర్వోత్తమ రావుగారు.

1907వ సంవత్సరము వందేమాతరం ఉద్యమమున శ్రీ బెపిన్ చంద్రపాల్ గారి ఉపన్యాసములతో ఉత్తేజితులై శ్రీ హరి సర్వోత్తమరావుగారు జాతీయోద్యమమున ప్రవేశించి రాజకీయములకు శిక్షలననుభవించిన మొదటి ఆంధ్రుడు. ఈ విషయము యిప్పటివారికి చాలామందికి తెలియక పోవచ్చును.

వందేమాతరం ఉద్యమ సందర్భమున శ్రీ రావుగారు బెపిన్ చంద్రపాల్‌తో కలసి ప్రచార మొనర్చి ప్రజలయందు దేశభక్తిని పురికొల్పిరి. ఆరోజులలో సభావేదికలపై ఉపన్యాసకులకు మైకు, లౌడుస్పీకర్లు వుండెడివికావు. కాని తమ సహజ గాంభీర్య కంఠధ్వనితో వేలాది ప్రజలకు వినపడునట్లు ఉపన్యసించుచుండిరి. మదరాసు హైకోర్టు సముద్రతీరమున శ్రీరావుగారు, బి సి పాల్‌గారు ఉపన్యసించినపుడు సముద్ర కెరటాల ధ్వనిని అధిగమించి వారి కంఠధ్వని ప్రెసిడెన్సీ కాలేజీ హాస్టల్‌వరకు ప్రతిధ్వనించుచుండెడిదట. ఉపన్యాసకులందు ఆ రోజులలో వారితో పోటీచేయువారలు లేకుండిరనియు, వారిపేరే వేలాది ప్రజలను సభలకు ఆకర్షించుచుండెననియు దెలియుచున్నది.

"స్వరాజ్యపత్రిక" సంపాదకులుగా 1908వ సంవత్సరమున "విపరీత బుద్ధి" అను శీర్షికను శ్రీ హరి సర్వోత్తమరావుగారు వ్రాసినందున వారికి మూడు సంవత్సరముల కఠినశిక్ష పడినది. ఆ వ్యాసమున "ఉద్రేకమున్నదిగాని, రాజద్రోహము కనబడదని" బందరులో జడ్జిగారు ఆరు నెలల కఠినశిక్ష విధించిరి. కాని ప్రభుత్వమువారు అపీలుచేయగా దానిని మూడు సంవత్సరముల కఠిన శిక్షగా మార్చిరి. వేలూరు సెంట్రల్ జైలునందు ఆ శిక్షను శ్రీ రావుగారు పూర్తిగా దీక్షతో ననుభవించిరి. ఆ రోజులలో జైలుశిక్షలు అత్యంత దుర్భరముగా నుండెను. శ్రీరావుగారు వారి జైలు అనుభవములను మాకు దెల్పుచున్నపుడు, ఆనాటి జైలు పరిస్థితులు ఎంత దుర్భరముగా యుండెడివో బోధపడెడివి. జైలునుంచి విడుదలై వచ్చిన తర్వాత తనతో మాట్లాడుటకుగాని, కలిసి తిరుగుటకు గాని మిత్రులుగూడ చాలా భయపడెడివారట.

శ్రీ హరి సర్వోత్తమ రావుగారి ధర్మపత్ని కీ. శే. శ్రీమతి రామాబాయమ్మ గారు. వారిని శ్రీరావుగారు "రాముడు" అని పిలుచుచుండిరి. వారు భర్తకు అన్ని విషయములందు చేదోడుగా నుండి తోడ్పడుచుండిరి. సనాతనాచారములకు నిలయమైన మధ్వకుటుంబమున జన్మించియుండియు, భర్తతో సంఘసంస్కరణలను బలపరచిరి. భర్తగారి ఆదర్శములను ప్రోత్సహించిరి. ఎంతటి ఆర్థిక యిబ్బందులు ఎదురైనను వాటిని ఓర్మితో ఓర్చుకొనిరి శ్రీమతి రామాబాయమ్మ గారు మహిళాసమస్యల ప్రకటించుటకు ప్రత్యేకముగా "సౌందర్యవల్లి" అను తెలుగు మాసపత్రికను తానే సంపాదకులుగా మదరాసునుంచి కొంతకాలము నడిపిరి. తీవ్ర అనారోగ్య ఫలితముగా శ్రీమతి రామాబాయమ్మగారు 1942వ సంవత్సరమున పరమపదించిరి.

1959వ సంవత్సరము సెప్టెంబరు మాసమున నేను తమిళనాడు గాంధి గ్రామ్‌నందు జరుపబడిన ఎ.ఐ.సి.సి. కోఆపరేటివ్ ఆర్గనైజర్సు ట్రెయినింగ్ క్యాంపుకు వెళ్లి, తిరిగి వచ్చునపుడు మదరాసులో శ్రీ హరి సర్వోత్తమరావు గారిని దర్శించితిని. అప్పటికి వారి ఆరోగ్యము తృప్తికరముగా లేదు. కనుచూపు మందగించి యుండెను. ఉత్తరములు స్వయముగా వ్రాయక, కూతురుతో వ్రాయించి సంతకము చేయుచుండిరి. కూతురు శ్రీమతి ద్వారకాబాయి తండ్రి అవసరములన్నియు గమనించి వారిని ఆదరించుచుండెడిది.

అప్పుడే శ్రీ చెరకువాడ వెంకట నరసింహము పంతులుగారికి వారి వైద్య సదుపాయము నిమిత్తము కేంద్ర ప్రభుత్వమువారు కొంత మొత్తము మంజూరు చేసియుండినట్లుగా తెలిసియున్నందున, నేను శ్రీ హరి సర్వోత్తమరావుగారితో ఆ విషయమును ప్రస్తావించితిని. వారికి కూడ కేంద్రప్రభుత్వము నుండి కొంత ఆర్థిక సహాయమునకు ప్రయత్నించగలనని దెల్పితిని. అప్పుడైన శ్రీ పిడతల రంగారెడ్డిగారు అప్పుడు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ అధ్యక్షులుగా వుండిరి. వారి సహకారముతో ప్రయత్నించగలమని శ్రీ రావుగారికి తెల్పితిమి. శ్రీరావు గారు తమ సహజ సిద్ధమైన గాంభీర్యముతో శ్రీ రంగారెడ్డిగారు సహకరించగల

మని తెల్పితే తాను దరఖాస్తు చేయగలమనిరి. రాజకీయ మాన్యాలు తనకు అవసరము లేదనిరి. వెంటనే నేను హైదరాబాదు వచ్చి శ్రీ పడతల రంగారెడ్డిగారితో ఆ విషయము చర్చించితిని. శ్రీ రంగారెడ్డిగారు ప్రత్యేకశ్రద్ధవహించి కేంద్ర ప్రభుత్వమునందు అప్పుడు దేశీయ శాఖామంత్రులుగా వుండిన శ్రీ గోవింద వల్లబ్‌పంత్ గారికి శ్రీ రావుగారి అనారోగ్యమునుగురించి వ్రాసిరి. వారికి యేమైన నెలసరి రాజకీయ ఫించను మంజూరు చేయవలసినదిగా ఆంధ్ర పదేశ్ కాంగ్రెసు తరఫున సూచించిరి. శ్రీ గోవింద వల్లభ్ పంత్‌గారు వెంటనే రు 2000-లకు ఒక డ్రాఫ్టును పంపించిరి. తాము శ్రీ హరి సర్వోత్తమ రావును, వారి ఆదర్శ త్యాగమును స్వయముగా యెరుగుదుమనియు రాజకీయ పించను విధానము లేదనియు ఆ చెకమును తన ప్రత్యేక నిధినుండి శ్రీ రావుగారి వైద్య సదుపాయమునకు తాత్కాలికముగా వుపయోగించుకొన వచ్చునని వ్రాసిరి. తనను కేంద్ర ప్రభుత్వమునుండి శ్రీ గోవింద వల్లభ్‌పంత్‌గారు స్వయముగా గుర్తించినందులకు శ్రీ రావుగారు చాల సంతృప్తిజెందిరి. ఇది జరిగిన కొలది దినములకు శ్రీ హరి సర్వోత్తమరావుగారు మదరాసులో 1960 ఫిబ్రవరి 29వ తేదీ పరమపదించిరి.

శ్రీ హరి సర్వోత్తమరావుగారి జీవితము తరతరాల వారికి ఆదర్శప్రాయము. "పదవులకు వెనక-పనులకు ముందు" వుండుటయే వారి కార్యవిధానము "ఆంధ్ర తిలక్"గా పేరొందిన వుండిన శ్రీ రావుగారిని దేశము విస్మరించుట తగదు. "శ్రీ హరి సర్వోత్తమ రావుగారు "The neglected Scholar-Soical worker – Politician" కాకుండా వారి స్మృతి చిహ్నములు ఆంధ్రదేశమంతటా యేర్పరచవలసిన బాధ్యత మన ఆంధ్రప్రజలపై కలదు.

# సర్వోత్తముని ఉదాత్త జీవితము

- వనం శంకరశర్మ

నేటి ఆంధ్రదేశంలో అకళంక దేశసేవకులు, ప్రసిద్ధ గ్రంథకర్తలు, సంస్కృతాంధ్ర ఆంగ్ల విద్యాధికులు, చట్ట నిర్మాణ సభాసభ్యులు, మహాత్మా గాంధీ గారిచే 'ధైర్యశాలి' యని యుగ్గడింపబడిన నాయకుడు, గ్రంథాలయోద్యమం, వయోజన విద్యావ్యాప్తికి అహర్నిశలు పాటుపడుతూ తమ జీవితాన్ని అంకితమొనర్చిన శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమ రావుగారికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు 'సంస్మరణసభ' ఏర్పాటుచేసి, అందులో నన్ను ఉపన్యసింపుమని కోరడం, వారితో నాకుగల సన్నిహిత పరిచయ భాగ్యాన్ని మరొకసారి సింహావలోకనం చేసుకునేటట్లు చేయగలిగింది.

శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమ రావుగారు M. A. పరీక్షలో నుత్తీర్ణులై యేదేనొక రాచకొలువున ప్రవేశించుటకు దగిన యోగ్యతయందు బరిపూర్ణత నొందియుండియు పరిపూర్ణ పాండిత్యమునకు పురుషార్థము ప్రభుసేవగాదనియు, ప్రభుత్వోద్యోగమునకు ఆశింపలేదు. వారు ప్రభుత్వోద్యోగమున కాశించినచో మండలాధిపత్యమేనాడో నిర్వహించి యుండెడివారు. పాపమా మహాపురుషుడు 'వందేమాతరం' అనునినాదము బంగాళమునుండి వినవచ్చినతోడనే తనకు సహజమైన దేశానురాగమున నుద్రిక్తుడై నడుము బిగించి, స్వాతంత్ర్య సమరమునకు దుముకక తప్పినదికాదు అప్పటి యుద్యమము నడచుటలో బ్రిటీషువారు అవలంబించిన కృత్యములు విమర్శించుటకై కాబోలు 'ఆంధ్రపత్రిక', 'స్వరాజ్' పత్రికలకు సంపాదకత్వముబూని, ప్రభుత్వ చర్యలను నిర్దాక్షిణ్యంగా ఖండించిరి. అయ్యది దుస్సహమగు రాజద్రోహముగ నెంచబడి న్యాయస్థానమున విచారించబడి శిక్షాపాత్రులైరి. వారానాడు బయలుదేరిన ఆంధ్రదేశ త్యాగులలో ప్రప్రథములని చెప్పుట అతిశయోక్తికాదు.

1927 జూన్ 15, 16 తేదీలలో జరిగిన కర్నూలు మండల కాంగ్రెసు మహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులుగా తమ అధ్యక్షోపన్యాసములో "దేశసేవ జేయనెంచు ధీమంతునకు, యుద్ధకాలమున దేహమర్పించుటవలె ఇతర కాలంబుల గొర్రెల కాపరికి అర్జీలు వ్రాసి యిచ్చుటయు దేశసేవయే. ఈ రెండింటికిని సమత్వంబు పాటింపక, లేక ప్రతిష్ఠామాత్ర పీడితుడగు దేశసేవకుడు త్యాగి కావచ్చును, మహాత్ముడు కావచ్చును, కాని దేశసేవకుడు కాజాలడు. దేశసేవకుని పతాకముయొక్క ప్రతిష్ఠ, దేశములోని సహోదరులకై చేయు కాలోచిత సేవయే గాని, ప్రతిష్ఠాడంబర ప్రజ్వలితాట్టహాసంబు గాదు" అని దేశసేవకు భాష్యం పలికిన ధీమంతుడు సర్వోత్తముడు.

తమ యుపన్యాసములో చెప్పినటుల నంద్యాల ఫారెస్టు విషయంలో "ప్రజలకొరకు అడవులా? అడవులకొరకు ప్రజలా ఏర్పడి యుండుట?" అని ఆనాటి అటవీ శాఖాధికారులను నిశితంగా, ధైర్యంగా విమర్శిస్తూ రైతులపరంగా నిలచి పోరాడిన ధైర్యశాలి.

15-12-27 తేదీన మైలాపురులోని రెంటాలహౌస్‌లో జరిగిన ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు మహాసభకు అధ్యక్షత వహించిరి. ఈ సభయందే వారి సతీమణి శ్రీమతి రామాబాయిగారు కర్నూలుజిల్లా కాంగ్రెసు మెంబరుగా ఎన్నుకోబడిరి.

1927లో కౌన్సిలు మెంబరుగా ఉన్నప్పుడు రాయలసీమ కరవు పరిస్థితులను గురించి బయట ఆందోళన చేసియు, సభారంగమున ప్రభుత్వదృష్టికి దెచ్చియు, కర్నూలు మండల క్షామ సూచనల నాలుగు సమగ్ర వ్యాసాలుగా ఆనాటి 'ఆంధ్రపత్రిక', 'కౌమోదకి', 'మాతృసేవ' మరియు నాచే నడుపబడు చున్న 'ఇంద్రావతి' పత్రికలలో ప్రచురించడం జరిగింది. అప్పట్లో మా 'ఇంద్రావతి' పత్రికా నిర్వహణం వారి చేతిమీదుగా జరుగుతుండేది.

రైతుల పట్టాల విషయంలో ఆనాటి స్టాండింగ్ ఆర్డరు మేరకు జమాబందీ ఆఫీసరు రైతుల పట్టాలు సవరణ చేయించి క్రొత్తవి వ్రాయించి

వచ్చిన రైతులకు యివ్వవలసి యుండినది శ్రీ సర్వోత్తమరావుగారు కౌన్సిలులో ప్రశ్నించియు, యితర విధములను ఈ విషయమందు శ్రద్ధవహించియు పరిశ్రమ చేసి బోర్డు స్టాండింగ్ ఆర్డరు 10, 27 లోను, గ్రామలెక్కల మాన్యుయల్ లోను తగిన మార్పులు చేయించి, రైతుల యిక్కట్లు బాపిరి.

8-4-23వ తేదీన కర్నూలు మండల జాతీయోపసంఘం అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. అదేసభలో ఆంధ్రరాష్ట్ర సభకును ఎన్నుకోబడ్డారు. 5-5-26న అవసర ఆంధ్ర రాష్ట్ర ప్రాథమిక పాఠశాలోపాధ్యాయ మహాసభ (గుంటూరు)కు అధ్యక్షులు.

10వ ఆంధ్ర రాష్ట్రీయ సమావేశము నంద్యాల (17-12-28) లో తమ ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసములో "మన రాజకీయ వాతావరణమున నాకొక్కటే లోపము గన్పించుచున్నది. మహామహులెందరో త్యాగముచేసి నడుములు గట్టి దేశసేవ కావించుచునారన్నుట వాస్తవము. ప్రతి పది సంవత్సరములు గడచినకొల్ది యిట్టి సంఖ్య పెరుగుచుండుటయు వాస్తవమే. కానీ దేశముక్తికి యిప్పుడు జరుగుచున్నట్టి పనిమాత్రముతోనే తృప్తిపడిన యెడల త్వరితగమనము సమకూడదు. దేశసేవకై తమ సర్వకార్యములను విసర్జించి, కాలమంతయు వినియోగించియు పనిచేయదగిన ధీశాలురు ఇంకను చాలా ఎక్కువగా ఏర్పడవలసి యున్నారు. ఈ సేవాబృందములు నిర్మించు ప్రయత్నము లనేకములు జరిగియున్నవి. కాని యెక్కడియైనను యిదివరకు ఫలవంతము కాలేదు పని ఎట్టిదైనను అహరహము కార్యసాధన చేయునట్టి దీక్షాపరత్వము స్వరాజ్యపక్ష శాసన సభ్యులకుగూడ నూటికి డెబ్బదియైదుగురుప కలుగలేదనిన క్షమింతురుగాక! ఈ లోపము వ్యక్తులదిగాదు, పరిస్థితులది. కాబట్టి పరిశీలించి, పరీక్షించి, ప్రణాళికలను స్థిరముచేసి, నిత్యవ్రత పద్ధతిని దేశసేవ గావించు బృందములను నిర్మించి ప్రయత్నము ఫలించువరకును చేయందగిన"దని నిర్భయముగ లోపములను ఎత్తిచూపుతూ పరిష్కార మార్గములను చూపిన కార్యశీలి.

నంద్యాల పట్టణము మునిసిపాలిటీవారు ఆ పట్టణ నీటివసతి కొరకు మహానంది క్షేత్రమునుండి నీటిని తీసుకొని పోవుటకయి చేసిన తీర్మానమునకు వ్యతిరేకముగా ఆ దివ్యక్షేత్ర స్వరూపమునకు భంగము కలుగకుండుటకుగాను, సహజ సృష్టి సౌందర్యముచేతను, ప్రాచీన మత ప్రాముఖ్యముచేతను కీర్తి కలిగించు చుండు ఈ క్షేత్రమును కాపాడుటకు ఊరూరా శ్రీమహానందయ్య గారితో కలిసి తిరిగి నిరసన సభలు జరిపి ఆస్కీమును మాన్పింపజేసిరి.

8-12-29 కడపమండల మహాసభలలో రైతు మహాసభకు అధ్యక్షత వహించి రాయలసీమ రైతుల కష్టములను వివరించి తుంగభద్ర ప్రాజెక్టు మొదలగు వాటి విషయములో ప్రభుత్వము అవలంబించుచున్న చర్య సక్రమముగా లేదనుచు నుపన్యసించిరి.

కర్నూలు ఖద్దరు బోర్డులో శ్రీ హరి సర్వోత్తమరావుగారితోపాటు నేనున్ను, భైరవ జోస్యుల మహానందయ్య గారున్ను, డా. క్రైప సుబ్రహ్మణ్య శర్మగార్లు కూడా వుండే వారము. రాష్ట్ర ఖాదీ బోర్డువారిచే ధనం మంజూరు చేయించి, దానిని రాయలసీమ క్షామ నివారణకు వినియోగించారు. ప్రత్తి, దూది, ధాన్యం, పిరాళములు వసూలుచేసి, బీదసాదలకు పని కల్పించేవారు శ్రీ సర్వోత్తములు.

1930 సం. నుండి నంద్యాలలో 'కౌమోదకి' అను పత్రికను భిషగ్వర, డా క్రైప సుబ్రహ్మణ్యశర్మగారి సంపాదకత్వమున స్థాపించడం జరిగింది. శ్రీ రావుగారు 'సాభిప్రాయ వార్తలు' అను శీర్షికక్రింద ఆనాటి పరప్రభుత్వ నిర్బంధ విధానమును, ఉప్పుసత్యాగ్రహ వార్తలు, విశేషాలు వివరిస్తూ దేశభక్తిని రగుల్గొల్పేవారు.

శ్రీ సర్వోత్తమరావుగారు 'శ్రీ ఆయుర్వేద విద్యాలయం' పేర మహానందిలో గురుకులవాస పద్ధతిలో ఒక విద్యాలయం స్థాపించినారు.

16-5-1931లో మడకసిరలో వెనుకబడిన ప్రాంతాల సహకార సంఘముల మహాసభకు అధ్యక్షత వహించిన శ్రీ రావుగారు వేదాంతానికి సహకార

పద్ధతిని జోడించి ఉపన్యసించారు- "సహకార సిద్ధాంతము మన వేదాంత సిద్ధాంతముల ననుసరించి యున్నది మనమని, అన్యులమని తలంపకూడదు. పదిమందికోసం బ్రతికిన బ్రతుకే బ్రతుకు. ప్రాచీనకాలంలో మనవారు ధర్మమును గురించి చెప్పిరేగాని, హక్కులను గురించి చెప్పలేదు. 'నేను' అంటే అహంకారం— అహంకారం కలహమునకు కారణం. ఇది నైతికోద్యమం కూడా. ఇకముందు సహకారమన్నది మంత్రం కాగలదు. విద్యావంతులైనవారు తమ మంచి గుణములను అభివృద్ధి చేసికొని దేశసేవకై నడుముకట్టి సహకారోద్యమమును చక్కని పద్ధతిలో నడపుకొనవలెనని కోరుతున్నా" మనిరి.

శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమ రావుగారి పూర్వులు మహారాష్ట్ర దేశము నుండి వచ్చినవారు. విజయనగర సామ్రాజ్యము పతనమైన తరువాత కుతుబ్ షా నవాబుల కాలములో కడప - కర్నూలు మండలముల పరిపాలకులుగా మహారాష్ట్రులు నియమింపబడిరి. ఆ కుటుంబములలో వీరిదొకటి. కడప పట్టణములో యిప్పటికినీ 'గాడిచర్ల వారి వీథి' ఉన్నది. హరి సర్వోత్తమ రావుగారు నంద్యాలలో వుండి కర్నూలు మునిసిపల్ హైస్కూల్‌లో S S L. C. పూర్తి చేసి తరువాత మద్రాసులో ఉన్నత విద్య ముగించినారు. M. A. పూర్తిచేసి, రాజకీయములలో ప్రవేశించి జైలుకు వెళ్ళినారు. అప్పట్లో నిరుద్యోగులై అవస్థపడుచుండగ 1913 - 914 ప్రాంతాలలో శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు తమ విజ్ఞాన చంద్రికా గ్రంథమాల'లో లేఖకులుగ నియమించి, ఒక ఆధారమును కల్పించినారు. ఆ సమయములో వారు పోతన భాగవతములో 'శ్రీరామ చరిత్ర' ఘట్టమునకు విపుల వ్యాఖ్యానము వ్రాసి, తమ తల్లికి అంకిత మిచ్చి ప్రకటించిరి. ఆ తరువాత ప్రజలకు రాజకీయ విషయములను దెలుపుటకు కొన్ని లఘు పుస్తకములను వ్రాసిరి. వాటిలో ముఖ్యమైనది. 'ఓటు' ను గూర్చి వ్రాసినది. సర్వ జీవితములకు ఆధారమైన నీతి సూత్రముల తత్వమును 'నీతి ధర్మము' అను పేర మహాత్మా గాంధీగారిరచనను భాషాంతరీ కరణము చేసిరి. 'సంపూర్ణ స్వరాజ్యము' ను గూర్చి శ్రీ ఆండ్రూస్ గారి ఉద్దండ లేఖను, 'మూర్ఖరాజు' టాల్‌స్టాయ్ కథను అనువాదము చేసిరి. 'మూడు రత్నములు' మహాత్ముని అను

వాదము. రవీంద్రుని 'కల్పన' సర్వోత్తముని యనువాదము 'సర్వోదయము' నాగరీకపు నల్లమచ్చ యిందు విచర్శింపబడినది. 'ప్రపంచ చరిత్ర'లో వరుసగా అన్ని దేశముల సంగతులు, అన్ని కాలముల సంగతులు, అన్ని ప్రాంతముల విశేషములు అన్ని రకాల విషయములు, వివరముగా యివ్వబడినవి. గ్రీసు, రోము ఈజిప్టు, హిందూదేశము, చీనా, జపాను స్పెయిన్, ఇటలీ. అమెరికా, ఫ్రాన్సు. ఇంగ్లాండు, జర్మనీ. మొదలుగాగల దేశములలోని ప్రజలు సృష్టి మొదలుగాగొని అనుభవించిన అనుభవములు, తలంచిన తలపులు, నడచిన నడతలు, చేసిన యుద్ధములు, పొందిన పరాజయములు, విజయములు, ఎల్లయు కండ్లకు కట్టినట్లు వ్రాయబడినవి. "సభలు-సమావేశములు" ఈ ప్రజాయుగంలో అన్ని వ్యవహారములు ప్రజాసభలద్వారా నిర్ణయింపబడుతున్నందువల్ల ప్రతి పౌరుడు తెలిసికొనవలసిన సభామర్యాదలు, సభల రకాలు, సభల పరమార్థము, నిబంధిత స్థలముల సమావేశములు, ప్రతిపాదనలు, సవరణలు, ఓటింగు వాయిదా, విషయనిర్ణయ సంఘము, ఉపసంఘములు మొదలగు శీర్షికల క్రింద వివిధ విషయాలు కూలంకషంగా చర్చించబడినవి.

ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమ రావుగారు గ్రంథాలయోద్యమానికి. వయోజన విద్యాప్రచారానికి చిరకాలముండి నిర్విరామముగ చేసిన కృషికిని, వివిధ రంగములలో ఆంధ్రజాతికిని వారొనర్చిన సేవకును ప్రతిఫలముగ వారిని గౌరవించు సంకల్పముతో ఆంధ్ర గ్రంథాలయ ట్రస్టు-పటమట లంకవారు 1-6-1949వ తేది వారిపేర "శ్రీ సర్వోత్తమ భవనము"ను నిర్మించి ప్రవేశ మహోత్సవమును జరిపి తమ కృతజ్ఞతలను వెల్లడించుకొనిరి.

"మన రాజ్యాంగ చట్టంప్రకారం తన మంచి చెడుగులను రెండింటికిని తానే కర్తగా యేర్పడ్డ నిరక్షరాస్యుని గౌరవించుట మన విధి. ఎందుకంటే ఆతని పరిశ్రమపై నాధారపడియే మనమింతకాలము మనుగడ సాగించినాము. ఇక ముందుకూడ అతని పరిశ్రమ మన కాధారము కాక తప్పదు. కనుక అతని ఋణమును దీర్చుకొనుటకు కనీసము మనము చేయదగిన కార్యము స్వల్పంగానైనా వయోజన విద్యావ్యాప్తికై మన శక్తిమేరకు దోహదంచేయడమే"నని శ్రీ రావుగారి యాలోచనా సరళి.

చదువుకొనని గోరువారికి వయసు మీరినవారి కందరకు మిగుల ఉపయుక్తమగు రీతిని వ్రాసిన పుస్తకములు- "వయోజన విద్య-బోధనాక్రమము" అక్షరాస్యతావశ్యకత, రాజ్యాంగానికి ప్రజల అక్షరాస్యతకుగల సంబంధమును గూర్చి, అక్షరాస్యతయొక్క ప్రయోజనములు వయోజనుల మనస్తత్వము, చదువు-వ్రాతలు, బోధనాపద్ధతులను గురించి, అక్షరాస్యత ప్రచారమునకు కావలసిన సాధనములను గురించి చక్కగ జెప్పబడినది ఈ గ్రంథమును తమ ప్రియ సతీమణి శ్రీమతి రామాబాయి గారికి అంకిత మొనర్చిరి. "వయోజన విద్య" 1, 2, 3 భాగములు - ఇవి సులభముగా వ్రాయను, చదువను నేర్చుకొనుటకై వ్రాయబడిన పాఠ్యపుస్తకములు. అక్షరములు తెలిసికొనుటకుగాను శ్రీ సర్వోత్తమ అక్షరాభ్యాస పటమునుగూడా రచించినారు. వయోజన విద్యను గురించి శ్రీ రావుగారి అభిప్రాయం ఏమన "వయోజన విద్యలో లోపం నాకు కన్పిస్తున్నది. ఏమంటే - అది ఎవరికి కావలెనో మనం మరచిపోతున్నాము. అన్నిరకాల పనిపాటలలో వున్నవారికి, వయోజన విద్య కావాలి. వృత్తికి, వ్యాసంగానికీ, వ్యవసాయానికీ అన్నింటికీ సంబంధించిన విద్యయే వయోజన విద్య. అందరికీ విద్య ఏర్పడితేనేగాని అది వయోజన విద్యకాదు" అని.

ఈ విధంగా వారు గ్రంథాలయోద్యమములోను, వయోజన విద్యాప్రచారోద్యమములోను పనిచేయుచు జీవితాంతమువరకు విజయవాడలో గడిపినారు. "అఖిలభారత గ్రంథాలయోద్యమమునకు నాయకులుగా, అఖిలాంధ్రదేశ గ్రంథాలయ సంఘమునకు అధ్యక్షులుగా, దక్షిణ భారత వయోజన విద్యాశాఖ డైరెక్టరుగాను చాలా సేవచేసిరి. వారు ప్రేమమయమూర్తి, ఉత్తమ స్నేహితుడు, గొప్ప సంస్కారి. రాయలసీమ ప్రజలు, ఆంధ్రప్రదేశ్ ప్రజలును వారిని మరువజాలరు.

అట్టి నిష్కళంక, నిరాడంబర స్వాతంత్ర్య యోధుని, ప్రజాసేవకుని సేవలు నేటి యువతరానికి మార్గదర్శకం కావాలి. వారి అడుగుజాడలలో పయనించుటే ఆంధ్రావళి చూపు ఆదరమునకు అనువగు మార్గము.

# కవికోకిల దువ్వూరి రామిరెడ్డి

- మరుపూరు కోదండ రామరెడ్డి

## ప్రవేశిక

కవికోకిల దువ్వూరి రామిరెడ్డి నానా ప్రకార ప్రజ్ఞానిధి. ఆయన మేధస్సు ఎన్నో కక్షాంతరాలు గలది. నేటి పరిభాషలో చెప్పాలంటే- అనేక డ్రాయర్లుగల పెద్ద టేబుల్. ఒకదానిని లాగి తెరచి. పనికాగానే దానిని మూసి, ఇంకొకదానిని తెరచేవాడు. కాబట్టే ఒక్కొక్కప్పుడు భిన్నవిషయాలను పరిశీలించి వ్రాసి, మరొకమారు ఇంకొక విషయానికి దాటిపోయేవాడు. ఇందు ఒకదానికొకదానికి ఘర్షణ జరిగేదికాదు.

ఈయన శివ ఫారం గ్రాజ్యుయేట్! పూర్వపుణ్య పరిపాకం అందాం! ఈయనది బడిచదువు కాదు; మొదట మడి (పొలం) చదువు. తర్వాత గుడి చదువు. కర్షకుడుగా పుట్టి- విజ్ఞాన శాస్త్రపు దగగొట్టి- అమృతాక్షర వికాసమైన సరస కవితారసంతో దప్పిదీర్చుకొన్న కళాతపస్వి! ఆధ్యాత్మిక వాసనా బంధురమైన యీాయన మానసం చిన్ననాడే, రామకృష్ణ పరమహంస, వివేకానందస్వాముల సన్నిధిచే పరమపావనమైన ఆ హిందూ వేదాంత క్షేత్రం- బేలూరుమఠ జ్ఞానజ్యోతిలో తన కరదిపికను వెలిగించుకొని, జీవనభరణ ప్రయాసలేకుండా దాటుకొనిపోయిన సుకృతి. ఈయన ఆంధ్రవాఙ్మయ మహా ప్రపంచంలో తన కాలిజాడలను అదిమి ముద్రించుకొని పోయినాడు. మా నెల్లూరు జిల్లాలో ఆ యుగానికి కవిబ్రహ్మ తిక్కన సోమయాజి, ఈ తరానికి కళాప్రపూర్ణ వేదం వేంకటరాయశాస్త్రి, ఈ కవికోకిలే మా పొలిమేరలు దాటిన పేరు గలిగినవారు.

మూడవ ఫారం చదివేటప్పుడే ఫోటోక్యామరాను స్వయంగా నిర్మించుకొన్నాడు. సేద్యగాడైనాడు కవి అయినాడు. స్వయంగా చదివి సంస్కృతాంగ్లభాషలలో పండితుడైనాడు ఇంగ్లీషు రచయిత అయినాడు పారసీ భాష నేర్చి అందలి గ్రంథాలను తెలుగులోకి అనువాదం చేసినాడు. వంగభాష యందు మంచి పరిజ్ఞానం సంపాదించుకొన్నాడు. పత్రికారచయిత అయినాడు. ప్రాడ్బివాదంతో జ్యోతిషాన్ని ఎరిగి విశ్వసించినాడు. వాస్తుశిల్పపు లోతుపాతులు తెలుసుకొన్నాడు. 1926లో మొట్టమొదటిసారిగా మనదేశంలో కుడికాలుబెట్టి మెట్టిన రేడియోజ్ఞానం అలవరచుకొని. చిల్లర విడిభాగాలు కొని స్వంతచేతులతో రేడియో రిసీవరును నిర్మించి, మాకంతా మదరాసు ఆకాశవాణి పాటలను వినిపించినాడు. "వితంతు సంగీత గ్రాహకుడు" అని కోడెగపు మాటలు విసరితే హోరారా నవ్వేవాడు. చిత్రలేఖనం ఈయనకు ఇంకొక ముద్దులభార్య. చలనచిత్ర దర్శకుడై సినిమా పాటలు మాటలలో కవితాగుణ విస్ఫులింగాలను మొదటిసారిగా ఆంధ్రలో మెరపించినాడు.

దేశాభిమాని, దురభిమానపు పొలసుకంపుగొట్టని స్వకులాభిమాని. వినమ్రుడు. పెద్దలను గౌరవించి పిన్నలను ప్రోత్సహించినవాడు. గుణపక్షపాతి. ఈ విభిన్న ప్రజ్ఞాపారిజాతమే సాహిత్యరంగంలో గద్యపద్య గేయ ఖండకావ్య నాటక విమర్శకరూపమైన నానాశాఖలుగా చీలి, పెరిగి పూచి పరిమళించినది.

నలభైయేండ్లు మారని ఆయన వేషధారణ రాతిలో మలచినట్లు పరిచితుల మానసిక ఫలకంపై అట్లే నిలిచిపోయినది;- అంచులేని తెల్లమొలపంచ-షర్టు-పైలేసి ఓపన్‌కోటు-సులోచనాలు-నడిమి పాపట క్రాపు-సన్నటి మీసకట్టు-చామనచాయ లోపంలేకపోయినా అందం అనిపించని ముఖ కవళికలనుండి, అది ఏదో ఒక కళాకాంతి ఉద్దీపిత మయ్యేది. సంభాషణ అప్పటంగా గ్రామీణము. అయినా, మారుమూల పల్లెలో ఉండినా ప్రపంచ సాంఘిక రాజకీయ విజ్ఞాన విషయాలు, కలుజులు (అలుగులు) దీసిన చెరువువలె ఆయన వదనం వెలువరించేవి. నఖశిఖ పర్యంతం ఏదో ఒక రుద్ధ సౌభాగ్యం ఆయనలో నీరెండగా

కాచేది. నీరుగమ్మిన నిప్పు ఆయన; బట్టు పొగడ్త అనుకోకపోతే, ఇటలీ మహాశిల్పి- లినార్డో డా విచి ప్రజ్ఞారేఖలు, అస్ఫుటంగా ఈ కర్షక కవిలో తుళుకొత్తేవి.

ఇదీ! ఆ వివిధకళారసికుడు- కవితాశిల్ప కుశలుడు- దువ్వూరు కవికోకిల కొండంత రూపం చేతిఅద్దంలో కనబడేతీరు?

ఇక వివరాలు :-

## 2. జననాదికములు

### రెడ్లు

కవి రామిరెడ్డి, రెడ్లలో పంటకాపులలో ముదురుతెగలో పుట్టినాడు. పంట-పాకనాడు-వెలనాడు మొదలైన శాఖలు ప్రాంతాలనుబట్టి ఏర్పడినవి. మోటాటి-దేసూరు-కొణిద ఇందు మరికొన్ని శాఖలు. రెడ్లు వడ్లు లెక్కకు మీరినవనిగదా సామెత. పంటనాడు అనేది,పూర్వం ఇప్పటి నెల్లూరు జిల్లా గూడూరు ప్రాంతం. పాకినాటివారు నియోగి బ్రాహ్మణులలో గూడ గలరు. పంటరెడ్లలో రెండు శాఖలు- ముదురు, లేత అని. వీరు అన్నదమ్ములు- పెరమారెడ్డి కాటంరెడ్డి సంతతుల వారట. నూరు, నూటయాభై ఏండ్లకు ముందు ఇవి ఒకే శాఖగా ఉండినట్లున్నది. ఎందుకంటే- మా లేత "మదనపాల" గోత్రంవారు ముదురు కాపులలోను ఉన్నారు. కాటంరెడ్డివారు స్మార్తులు; పెరమారెడ్డివారు వైష్ణవులు; అంతే భేదం. కాటంరెడ్డోరి కూడుదిని, పెరమారెడ్డోరి పశువులు గాచినట్లు అని ఒక చాటువ

కొండవీడు నేలిన పంటరెడ్లు మొదట నెల్లూరు మండలం- (ఇప్పుడు కోవూరు తాలూకా) దువ్వూరు గండవరం గ్రామాలనుండి ఎత్తిపోయినారని కవి సార్వభౌముడు శ్రీనాధుడు వ్రాయడం చరిత్రకు సంబంధించినదే. కొండవీడు పతనానంతరం, రాజుగా ఏలినచోట రైతుగా మనుటకు ఇచ్ఛగింపక, నెల్లూరు నాగర్తనుండి దక్షిణాన కన్యాకుమారివరకు ప్రాకినారు- ఈ పంటవారు.

### వంశం

రామిరెడ్డి 18´5-నవంబరు-9వ తేదీ శనివారం రేపటి పూట, 6 1/2 గంటలకు పెద గూడూరు (విదేశీయులకు మైకా గూడూరు) తూర్పు వీధిలో పెరమారెడ్డివారి ఆడపడుచు- లక్ష్మీదేవమ్మ గర్భవాసాన జన్మించినాడు; తండ్రి సుబ్బారెడ్డి. వీరిది పేరంటాలుగా అగ్నిప్రవేశం చేసిన నరజాలమ్మ వంశం.

ఈ 1890-1899 సంవత్సరాలు ఆంధ్ర వాఙ్మయంలోనేగాక ప్రపంచ సాహిత్య-క్షేత్రంలో మంచిస్థానం ఏర్పరచుకొని ఉన్నవి నెలలు వారగా ఈదశాబ్దంలోనే రాయప్రోలు సుబ్బారావు, తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి బసవరాజు అప్పారావు అబ్బూరు రామకృష్ణరావు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, నాయని సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, జాషువ, నండూరు సుబ్బరావు, అడివి బాపిరాజు మొదలైనవారు పుట్టినారు.

### 1890 దశాబ్దసంఘం

1890-99 వరకు ప్రపంచంలో సర్వకళలకూ ఒక మంచి పునర్వికసనం జరిగిన దశాబ్దమని పరిశోధకులు నిర్ణయించినారు. ఇది ఒక నూతన శకారంభం. ఈకాలమే వివిధ దేశాలలో వివిధ కళలకు నవ్యరీతుల అధ్యాయం ప్రారంభమైన విప్లవ యుగమని వారి మదింపు. దీనిని శోధించి ఆ సమయంలో ప్రభవించిన వివిధ కళలను వృద్ధిచేయాలన్న ఉద్దేశంతో ఇంగ్లాండులో "1890 దశాబ్ద సంఘ"మని (1890's year) ఒకటి నెలకొల్పబడినది. ఇంగ్లాండు మొదలగు దేశాలలో పెద్ద రచయితలు శిల్పులు యీ కాలావధిలో పుట్టుటో, లేక వారి కృతులు ప్రకటించుటో జరిగినదని జాబితాలు సిద్ధంచేసినారు. ఆ రచనలను తిరిగి ముద్రించే ప్రయత్నం జరుగుతున్నది.

ఈ సంఘంలో ఇప్పుడు ముఖ్యపాత్ర- డా॥ గూటాల కృష్ణమూర్తి అనే విశాఖపట్టణాంధ్రునిది. ఈయన పి. హెచ్‌డి చదువుతో ఇంగ్లండులో అధ్యాపక వృత్తిలో ఉన్నాడు. ఈ పీరియడ్ రచనలను ప్రత్యేక రీతిలో

ప్రఖ్యాతికి తేవాలని ఈయన సంకల్పం. ఈ ఘట్టంలోనే ఆంధ్రలో నవ్య రత్నాలు పుట్టినవని, నవ్యరీతులవారు పుట్టినారని, వీరి కృషిని ఇంగ్లీషు తెలిసిన వారి దృష్టికి తేవాలని కొన్ని ప్రచురణలు బయటకు దెచ్చినాడు కన్యాశుల్కం, ప్రతాపరుద్రీయం 1897 ప్రచురింపబడినవిగదా! ఈ ప్రయత్నరూపంగానే 1895లో జన్మించిన రామిరెడ్డి Voice of the Reed మొదలగు వ్రాతలను ఇంగ్లాండులో ముద్రించబోతున్నారు.

దువ్వూరివారి వంశకథకు వస్తాం:- పెదమారెడ్డి పెంచలురెడ్డి (పెంచలు అన్నది-పెను+శిల అన్నదాని వికృతరూపమని చెపుతారు. నెల్లూరుజిల్లా పడమటి హద్దుగాఉన్న వెలిగొండలలో ఉన్న పెంచలు కోన నరసింహస్వామి పేరు ఇది) ఖామినీ సుల్తానులకు శిస్తువసూలు చేసే ఇజారాదారుగా ఉండి, మాట బాగా సాగించుకొన్నాడు. ఈ వంశంలోని రామస్వామిరెడ్డి కవికోకిల పితామహుడు. ఈయనే ఆ ఇంటి పెత్తనం చేస్తుండినాడు మన కవి రామిరెడ్డి తమ్ముడు- బాలకృష్ణారెడ్డి, చెల్లెలు రుక్మిణమ్మ. ఈమె అంటే రామయ్యకు మంచి మక్కువ అందువల్లనే, నలజారమ్మ కృతిని చిన్ననాడే దివికేగిన యీమెకు అంకితం ఇచ్చినాడు.

రామిరెడ్డి చిన్నతనంలోనే తండ్రి చనిపోయినాడు; సమర్థురాలైన తల్లి-లక్షీదేవమ్మ రెక్కలక్రిందకు వచ్చినారు పిల్లలు. ఆనాడు ఈ గూడూరు దువ్వూరు వారికి ముప్పయి మాగాణి ఎకరాల కమతం. తల్లి చక్రాంకితాలు పొందిన వైష్ణవి. పూర్వాచారాలను మూఢవిశ్వాసాలను పీఠాధిపతులకంటే ఎక్కువగా పరిరక్షించేది సంసారుల ఇండ్లలో (సవర్ణ కృషికులు) మూలనున్న ముసలమ్మలే! ఈ ఆచారాల సడలింపుకు కులబ్రాహ్మణులు ఒప్పుకొన్నా యీ అవ్వలు ఒప్పుకోరు. అట్టి ఏలుబడిలో రామిరెడ్డి సాకబడినాడు. మా కుటుంబాలలో వీర వైష్ణవం ఎంత కరడు గట్టిందంటే-ఈ అవ్వలు వీరగుండులో ఈశ్వరుడున్నాడని నలభై పలాలగుండు అంటారు. ఈశ్వరకోర అనే నల్లవడ్లను (ఇసనకోర,

పొట్టునలుపు గింజ ఎరుపు) హనుమంతకోర లంటారు. ఇట్లాటిదే వీరి దరువు. ఈ ఆదనులోనే రామిరెడ్డి లేతమనసులో ఆధ్యాత్మిక బీజావాపం జరిగినది.

## రెడ్లలో చదువు

అనాదిగా నెల్లూరు తూర్పునాటి రెడ్ల ఇండ్లలో కొంత చదువు సంస్కారం పాదుకొని ఉండేది. ఆడపిల్లలుకూడ పెద్దపుస్తకాలు(చాట భారతాలు)చదువుకొని ఉండేవారు. ఒకచలోక్తి:- ఒక అమ్మాయి మనువుచూపులకు పెండ్లిపెద్దలు వచ్చి, కన్నెపడుచును ఏదైనా చదువమన్నారు. అన్నెంపున్నెం ఎరుగని ఆ బిడ్డ, శ్రీనాథుని శృంగారనైషధంలో దమయతి చెపిన్పన మాటలుగా "విద్వజ్జనులు నన్ను విషయించి వచ్చిరి" అన్న సీసపద్యపాదం చదువగానే, వచ్చినవారిలో ఒక కొంటెకాయ "అటువంటి అసభ్యపు పనులు మేము చేయము" అన్నాడు. విషయించి అంటే కూర్చి, ఉద్దేశించి అని అర్థంగదా! ఇట్టిదే మా జానపదుల రసికత! పెద్ద వరుసవారిలో ప్రబంధజ్ఞానం గలిగినవారు ప్రతిఊరా ఉండేవారు. ఇప్పుడుగదా లోతులేని సినిమా సాహిత్యం ప్రబలి ఉండేది.

## విద్యాభ్యాసం

రామిరెడ్డి తల్లి చదువుకొన్న సమర్థురాలు మొదట, గూడూరు వీధిబడిలో రెక్కలు కూతరాని ఈ కపికోకిలను చదువ వేసినారు. పల్లెటూరి చదువు వానాకాలపు చదువు, అంటే - సేద్యపు పనులులేని కారికకాలంలోనే పిల్లకాయలు పల్లెకూటం మొగం చూచేది అందువల్ల ఈయనకు గూడూరు చదువు ఒంటబట్టలేదు. పెమ్మారెడ్డి పాళెంలో - పినతల్లి, రామిరెడ్డిని తమ్ముడు బాలకృష్ణారెడ్డిని అభిమాన పుత్రులుగా స్వీకరించి, తమ ఇంట బెట్టుకొని సాకి సంతరించినది. ఈమెకు సంతానం లేదు; వీరికి యాభై ఎకరాల భూస్థితి చివరకు ఈ కుగ్రామమే రామిరెడ్డి వ్యవసాయానికి సాహిత్యకృషికి సారవంతమైన క్షేత్రమైనది. పెమ్మారెడ్డిపాళెంలో సాతాని సీతయ్య వీరి గురువైనాడు. దీనితో వైష్ణవానికి ఇంకొక పట్టు దొరికినది. కాని, ఆదినాలలో పై చదువుకు నెల్లూరే గతి.

## నెల్లూరు చదువు

రామయ్య నెల్లూరులో హార్వేదొర స్కూలులో చేరినాడు. ఇక్కడ పాదరసం వంటి ఈ బాలుని మనసు నానాముఖాల పారినది. మూడవఫారం చదువుతూనే, విడిభాగాలు తెప్పించి ఒక ఫోటో క్యామరాను సొంతంగా అమర్చి, బంధువుల ఫోటోలుగూడ తీసినాడు. ఈ వ్యాసంగాలలో రామయ్యచదువు చాకిరేవుకు పోయింది. తర్వుఫారం ఫెయిలైనాడు. దొరకు కోపంవచ్చేదానికి బదులు, తన విద్యార్థి బహుముఖ ప్రజ్ఞకు ఆనందించినాడు.

ఈ పరీక్ష తప్పడం రామిరెడ్డి జీవితాన్ని భావి ఉపయుక్త మార్గాన పెట్టినదేమో అనాల విద్యాలయాల పెద్దచదువు - అందలి ప్రజ్ఞా ప్రాభవాలు జీవితపు మనుగడకు ఉపకరించవివారు ఎందరో మేధావులున్నారుగదా!

## సేద్యంలో చదువు

ఇంతలో తండ్రి మరణం. బడివదలి ఇల్లుచేరి సేద్యగాడైనాడు - రామిరెడ్డి. ఆ పల్లెల ప్రకృతి శోభలో, గ్రామీణుల అకళంక ప్రవర్తనలో, ఈయన మనసు అటుఇటు పారికాడి ఎన్నో విషయాలను నేర్చుకొన్నది. ప్రకృతే విద్యాలయం కాగా, ఈ యువకుడు గ్రామీణ జీవన ప్రతిబింబమైనాడు.

- ఎన్ని యిక్కట్టులుండిన, నేమియైన
గుడువ గట్టను నొకవేళ కొదువయైన
ప్రకృతి సామీప్య జీవన భాగ్యమొకటె
యున్న కడగండ్ల మఱపించు నూఱడింప.

-వానకాలపు పల్లెజీవితము

ఇదీ ఆయన జీవిత తత్త్వం! పొలాల సేద్యపు పనుల సందున, గురువు లేని చదువైనా గురికుదిరింది కాబట్టి జ్ఞానం సరసరా ఎదిగినది. స్వయంకృషితో ఇంగ్లీషు పెంచుకొన్నాడు. సంస్కృతం అభ్యసించినాడు. కాని, ఇంకా కవితా బీజం అంకురించలేదు. సబ్బులు చేయడం నేర్చుకొని, ఆపని రపాన (ఆసక్తి)

చేలసేద్యం గూడ ఉజ్జగించినాడు. ఇదంతా ఏకలవ్య శిష్యత్వమే! అయినా చేతి వేలు గాని రొక్కపు వేలుగాని అడిగిన వారు లేకుండినారు

## దేశం మీద పోయినాడు

పెమ్మారెడ్డిపాళెం పినతల్లిది మురిపెము; గూడూరు కన్నతల్లిది అనుశాసనం. గూడూరులో ఒకనాడు ఏదోఒక కుంటిసాకుతో సేద్యపు మందలకు పోను ఎగగొట్టినాడు. తల్లికి కోపం వచ్చినది. తల్లికి ఎదురుమాట పలుకలేకుండిన రామయ్య - విధివిలాసంగా బోలు, ఆమె మాటకు ఎగటాయించి(తిరుగబడి)నాడు. ఒక పెద్ద చుట్టందగ్గరకు పోయి అమ్మతెమ్మన్నదని పైకం తీసుకొని చెప్పకుండా దేశంమీదికి పోయినాడు. అంటే - కనబడకుండా పోయినాడు. మాటసాగించుకొనే పట్టుదల గలిగిన లక్షీదేవమ్మ హృదయంలో మాతృత్వం చెమ్మగిలింది. చిన్నప్పటినుంచి రామిరెడ్డి మానసానికి మతం - నైతిక ధర్మవికాసం అంటే ఎక్కువ అభిమానం ప్రీతిగా ఉండేది. వివేకానందస్వామి ఆత్మపీఠాధిష్ఠాన దేవత అయినాడు. ఇదంతా తల్లి ఆకళింపుకు దెచ్చుకొని నేరుగా కలకత్తా బేలూరు రామకృష్ణ మఠానికి పోయినది. ఆ దివ్య వాతావరణంలో అధ్యాత్మిక వాయువులు ఆఘ్రాణిస్తూ గురుకుల వాసం చేస్తుండిన పుత్రుని చూచినది: మంచి త్రోవన బడినందుకు ఆనందించినది ఇదేగదా మాతృకాంక్ష! కొడుకును గూడూరు ఇంటికి తీసుకొని వచ్చినది.

## పెండ్లి

అమ్మాయివస్తే అబ్బాయికు ఆస్థి అణగతవని గదా పెద్దల అనుభవం. పాపిరెడ్డిపాళెం దేశెళ్ల బలరామిరెడ్డి కూతురు - శేషమ్మను ఇచ్చి పెండ్లిచేసి, కపిల అర్రుకు కాడి తగిలించినారు. ప్రణయ భాగవతం బాగానే ఆడినాడు. కుముదమ్మ అనే బాలిక తల్లిగండాన బుట్టినది. 1925లో ఆ బాలింతతల్లి, 1926లో బిడ్డ గతించినారు. ఈ ఘట్టంలో మనకు మిగిలింది- ఆ భార్యావియోగంలో వ్రాసిన కొన్ని చక్కటి పద్యాలు మాత్రమే! ఉప్పు పులుసు దిన్న కోడెప్రాయం గదా

కవిది. 1929లో అన్నపూర్ణమ్మను రెండో పెండ్లి చేసుకొన్నాడు. ఈమెకు వేణు గోపాలరెడ్డి (1931), జనార్దనరెడ్డి (1934) అని ఇద్దరు పుత్రులు కలిగినారు.

మరణం

1945లో పక్షవాతం కుడితట్టు తగిలి మంచంపట్టినాడు. అయినా మతి చెడక, విద్యావ్యాసంగం చేస్తూనే 11-9-1947 రాత్రి 52వ ఏట సుఖమరణం పొందినారు. ఆయన మంచికి ఇదే సాక్షి.

ఆ కాళరాత్రి ఈ దువ్వూరు కవికోకిల కూతను శాశ్వతంగా మాన్పిన వర్ష ఋతువు?

## 3. కవిత్వ ప్రాదుర్భావము

పల్లెటూరి సహజ రామణీయకత

రామిరెడ్డి కాపుబిడ్డ. పల్లెలచుట్టూ ఉండే సహజ ప్రకృతిశోభ, సౌందర్య పిపాసను ఈయనకు ఉగ్గుపాలతో పోసినది. ఆ క్షేత్రదృశ్యానికి ప్రాణం పోసే పక్షులు, పచ్చిక బీటి పొలాలకు సొంపుగూర్చే పశువుల మందలు, పనిపాటల వారి కల్లా కపటం లేని ఎకసక్కాలు-నవ్వులతో నిండి ప్రతిధ్వనించే రోదసి, చేల గనిమలపై నడిచే మనుష్యులు, కయ్యలమధ్య కుప్పలు - ఆపరిసరాలకు శాంతి గభీరతలను సమకూర్చగా, ఆ వాతావరణంలో ఈ కాపుకుర్రడు సేద్యం చేయించి, తాను పండించిన ధాన్యరాసులు చూచి ఆనందించినాడు. సంజెవేళ యలో ఇంటికివచ్చి భారత భాగవతాలు చదువుకొనేవాడు.

కవితాశక్తి మేల్కొన్నది.

మానవుల జీవితాలు చీలుదారుల కూడలి చేరుకొన్నప్పుడు, ఏదో ఒక బ్రహ్మాండస్వల్పం (Tremendour Triflee) ఆ జీవిత గమనాన్ని అటో ఇటో చేరుస్తుంది. రామయ్యకు పందొమ్మిదో ఏట ఒకచిన్న సంఘటన జరిగినది:- ప్రక్క-

గ్రామం - గండవరంలోఉన్న గ్రంథాలయానికి పదేపదే పోయి, చదువుకొని వస్తుండేవాడు ఒకనాడు ఒక ఉత్తరాది శతావధాని, లైబ్రరీకి వచ్చి, ఆమాట ఈ మాట సందున "కవిత్వం, పూర్వజన్మ సంస్కారంవల్లనే లభిస్తుంది. చదివితే పండితుడు కావచ్చును గాని కవికాలేడు" అన్నాడు. ఈ తరుణ వయస్కునికి ఆపాదమస్తకం నరనరంలో ఆత్మవిశ్వాసం గోరువెచ్చగా నిండి పారుతుంటుంది. "మనిషి ప్రయత్నిస్తే చేయలేనిది - అనేది ఉంటుందా?" అని, కోడెప్రాయపు ఎగుపొగరుతో అన్నాడు. "శ్రమపడి ఇతరకళలు అలవర్చుకోవచ్చు. ఛందస్సు నేర్చుకొని పద్యం అల్లవచ్చునుగాని. అందు రసం పుట్టదు." అన్నాడు- సరసత తోనే ఆ శతావధాని. "నిఘంటువులు వల్లెవేయుట నూనెకు నష్టియేగాని కవితకు పుష్టిలేదు" అని కట్టమంచి వారన్నది దీనినే. ఈ జానపదుడు ఒప్పుకోలేదు. దానిమీద ఆ పండితుడు చురుకెత్తి "అట్లయితే నీవు వ్రాయరాదటోయ్" అనగానే, ఈయనలో నక్కియుండిన కవితాశక్తి అప్పటికప్పుడే మొగ్గదొడిగినది." "దండము శాస్త్రి ధీమణికి, దండము కావ్యకళావిభూతికిన్" అని బయట పడినది. ఆ సహృదయ పండితుడు ఈ బంతికే తలఊచి "నీవు వ్రాస్తే కవిత్వం నీకు అబ్బుతుందోయ్" అని మంత్రోపదేశం చేసినాడు. ఇందు. కావ్యకళావిభూతి అన్నదే గదా సజీవ లిరికల్ ఎలిమెంట్. దీనినే తిక్కన భవ్య కవితావేశమన్నది.

ఇట్టి యాదృచ్ఛిక సంఘటనమేగదా - కిరాతుడు క్రౌంచపక్షిని కోలనేసి వాల్మీకి మానసంలో దివ్య కవితా ఝరిని పుట్టించినది.

దీనితో ఈ కాపు, సాహిత్యకృషికి గూడ ఏరువాక సాగించినాడు. సాంప్రదాయిక పద్ధతిలో కవిత్వం దొర్లసాగినది. గూడూరులో, "అంఘ్రిభవుని కావ్యంబు గ్రాహ్యంబుకాదు "అన్న అప్పకవి శిష్యుడు కాబోలు - ఒకపండితుడు "ఈ కాపు కవిత్వపు కూతలు మానవోయ్. ముందు పాండిత్యం సంపాదించుకో" అని ఈసడించుకొన్నాడు. దీనికి "నాపొసగిన కైతయుం జివికి పోవును పాండితి దిబ్బగుంటలోన్" (రసిక జనానందం) అని అనుకొన్నాడేగాని, ఈసుపగల పడ

గల విప్పజేయ లేదు. పాండిత్యాన్ని పరిశ్రమతో వృద్ధి చేసుకొన్నాడు. అక్కసు దీర్చుకొను "పండిత ప్రతిజ్ఞ"లో ఛాందస పండితకవిని ఎగతాళి చేసినాడు.

## పండితామోదం

అప్పుడప్పుడు నెల్లూరుకు వచ్చి పండితులను కవులను కలుసుకొని వారు చెప్పినది విని పోతుండేవాడు. 1915లో రామిరెడ్డి దువ్వూరి సుబ్రహ్మణ్య శర్మను కలుసుకొన్నాడు. ఈ బాలకవి వ్రాతలు విని (ముసలి ముప్పందానగూడ బాల కవి బిరుదం వదలని కొందరు కవులను జూచి రామిరెడ్డి నవ్వేవాడు) పొంగిన హృదయంతో శర్మ ప్రోత్సహించినాడు. కపికి ఏనుగంత సత్తువ వచ్చినది. వీరిద్దరికి ఈ గురుశిష్యభావం పెరిగి పెరిగి మరణ పర్యంతం సాగుతునే ఉండినది. రసలబ్ధుడు–నేలటూరు రామదాస అయ్యంగారు (ఎం. ఎ.) అన్నట్లు– శర్మ ఇంకనూ అడవిబల్లి వదలి, బడిబల్లి చేరలేదు. అంటే– శర్మ ఫారెస్ట్ డిపార్టుమెంటులో క్లార్కుగా ఉండి, మా వెంకటగిరి రాజాగారి కళాశాలలో ఆంధ్రోపాధ్యాయులైనారు. ఆతర్వాత ఒకసారి, కళాప్రపూర్ణ వేదం వెంకటరాయశాస్త్రి దగ్గరకు, మిణుకుచూ పులిదగ్గరకు లేడి పోయినట్లు దరిసినాడు. వేదంవారి గంభీరాకృతి మొదటి చూపుతో హడలుకొట్టుతుండునేగాని, ఆయనిది కోమల శిశుహృదయం. కులగోత్రాలు పాటించకుండా చదువులలో మర్మాలన్నీ చెప్పి యువక కవులను ఎక్కువగా ప్రోత్సాహపరచేవారు. పొగరు చూపితే తిక్క అణచేవారు. శాస్త్రి ఈకవి "కవిత్వ సాంబారమంతా పారబట్టిచూచి" "కవితాబీజమైన ప్రతిభ నాకు గోచరించినది. శబ్దసౌష్ఠవము ప్రవణత్వముగూడ నగుపడుచున్నది." అని ఉత్సాహాన్ని గంతులు వేయించినారు. గిడుగు రామమూర్తి పంతులు "నిజమైన కవిత్వమున్నదిగాని, పాతపద్ధతి" అన్నారు. ఇదీ ఆనాడు పండితలోకంలో రేగిన ఆకర్షణ ప్రతికర్షణ గుణాల వైపరీత్యం!

## కర్షక గ్రామీణకవి

రామిరెడ్డి ఇంగ్లీషుభాషలో పాస్టరల్సు అనబడే కావ్యరీతుల ననుసరించినవాడు. ఈ విధానాన్ని డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి, కవికోకిల "కృషీ

వలుడు" ఉపోద్ఘాతంలో ఇట్లా వివరించినారు.- "పాశుపాల్యాది గ్రామాంతర వృత్తులవారి అకృత్రిమ జీవిత స్వభావాములను వర్ణించు కావ్యములు ఇవి. ఇవి ఆధునిక ఐరోపా వాఙ్మయమునందును వ్యాపకమునకు వచ్చి ఉన్నవి. హైందవ భాషలలో ఈ తరగతికి చెందిన కావ్యములలో శ్రీకృష్ణ బాల్యక్రీడలు, బృందావన జీవితము, గోపగోపికా సంచారములు ఎంతయు హృదయరంజకములు భాగవతమునందలి దశమ స్కంధము, విశేషించి ఎఱ్ఱాప్రగడ యొక్క హరివంశ పూర్వభాగమును దేశీయ వాక్ప్రపంచమున తమస్సు నణంచి, చల్లని వెన్నెలను కురిపించి చిత్తానందము చేయు చంద్రబింబముల వలె నున్నవి". అనగా-రామిరెడ్డి గ్రామీణ కవి అనుట.

"కర్షక విలాస" నాటకము, "కృషీవలుడు", "ముసలి మాలెత" "వానకాలపు వరిచేలు" మొదలైనవి ఈ శాఖకు చెందిన రచనలు. ఈ ప్రకృతి ప్రీతిగల ఇంగ్లీషు రేక్‌పొయెట్సు (సరోవరమయమైన అరణ్యక దృశ్యాలమధ్య నివసించిన)- వర్డ్సువర్త్ మొదలగు మహాకవుల సంప్రదాయానికి చెందినవాడు— ఈ రెడ్డి పొలాన్ని అంటిపెట్టుకొనే, ఆరుబయట పచ్చటి చేలలో,సేద్యం మందటు తలమునిషిపని చేస్తూనే (పనిపెత్తనం) ఈయన కవిత్వం ఊహించుకొని, అమరిక ఏర్పరచుకొనేవాడు. "ఇదిగో! ఇక్కడ కలుపు దీసేటప్పుడు అది వ్రాసినా; ఆ మిట్ట చేలో కుప్ప నురిసేటప్పుడు ఇది వ్రాసినా "అని తాను చేలలో కవితకు పెట్టిన చలువ పందిళ్లను వచ్చిన మిత్రులకు చూపుచుండేవాడు.

## భావకవిత్వ ప్రభంజనం

యూరపుఖండలి రొమాన్‌టిక్ పొయిట్రీ - భావకవిత్వం పేరిట మన దేశంలో, 1910-20 సందుకట్లలో ఋతుధర్మమో అన్నట్లు ప్రవేశించినది. ఆంధ్రలో ఆచార్య రాయప్రోలు సుబ్బరావు ఈ కవితారీతికి కులపతి అయినాడు. వెంటనే అబ్బూరు రామకృష్ణరావు చేరినాడు. ఈ [రాయప్రోలువారికి ఇంత వరకు ప్రభుత్వ బిరుదంగాని, విశ్వవిద్యాలయాల బిరుదంగాని లేకపోవుటను

గూర్చి ఏమనాలనో తెలియకున్నది. పూర్వం రడ్యార్డ్ కిప్లింగ్‌కు నోబెల్ బహుమతి వచ్చినప్పుడు, విమర్శకుడు - జి కె చెస్టర్‌సన్ ఇట్లా ఎత్తి పొడిచినారు. "Our black-smiths are honoured while our gold-smiths are ignored" ఇదే మనస్థితికి తగిన వ్యాఖ్యానం.]

తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి ఒజ్జగా "సాహితీ సమితి" ఏర్పడినది. ఇది కొందరు కవులను కూడగట్టుకొని ఒక ప్రత్యేకశాఖ అయినది. ఇప్పుడే కర్ణాటకమున "గళియరగుంపు" పేర యువకులు కొత్తదారులు త్రొక్కినారు. లిరికల్ ఎలమెంట్ బాగా ఉన్నవాడు కాబట్టి రామిరెడ్డి ఆ కవికోటిలో అతికినట్లు కలిసి పోయినాడు. "భావనాపటిష్ఠమైన స్వేచ్ఛాప్రియకవితే" ఈ నూతన ప్రకారమని, దానికి "వైచిత్రి" అని ఈయన పేరు బెట్టినాడు.

## రచనలు

- వనలతయైన నా కవిత పత్రపుటంబుల బూవురెమ్మలన్
దినదిన జృంభమాణమయి తేజరిలెన్ సహజ ప్రరోహ వ
ర్ధన నియమానుసారముగ, దల్లత యెన్నడు దోటమాలి పా
ణిని గనుగోని వన్యరమణీయత జిల్కు నపూర్వపద్ధతిన్.

- కృషీవలుడు

ఇది రామిరెడ్డి తన కవితను వర్ణించుకొనిన విధము. రామిరెడ్డి మనసు భిన్నరుచులకు ఆలవాలమైనా, ఐక్యత సంధించుకొని శాంతిని అనుభవించేది. సాంప్రదాయిక- అధునాతన రీతుల మధ్య నిలిచి, తన సమైక్య సామరస్య భావాలతో ఒక అట్టెడ (వంతెన) కట్టుకొని కొత్తపాతలకు రాకపోకలు జరుపుచుండే వాడు. ఇంట అలముకొనియున్న వైష్ణవ మధుర భక్తిభావం రూమీ సూఫీమతం వైపుకు తీగబారినది. ఇది రవీంద్రనాధుని దరిచేర్చినది. ఐరోపా ఖండమందలి సింబాలిజం (ప్రతీక కవిత), ఐర్లండు- ఎ.వి. ఈట్సు మర్మధోరణి యివన్నీ

గలచి ఈయన కవితారీతులు కలగూరగంప అయినవి. సంస్కృత సంప్రదాయము, ప్రాచీన ఆంధ్రకవితా శయ్యలు, ఇంగ్లీషు షేక్సుపియర్ షెల్లీల భావ వైఖరులు ఒక కలగలుపు ఆనందానుభూతిని రామిరెడ్డిలో కలిగించినవి. "ఇల విశాలము, భావలోకము క్రమముగా బడయు మార్పు" (కృషీవలుడు) అని తాను చెప్పుకొన్నట్లే నేర్చుకొన్న విజ్ఞానశాస్త్ర ప్రభావంవల్ల ఈ కవిభావాలకు పరపులోతు చేకూరినవి అసలు ఈ మనిషికి మంచి సంయమనం ఉండేది; కాబట్టే ఎందులోగాని దుడుకుపాటు చూపకుండా ఉండినాడు.

పల్లెటూరు వాడు అయినందున, తెనుగుతేనె నుడికారం వ్రాతలలో వెల్లువ బెట్టినది. పల్లెలేగదా జానుతెనుగుకు పుట్టుసొనలు! ఈ నుడికారపు సొంపు ఆనాడు రాయప్రోలు, జాషువ, రామిరెడ్డి - ఈముగ్గురి సొంతసొమ్ము అనవచ్చు. నేటి అభ్యుదయ కవులు ఎక్కువ మంది మాండలిక సౌభాగ్యాన్ని తమ వచనరచనలలో కురిపించడం ఆహ్లాదకారి అయిన విషయం. ఈ ముగ్గురు వర్ణించిన ప్రణయానికి అశ్లీలతాదోషం అంటలేదు. తుమ్మల సీతారామమూర్తి తెలుగులెంకై వీరిలో చేరినాడు.

## అనువాదాలు

మొట్టమొదటలో రెడ్డి చాలా సంస్కృతానువాదాలు చేసినాడు. గ్రామీణ స్పర్థలు సామరస్యాలమీద "కర్షక విలాసము" అనే నాటకం వ్రాసినాడు. స్వగ్రామం గూడూరులో కాపు ఇల్లాలు– "నరజాలమ్మ అగ్నిప్రవేశం" స్వకులాభిమానంతో వ్రాసినా, నీతికి ధర్మానికి ఆత్మాహుతి చేసిన ఒక పేరంటాలు శీలాన్ని ఉత్తేజకరంగా వర్ణించినాడు. కట్టమంచి రామలింగారెడ్డి "ముసలమ్మ మరణం", ఇంకొక రెడ్డి పడుచు, ఊరి చెరువుకట్టను కాపాడను చేసిన ప్రాణత్యాగ కథ. దాని పలుకుబడియే ఈ నలజారమ్మ అనవచ్చు.

## కావ్యాలు

"వనకుమారి" ఒక ఖండకావ్యం. 1918లో విజయనగర సంస్థానం జరిపిన పోటీలో రు. 500 ప్రథమ బహుమతిని ఇది పొందటంతో, రామిరెడ్డి

సాహిత్యకీర్తి నెల్లూరుసీమ పొలిమేరలు దాటి ప్రాకినది. దీనిలో షేక్సుపియర్ "టెంపెస్టు", "As you like it" నాటకాల జాడలున్నా చౌర్యమనిపించుకో కుండా మెప్పు లందినది.

ఋతుసంహారం, పుష్పబాణ విలాసము, సంస్కృతంనుండి అనువదించి నాడు రసికానందం, స్వప్నాశ్లేషం, అహల్యానురాగం, కృష్ణరాయబారం సొంత కృతులు.

కృషీవలుడు

ఇది, ఈయన నిర్మించిన కవితామందిరంలో లెక్కకువచ్చిన ప్రథమ మూర్తి మిలటి కెగయు పక్షియైనను భూమిమీద పెట్టియుండెడి గూటిపై చూపువేయక యుండునా?" అని కట్టమంచివారు. రైతైన ఒక రెడ్డి కృషిక జీవ నాన్ని వర్ణించడం మాన్యపరస్తూ ఈ కావ్యంయొక్క లోతుపాతులు, వారికి సహజ మైన - ఇతరులకు అబ్బని విమర్శక పాండిత్యము భాషా సౌభాగ్యంతో వివరించి ఉన్నారు.

రామిరెడ్డి మానసం వివిధ విషయ కోలాహలంతో మారుమ్రోగి పోతు న్నట్లే, సాహిత్య రీతులలోగూడ ఎగిరి చాలా వాటిని అందుకొన్నాడు; క్రిందికి దూకి చాలాలోతులు తాగినాడు కాబట్టే వివిధ రచనారీతులలో వైశద్యం చూప గలిగినాడు.

"జలదాంగన" - కాళిదాసుని పుంలింగమైన మేఘునికి స్త్రీలింగరూపంలో ఈ అంగనను జోడుగూర్చినాడు.

కడపటి వీడుకోలు

ఇద్దరు ప్రేమికుల అసమప్రేమ విషమ పరిణామాన్ని కంట తడిపెట్టేటట్లు అల్లిన కవనం ఇది. రాయప్రోలువారి "తృణకంకణము" తో చాపకూడు కుడువ గలిగినది. ఇందే రామయ్య కవిత్వానికి కళాస్వరూప పరిపాకల పూర్తిగా అబ్బి నది భావానికి తగిన భాషాఫలం ఇతర కృతులలో మక్కుతూ వచ్చి, ఇందు మదరమాగి. పానశాలలో కవితా లక్ష్మికి తారహారమైనది.

## నాటకాలు

నూనూగు వివాసాల ప్రాయంలో నాటక ప్రక్రియకు కడంగినాడు. మొదటి నాటకం కర్షక విలాసము. 1921లో సీతావనవాసము, 1924లో కుంభ రాణా వ్రాసినాడు. ఈ మీరాబాయి కథ - అందలి కరుణరసము ఈయనను ముంచెత్తినవి. ఈ నాటకం ఈకవి అపుగుబిడ్డ, ప్రదర్శనం గూడ వేయించినాడు. సినిమాదర్శకుడు - నటకుడు - నిర్మాతగా ప్రఖ్యాతిగాంచిన వై. వి. రావు (యరగుడిపాటి వరదరావు) అన్న - హనుమంతరావు (గూడూరు వకీలు) రాణా పాత్ర వేసి మంచి పేరు సంపాదించుకొన్నాడు. ఈయన బళ్ళారి రాఘవ, నెల్లూరు నాగరాజ రావు వంటి Tragie Hero అని పేరు. ఈ నాటక ప్రయోగాలు బాగా రక్తి గట్టినవి ఆ తర్వాత వ్రాసిన మాధవ విజయం అంతగా వాసి కెక్కలేదు. ఇందు ఒక Intellectual Villain - ప్రజ్ఞావంతుడైన దుష్టుని సృష్టించినాడు. "కాంగ్రెస్ వాలా" (1935) ఒక అవహేళన నాటకం.

## ఖండ కావ్యాలు

చిన్న చిన్న ఖండికలు అనేక శీర్షికల తో కాలాన్ని బట్టి పరిసరాలనుబట్టి చాలా విషయాలను నిజ సహజ కవితా గుణంతో వ్రాసినాడు. పాత భావాలను కొత్త మాటలతో చెప్పడమే ఈయన నేర్పు.

## విమర్శక వ్యాసాలు

చాలామంది కవులు పద్యాలను పొంకము చేవ చిక్కదనముతో శిల్పాకృతిలో వెలయించగలరు గాని వీరిలో చాలామందికి వచనం నడువనే నడువదు, ఒకవేళ నడిచినా కుంటుతూ నడిచి భావస్ఫురణ లేకుండా ఉంటుంది. ఇక కారణ విమర్శకశక్తి హేతు వాద నిరూపణ మన పండితుల మానసిక క్షేత్రాలలో మోసులెత్తని గింజలు. రామిరెడ్డి లౌకికుడు ఉదారవాది, ప్రపంచ వాఙ్మయరీతుల చవిచూచిన సంస్కారి. విమర్శక గుణం నిండుగా నిండిన తల ఆయనిది. భావ ముండే భాషకు పేదరికమే ఉండదు; కాబట్టి ఈ కర్షకుడు అనేక విషయాలను ఆధునాతన పద్ధతిలో సమీక్షించి చక్కటి వచన వ్యాసాలు చాలా వ్రాసినాడు.

ఈ గద్య రచనలో కవితాగుణ స్ఫూర్తి వ్యక్త మవుతూ ఉన్నది. శాంతి - సమత- మానవోన్నతి ఈయనకు ప్రీతిని గూర్చే విషయాలు. సాహిత్య విమర్శ నలను విషయపూర్ణంగా క్రొత్త స్రోతలలో నడిపించినాడు. మర్మకవిత్వాన్ని విపులీకరించినాడు.

## పారసీ అనువాదాలు

### పానశాల

రామిరెడ్డి మనసు దేనిమీదబడితే దానిమీద ఒక్క ఆతుక్కొన్నట్లు లగ్నమై ఉంటుందని అనుకొని ఉన్నాము గదా! 1926 ప్రాంతాన పారసీభాష మీద ఈయనకు తగుల మేర్పడినది. నెల్లూరు పెద్దబజారు మార్కెట్ దగ్గర బాగా బ్రతికిన ఒక ముస్లిం కుటుంబి నివసిస్తుండివాడు. ఆయన పేరు హబిబుల్లా సాహెబ్. వేదం వెంకటరాయ శాస్త్రి తురుక తెలుగులో "ముష్‌ల్ వాణ్ణి" అని అంటూ వుండినా ఉరుదూ పారసీ భాషలలో మంచి పాండిత్యము కలిగి ఉండినాడు కవికోకిల ఆయన దగ్గరకు పలుమారు పోయి, తన స్వయం కృషివల్ల ఏర్పడిన పారసీ భాషకు మెరుగులు బెట్టించుకొనేవాడు. చురుకైన బుద్ధి కాబట్టి అనువాదానికి కావలసినంత పారసీ భాషాజ్ఞానమును, భావమెరిగి వ్రాయగలిగిన పాటవాన్ని సముపార్జించుకొన్నాడు.

పారసీ మహాకవి ఒమర్ ఖయ్యాం ప్రపంచఖ్యాతి గాంచిన ప్రతిభాశాలి. భావకవి. పదకొండో శతాబ్దం వాడు. కవిత్వమునే గాక అనేక కళలను నేర్చిన సాహిత్యోపన్యాసకుడు. ఆయనకు జ్యోతిషం ప్రీతిని గూర్చిన విషయం. (మన ప్రారబ్ధవాదానికి కొంత ఎడమైన విధంగా) విధి చేష్టలను నమ్మిన ధీరుడు. ఖయ్యాం, అంటే గుడారాలు కుట్టేవాడని అర్థం. వీరి పెద్దలు ఈ వృత్తిలో ఉండి, ఈ ఇంటిపేరును సంతనపరచి ఉంటారు. ఖయ్యాం రుబాయత్ అనే ఛందంలో తన తలపోతలన్నిటిని - గాథలుగా - భావగాంభీర్యము భాషా సౌందర్యము ఒప్పారేటట్లు చాలా పద్యాలను వినిర్మించినాడు. మన చార్వాకుని భావఛాయలు,

ఆ పోలికలు, గ్రీకు ఎడిక్యూరస్ జాడలు ఈయన రచనలలో ప్రస్ఫుటంగా కనిపిస్తవి. చన్న నిన్నకంటె ఉన్న నేటితో తృప్తిపడమంటాడు;-

- గతము గతంబె, యెన్నటికి గన్పులం గట్టదు, సంశయాంధ సం
  వృతము భవిష్యదర్థము; వివేకవతీ, యొక వర్తమానమే
  సతత మవశ్య భోగ్య మగు సంపద; రమ్ము! విషాదపాత్రకీ
  మతమున దావులేదు; క్షణమాత్ర వహింపుము పాన పాత్రికన్.

మన మధురప్రేమ ఛాయలుగల సూఫీగూడ ఈయన. ఈ రుబాయత్తులు ఎన్నోగలవు, మన వేమన పద్యాలవలె సంఖ్యలో ఎదగిపోయినవి.

మొదట ఇంగ్లీషువారికి ఖయ్యాం మధువును అనచేసినది - ఫిడ్జెరాల్డు; జె. బి. నికొలె పరాసుకవితా రసికులకు రుచిచూపినాడు. ఫిడ్జెరాల్డు ఇంగ్లీషు పద్యాలను, రాయప్రోలు సుబ్బారావు "మధుకలశ" మని తర్జుమా చేసినాడు. పిఠాపురం ఉమ్మే అలీషా కవి, 300పైన పద్యాలలో కొన్ని రుబాయత్తులను తెనుగు భారతికి కానుక బెట్టినాడు. మన రామిరెడ్డి పారసీనుండి వడగట్టి 125 పద్యాలుగా "పానశాల" పేర ఆంధ్రావళి మోదానికిగా ఎదుట బెట్టినాడు. ఈ మూడింటిలోను ఏరుకోదగిన ఆణిముత్యాలు చాలా ఉన్నవి. కాని ఎక్కువ సంఖ్య మేలిమిసరుకు రామిరెడ్డిదే. తెలుగు నుడికారపు సొంపగం, రావు-రెడ్డి పద్యాలలో వెల్లివిరిసినది కొన్ని పద్యాలు ఆయనవి, కొన్ని రెడ్డివి మనసును ఇంపున కరగిస్తవి.

రామిరెడ్డి కవితలలో, ఆయన కీర్తి కిరీటంలో కోహినూర్ వజ్రంవంటిది — ఈ పానశాల. ఈ మాటతో ఆయన ఇతర కృతులను క్రిందుచేయుటగాదు, దీనిని మీద చేయుటే! ఈ అనువాదానికి ఒక్క ఏడాది పట్టినది; 1927 చివరన పూర్తిచేసినారు.

- పారసికన్య కావ్యమయి పల్లవ కోమలమై సుధారసం
  బూరెడు మా తెనుంగునుడి నొప్పిదమౌనటు నీదు భావముల్

దుప్పూరి రామిరెడ్డి

యేరిచి చేర్చి కూరిచితి నింపగు కావ్యము! నో ఖయా సీ
పేరిక యావదాంధ్ర పృథివీస్థలి శాశ్వతమై తనర్చగన్!

అన్నమాట గట్టిగా నిలుపుకొన్నాడు ఈ రచనకు సుదీర్ఘమైన విషయ పూర్ణమైన అవతారికను సంతరించినాడు. ఇది రామిరెడ్డి విషయ సంకలన చాతురిని విమర్శక ప్రజ్ఞను బయట బెట్టినది.

షాది "గులాబితోట"

దీని తర్వాత షాది అన్న నామాంతరం గలిగి, ముష్రరీఫ్ ఉద్దీన్-బిన్ ముస్లిహ్ ఉద్దీన్ అను 12వ శతాబ్దపు పారసీకకవి రచించిన "గులిస్తాన్" మహా గ్రంథమును, "గులాబి తోట" పేరున అంచెలు అంచెలుగా 19కి4లో పూర్తిచేసినాడు. షాది అనేది, ఆకవిని ఆదరించిన పాదుషాపేరు. ఈవాడుక మనకూ ఉన్నట్లున్నది:- నెల్లూరును తిక్కనపేరుగల తెనుగు చోళులు పాలిస్తుండిన కాలంలో (మనుమసిద్ధితాత) గుంటూరునుండి వచ్చిన తిక్కన సోమయాజి పెద్ద నాయన,తమ ఏలిక ప్రీత్యర్థం తన కొడుకుకు తిక్కన అన్న పేరు బెట్టికొన్నాడు.

గులాబితోట గద్యపద్యాలతో, మన హితోపదేశ చంపువువలె - 1౩0 కథలు, 111 నీతిసూత్రాలు కలిగిఉన్నది. ప్రవృత్తి మార్గంలో ఐహిక జీవన ధర్మాన్ని శాంతిని దానధర్మాదులను, భూతదయ సత్కర్మలను నొక్కిచెప్పినది. ఇది మన హిందూ తత్వానికి దగ్గరదగ్గరగా సరిపోయినది. రామయ్య ఈ తెనుగు సేత జానుతెనుగు నుడికారంతో, నాటికి రాజేసుకోను పద్యాలు ఇమిడిక కలిగి ఉన్నవి. "కవిత్వంలో నీతిస్పర్శ లేనిదే సౌందర్యము పరిపూర్ణము కాదని నా ఉద్దేశము" అన్న నిజలక్ష్యాన్ని నిలబెట్టుకొన్నాడు.

ఈ పారసీకకృషిలో ఇరుక్కొని ఈ కృషీకకవి ఇతర పంటలు ఏమీ పండించలేక పోయినాడు. ఇది కార్యదీక్షో సోంవేరితనమో (సోమరితనం) గాని, పనిమాత్రం జరుగలేదు. ఆయనతో-" ఏమి రామయ్యా, ఈమధ్య ఏమీ వ్రాయ

లేదే?" అంటే – "దుప్పారి కోకిల తురక పారసి మేసి గొంతంత నసయెత్తి కూతమానె" అని ఒక కవిత్వపు విసరు విసరినాడు.

## ఇంగ్లీషు రచనలు

రామిరెడ్డి పట్టుదలమనిషి- పట్టీగాదు తలగూడ గలవాడు. ఆయన సముపార్జించిన కళలన్నీ స్వయంకృషి మూలకాలైనా, ఇంగ్లీషు నేర్చి, అందు కవిత్వం జెప్పి, ఇంగ్లీషువారి చేతనే మెప్పులందుట ఆంగ్లేయేతరునికి అలవిగాని పని. ఇది రామిరెడ్డి సాధించుకొన్నాడు. తాను వ్రాసిన ఖండికలను "Voice of the Reed" (శరవాణి) అనే పేరున ఇంగ్లీషులోనికి అనువదించినాడు. పేరులో ఒక వినమ్రతా భావమును ప్రకటించుకొన్నాడు. ఇది అంత పెద్ద వేణుగానం గాదు, రెల్లుపాటని అణకువనే చూపినాడు; రామిరెడ్డి ఎసుపొగరు లేనివాడు.

మదనపల్లి, ఆనీ బిసెంటు కాలేజి ప్రిన్సిపాలుగా పని చేస్తుండిన ఐర్లండు దేశపండితుడు – గొప్ప కళావిమర్శకుడు–డాక్టర్ జేమ్సు-హెచ్-కజిన్సు భారతీయ సంస్కారం, భారతీయ తత్త్వశాస్త్రాలపట్ల సానుభూతి కలిగి ఉండినాడు. అయినా, భారతీయులు సహజరీతిలో ప్రాణవంతమైన శుద్ధమైన ఇంగ్లీషును వ్రాయలేరన్న సాధారణాభిప్రాయాన్ని ఈ దొర పంచుకొని ఉండినాడు. Indian English అని ఉపొరల ఎత్తిపొడుపు. అట్టి కజిన్సు, రామిరెడ్డి ఆంగ్లేయానువాదాలను మొగంచిట్లింపులతో చేతికి తీసుకొని, కొంతచదివి ముగ్ధుడై, ముఖవికాసంతో ఔత్సుక్యంతో అంతా చదువుకు ముందుకు సాగించినాడు. ఆతర్వాత కొన్ని సవరణలు చేసి సొగసులు దీర్చి పీఠిక వ్రాసి ఇచ్చినాడు. అందు రామిరెడ్డిని ఎన్నదగిన ఇంగ్లీషు రచయితలలో చేర్చినాడు. ఇంతేగాదు, కజిన్సు తన యూరపు ఖండ సంచారాలలో సభలలో రామిరెడ్డి ఇంగ్లీషు కవిత్వాన్ని కొనియాడి, ఇంగ్లీషు మాతృభాషగాగల వారిని ఇది చదివి ఆనందించమన్నాడు ఆ విమర్శకాగ్రేసరుడు. "మీ కృతి స్వశక్తిమీద ఆధారపడి నిలువగలదు." అని దీవనలు కురిపించినాడు. సర్వెంట్, ఫార్వర్డ్, హిందూవంటి ఆంగ్లపత్రికలు చక్కటి అనుశీలనాలలో ఈ పుస్తకాన్ని ప్రశంసించినవి.

మన, డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య, తమ జన్మభూమి (ఇంగ్లీషు వారపత్రిక)లో "రామిరెడ్డి ఇంగ్లీషుకు తెనుగు నుడికారం సమకూర్చి నాడు" అని పొగడినాడు.

రంభ-యమున మొదలగు ప్రయోగాలతో ఒమర్ ఖయ్యాముకు భారతీయ తను కల్పించినట్లే, రామిరెడ్డి ఇంగ్లీషుకు తెనుగుదనం అబ్బజేసి నాడనుట ఆంధ్రులు హర్షింపదగిన సంగతి. ఈ గ్రంథాన్ని మదరాసు గ.జేశన్ కంపని ప్రచు రించినది.

ఇప్పుడు ఇంగ్లండులో ఏర్పడిన - "1950's Society" వారు రామిరెడ్డి ఇంగ్లీషు కృతులను ప్రచురింపబోతున్నారు. ఇవిగాక, ఇంగ్లీషులో రెడ్డి మరి కొన్ని వ్యాసాలు వ్రాసి ఉన్నాడు.

1927-డిసంబర్‌లో మదరాసు అడయార్. దివ్య జ్ఞాన సమాజంవారి విశాలారామంలో సొసైటీవారి అంతర్జాతీయ థియసాఫికల్ కాన్ఫరెన్సు జరిగినది. నేనూ, రామిరెడ్డి ఆ మారివటవృక్షం సమీపించేతలికి, కజిన్సు ఎదురై, రామిరెడ్డిని ఇట్లా పలుకరించుకొన్నారు:-

" Don't you think it wonderful that an Irishman should deliver a lecture in London on Indian contribution to English Poetry, and an American professor doing Research work in Egyptian pyramids should feel miserable for want of a copy of your Voice of the Reed"

ఇది విని కవి తన్మయుడైనాడు. నేను మురిసిపోయినా. నెల్లూరు రాగానే, అప్పుడు మంచి ప్రచారం ఉండిన బి. జె. ప్రసాదరావుగారి "ప్రజాబంధు" పత్రికలో "మ. కో. రె" అన్న లేఖకనామంతో ప్రచురించినా.

ఈ గర్వకారణోదంతం వివరం ఇది:-

కజిన్సు లండన్‌లో ఉపన్యసిస్తూ దేశీయ భాషలలో సాహిత్య వికాసాన్ని వివరిస్తూ, తెనుగుకవి రామిరెడ్డి కవితాసంపదను, ఆయన వ్రాసిన ఇంగ్లీషు కవి త్వాన్ని (Voice of the Reed) ప్రస్తావించి పొగడినాడు. అది లండన్ పత్రి

కలలో బాగా ప్రకటింపబడినది. ఈజిప్టు పిరమిడ్స్‌లో పరిశోధనలు సాగిస్తుండిన ఆ అమెరికను పండితుడు ఆ వార్త చదివి ఉండి. కజిన్సు ఈజిప్టుకు పోయినప్పుడు, ఆ ప్రొఫెసర్ ఆయనతో ఈ మాటలు పలికినాడు. కజిన్సు ఆ పుస్తక ప్రతిని ఆయనకు పంపినాడు.

ఇది, ఒక ఆంధ్రుని కవితాగానం, ప్రాక్తన మానవ ధిషణా పరికల్పితమైన ఆ బ్రహ్మాండమైన పిరమిడ్స్‌లో మారుమ్రోగిన వైచిత్రం?

జాతీయత – రెడ్డి కులాభిమానము

అప్పటి గాంధీయుగ చైతన్యం ఈ కవిలో జాతీయతను రగుల్కొల్పినది. ఇంతకుముందే, తెనుగునాట దీనికి నారుబోసి నీరుబోసి పెంచినది రాయప్రోలు సుబ్బారావు అనాల. పొట్లపూడిలో మా అప్ప-పొణకా కనకమ్మ ఇల్లు, నెల్లూరు మండలంలో జాతీయోద్యమ లతకు పాది అయినది. ఇదే ఆమె మాకు మిగిల్చిపోయిన బహుభాగ్యం. రాయప్రోలువారు ఆ దినాలలో మా ఇంట ఆస్థానకవి అనదగి ఉండినారు. ఆయన మా గ్రామంలో వ్రాసిన జాతీయగీతాలు పద్యాలు ఉత్తేజకరాలు. "అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వవిద్యాలయములు స్థాపించునాడు" అన్న ప్రబోధపద్యాలు నెల్లూరు పెన్ననీరు త్రాగి వ్రాసినానని, సుబ్బరావు అంటుంటారు. ఈ పద్యాలను ఆంధ్ర మహాసభలో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాల కృష్ణయ్య చదివి ఒళ్లు పులకలెత్తించినది ఇంకా మాకు గమన మున్నది.

1919లో ఒకనెలలో దువ్వూరు రామిరెడ్డి, పొట్లపూడికి రాయప్రోలును చూడను వచ్చినాడు. చిన్న పండితగోష్ఠి జరిగినది.

కలియుగార్జున – గురజాడ అప్పారావు అనే ఆయన, భద్రాచల మన్యంలో అల్లూరు సీతారామరాజు వలె ఇంకొక పితూరి లేవదీసేటట్లున్నదని ప్రభుత్వం అప్పారావును బంధించినది. ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు వాదించి విడుదల చేయించినాడు. ఆ సందర్భములో బెజవాడలో జరిగిన అప్పారావు స్వాగతసభలో రాయప్రోలు వారు వ్రాసిన పద్యాలు –

"విన్నాము కడుపులో నున్న కండలు కదలంగ భారత రణరంగ చరిత..." అన్నవి. నిజంగా కండలు కదిలేటట్టే పొట్లపూడి గోష్ఠిలో సుబ్బరావు చదివినాడు. చివరి పద్యాలలో ఒకపాదం -

"గోచీ వదల్చి కంగుల వీరకాశె గట్టిన అనపోతధీరుని తపస్సు"... అన్నది వినగానే రామిరెడ్డి "అనపోతడు ఎవరు?" అని అడిగినాడు. "కవిగా ఉండి ఆంధ్ర వీరకుమారులు - పల్నాటి వీరుల చరిత్ర చదువలేదా? వెంటనే చదువు" అన్నాడు. ఇదే రామిరెడ్డి ఆంధ్రాభిమానానికి దోహదమిచ్చినది. ఈ అప్పారావు గూడ మా ఇంట ఆరునెలలు విడిది చేసి ఉండినాడు. శరీర బల ప్రదర్శనం గూడ చేసేవాడు ఈ గర్వకారణాన్ని చెప్పుకొన్నందులకు సహృదయులు మన్నించగలరు.

అది మొదలు దేశాభిమాన కవిత్వం రామిరెడ్డి లేఖినినుండి బగ్గగా పుట్టినది. స్వాతంత్ర్య రథము, రాట్నంపాట ఎన్నికకు వచ్చినవి. మాతృ శతకం ప్రభుత్వంచే నిషేధింపబడి, చాలాకాలం చేతివ్రాత ప్రతులలోనే ప్రచారంలో ఉండినది.

1917లో నెల్లూరు పురమందిరాన కట్టమంచి రామలింగారెడ్డి అధ్యక్షతన జరిగిన రెడ్డి మహాజనసభలో దువ్వూరు రామిరెడ్డికి ఒక స్వర్ణపత్రం బహూకరింపబడి ప్రశంసింపబడినాడు. ఆ సందర్భంలో ఈయన రెడ్డికుల ప్రబోధం అని వ్రాసి తన జాతిని ఉత్తేజపరచినాడే గాని ఇతర కులాలపై ఈసుకక్క లేదు. రామిరెడ్డికి ఇది చేతగాని పనిలేంది

"రెడ్డిగా బుట్టినం ఋణము దీర్చుకొనంగ వీక్షించితిర కొండవీటి కోట" అని, అస్తమించిన తన జాతి మహిమను జ్ఞప్తికి దెచ్చి, "పచ్చినెత్తురుటలల్ పైరేగు రణభూమి జయనావ నడిపించు శౌర్యలక్ష్మి" అని రెడ్డివీరుల శౌర్యాన్ని రూపొందించి కనుల ఎదుట నిలిపినాడు. - జాతీయతను చాటుచూ -

— "పోయిరేగాని వారల భూతినుండి
రేగుచున్నది వెండియు రెడ్డిశక్తి

యింక నొకమారు లోకంబునెల్ల నాత్మ
దివ్య తేజంబున న్మంచి తేల్పగలదు" అని మధురస్వప్నమును
గని, శ్రోతల మేల్కొల్పినాడు.

ఈ సభాసందర్భంలో కట్టమంచివారి మాటల విరుపు నైపుణ్యాన్ని వినండి; సభా ప్రారంభానికి ముందు అధ్యక్షులైన రామలింగారెడ్డిని పెద్ద ఊరేగింపుగా సభామందిరానికి తీసుకొని పోవాలని, వెంకటగిరి నుండి పట్టపుటేనుగును రావించినారు. పెద్దలు అధ్యక్షుని గజారోహణం గావించుమని అర్థించినారు. దానికి వారు - "పెండ్లి కొడుకునూ గాను; పీనుగను గాను నాకేల ఈ ఊరేగింపు" అని నవ్వించినారు.

## డైరీలు - జాబులు

కవుల స్వైర విహారానికి చాలా దవ్వు అయిన కొన్ని కార్యాలు రామిరెడ్డి చేత అయి ఉండినవి. స్వకీయదినచర్యను వ్రాసిపెట్టి పోయినాడు. పెద్దలకు వ్రాసిన ఉత్తరాల నకలు, వచ్చిన వారి ప్రత్యుత్తరాలు భద్రపరచినాడు. ఇవి ఆయన కవితా జీవిత సామగ్రినే గాక, దేశకాల చరిత్రను తెలిపే సాధనాలైనవి. ఆయన బహుముఖ ప్రజ్ఞకు అభిరుచులకు ఇవి దర్పణాలు.

## అన్యకళా వ్యాసంగాలు

ఈ కాపుకవి మనసు విభిన్న ప్రజ్ఞా పూర్ణమని తెలిసికొని ఉన్నాము గదా! సైన్సు ఈయన ఆత్మజుడు; సాహిత్యం దత్తపుత్రుడు. పల్లెటూరిలో ఉంటూనే సైన్సు మ్యాగజీనులు తెప్పించుకొని చదివి, నెల్లూరు వచ్చినప్పుడంతా పట్నవాసులమైన మాకు విజ్ఞాన శాస్త్రోపదేశం చేస్తుండే వాడు. మదరాసులో కామత్ అనే ఆయన సంపాదకత్వమున "సండే టైమ్సు" అన్న ఆంగ్లవారపత్రిక ఈ నడుమదాక వెలువడుతుండినది. దానిని "Scissors & Paste Journalism" అనేవారు: అంటే - ఎక్కడెక్కడి విషయాలనో ఇతర పత్రికలనుండి సేకరించి జనరంజకంగా ప్రచురించేది, అనగా-అది ఒక కదంబ పుష్పమాల. ఈ కవికి అది

ఒక పారాయణ గ్రంథం వంటిది. ఇది ఈయన శాఖోపశాఖలైన అభిరుచికి బాగా నచ్చేది,

## రేడియో నిర్మాణం

మార్కోని పుణ్యాన పుట్టిన రేడియో (ఆకాశవాణి) మనదేశంలో మొదటి సారిగా బొంబాయి నగరంలో సరిగా యాభై యేండ్లకు ముందు (1926) ఒక ప్రత్యేక వ్యాపార సంస్థ మూలకంగా ప్రారంభమైనది. 1924లో మదరాసులో దీనికిగా ఒక ప్రైవేట్ క్లబ్బు ఏర్పడినది. మనకు స్వరాజ్యం వచ్చినదాక ప్రభుత్వం వీటి జోలికి పోలేదు బ్రిటిషు హయాములో గూడ కొంత కంట్రోలుండినది. మిన్ను మన్నును కలిపే రామిరెడ్డి ఊహాలత భౌతిక రూపంలో ఉండిన ఈ రేడియో పెట్టె చుట్టూ అల్లుకొన్నది. వెంటనే రామిరెడ్డి బొంబాయి నుండి వీటి విడిభాగాలు తెప్పించి, మ్యాగజీనులు చదివి స్వహస్తాలతో స్వకల్పనతో రేడియో సెట్టును అమర్చినాడు. మూడో ఫారం చదివేటప్పుడు ఫోటో క్యామెరాను నిర్మించిన రామిరెడ్డి పనితనం, అలవికాదనుకొన్న ఈ నిర్మాణాన్ని చేసినది. 1930లో ఇది మాకంతా వింతలో వింత అయిన విషయం. అప్పుడప్పుడు పెమ్మారెడ్డి పాలెంపోయి, విని వచ్చే వాళ్లము.

## జ్యోతిషముపై ప్రీతి

రామిరెడ్డి ప్రారబ్ధవాది; పుట్టిననాడె నొసటగీత నులిమితే పోదని వేమన యోగి మాట బాగా చెవికెక్కినది; కాబట్టే జాతకాలమీద నమ్మకం గట్టిగా కుదిరినది. ఒమర్ ఖయ్యాం సొగా ఇట్లా వ్రాస్తున్నాడు –

– విషము నమ్మృతంపు మసిబుడ్ల, విధి కలంబు
ముంచి లోకుల నుదుట లిఖించు మొదట;
గరగ దఱుబేద కన్నీటి కాల్వనదియు,
బరమ భక్తుని యనుతాప వహ్ని జెడదు!

- విధి నిబద్ధములై వచ్చు, వెడలిపోవు
నఖిల సుఖ దుఃఖములు నీ కయాచితముగ :

- పరమొ గిరమ్మొ దాని తలపై నొక దోసెడు మన్ను బోసి -

తమిళంలో ఉండే నాడీగ్రంథాల మీద ఈయనకు మంచి విశ్వాసం. వాటి విషయాలు నిజంగా అద్భుతాలు. పుట్టిన సమయంతో పనిలేకుండానే, కుడి చేత నున్న ఏదో ఒక రేఖను బట్టి, పాత తాటాకు పుస్తకాలు దీసి జాతకుని పేరు తల్లి తండ్రి పెండ్లాము పేర్లు, జన్మకాల గ్రహస్థితి అంతా కచ్చితంగా సరిపోయేటట్లు కౌమారనాడి ఒకటి చెపుతుంది. కందర్ నాడి సప్త ఋషివాక్యం, కాకర్ భుజంగనాడీ, గణేశ నాడి మొదలైనవి- ప్రసిద్ధాలు... మేమిద్దరం వేటాడి చాలా వాటిని పట్టినాం. ఈ కవికోకిలకు మొదట ఈ కూత నేర్పి ది, వేటూరు ప్రభాకర శాస్త్రి. మదరాసు లింగిచెట్టి వీథిలో ఒక బేరిసెట్టి ఉండేవాడు. అతని దగ్గరకు వచ్చిన లగ్నంప్రకారం ఆగంతుకుల పుట్టు పూర్వోత్తరాలు ఆశ్చర్య జనకంగా చెప్పేవాడు. అతడు చెప్పేది పుస్తకంలోనిదైనా అదంతా అతనికి గుడ్డిపాఠం, తమిళం తెనుగులో పాటగా పాడేవాడు. ఉత్తప్పుడు "మూతి తుడుచుకోమీ, రొంబానాళ్ళుగా కానమే" అనే ఆ అరవనోరు జ్యోతిషం చెప్పేపట్టున. ఏదో పూనినట్లు తెనుగు ద్విపదలో పాడేవాడు. చెప్పిన జ్యోతిషానికంటె, ఈ కవితా ప్రజ్ఞకు రామిరెడ్డి చకితుడయ్యేవాడు; కందర్‌నాడి, అడుగవచ్చిన వానితో గూడ వచ్చినవాడి లగ్నకోటులను - సాక్షులుగా చెప్పేది.

ఇంత సోదె ఎందుకంటె - సప్త ఋషివాక్యం అనే దానిలో రామిరెడ్డిని గురించి చెపుతూ - "అన్యనాటీ ఈసై పొట్టి" (అన్యదేశ సంగీత పేటిక) ని నిర్మిస్తావు" అని చెప్పివేసింది. ఇక వీటిని నమ్మమంటారో వద్దో మీరే చెప్పండి. "ఏమయ్యా చాలాకాలమైనదే నెల్లూరు వచ్చి "అంటే," "కుజ భుక్తి భూమిపనిని వదల నిస్తుందా" అనేవాడు.

జర్నలిస్టు (పాత్రికేయుడు)

ఆనాడు జస్టిస్ పార్టీ చదువుకొన్న బ్రాహ్మణేతర యువకులలో ఒక ఆత్మాభిమాన భావాన్ని రేగగొట్టినది గాని, వర్ణద్వేషాన్ని రెచ్చగొట్టలేదు. ద్రవిడ కజగం స్థాపించిన తెనుగు బిడ్డ - ఇ. వి. రామసామినాయకర్ ఈ ఉద్యమాన్ని "సుయం మరియాదై" (Self - Respector) అన్నాడు. అయినా ఈ రాజకీయ వాదులు రాజకీయ బ్రాహ్మణునే ద్వేషించినారు గాని, సాంఘిక వైదిక బ్రాహ్మణుల పట్ల భక్తినే చూపుచుండినారు ఈ పార్టీ పత్రికగా "న్యాయ దీపిక" అనే ఆంధ్ర దినపత్రికను, రావుసాహెబ్ పింజల సుబ్రహ్మణ్యం శెట్టి స్థాపించి సాగించినాడు. అందు రామిరెడ్డి సంపాదకుడుగా చేరినాడు. కొన్నాళ్ళకు ఈ పత్రిక నిలిచిపోయి, "సమదర్శిని" అనే ద్వైవార పత్రికగా రూపొందినది. దీనిలో తాపీ ధర్మారావు, ఆ తర్వాత నేనూ పని చేసినాము. అయినా మాకు ఆ రాజకీయాలు వర్ణద్వేషాలు ఒంట బట్టలేదు.

రామిరెడ్డి సేవా పూర్ణ మానసం అందు ఇముడ లేకపోయినది తొమ్మిది నెలలకే విసుగు ఎత్తినది యజమాని ఆదేశానుసారం మనసును చంపుకొని వ్రాయలేకపోయినాడు. ఇదీ గాక, వచ్చిపొయ్యే జస్టిస్ నాయకుల ఇచ్చకాలకు గుంజిళ్లు బెట్టినట్లు లేచి కూర్చుండం రెడ్డి "సుయం మర్యాద"కు పోట్లు పొడిచినది ఒంటె మెడ విరికిన కడపటి గడ్డిపోచగా ఆయనను ఇల్లు చేర్పించిన సంఘటన : -

జస్టిస్ పార్టీ నాయకుడు పానగల్లు రాజా మంత్రివర్గం మీద (రాజా పానుగంటి రామా నాయనింగారు; ఎం. ఎ.) శాసన సభలో ప్రతిపక్ష నాయకుడుగా కట్టమంచి రామలింగారెడ్డి విశ్వాస రాహిత్య తీర్మానం ప్రతిపాదించినాడు. ఇది ఓడింప బడినా మన పార్లమెంటరీ విధానంలో ఒక నూతనాధ్యాయాన్ని సృష్టించినది. రామలింగారెడ్డి వాగ్వైభవశోభితమైన ఆ మహోపన్యాసం ప్రపంచ ఓరేషన్సులో(orations) ఒకటిగా చేర్చబడినది. ఆ ఉపన్యాసాన్ని, ఆ చర్చను

రామిరెడ్డి జస్టిస్ పార్టీ - న్యాయదీపిక పత్రికలో ప్రాముఖ్యంగా ప్రచురించినాడు. జస్టిస్ నాయకులకు కన్నుగుట్టినది. మాట సాగించుకొంటుండిన వక్తలు - అనుడ అన్నదమ్ములు - ఆర్కాటు రామస్వామి మొదలియారు, లక్ష్మణస్వామి మొదలియారు దీనిని సహించలేకపోయినారు. ఇదంతా పసిగట్టి రామిరెడ్డి కవిహృదయం కండ్లు తెరచినది. వెంటనే పని వదలుకొని- కూటికి గడ్డకు కొదువ లేనందున, నేరుగా ఇల్లు చేరినాడు.

ఈ చర్యలో విశ్వవిఖ్యాతమైన కట్టమంచివారి ఒక ఛలోక్తిని ప్రస్తావించడం అప్రస్తుతం కాదనుకొంటా : -

రెడ్డి నిందారోపణ ఉపన్యాసానికి ప్రత్యుత్తరంగా రాజా ప్రారంభిస్తూ, ఇంగ్లండు మహామంత్రి - డిస్రాయెల్ వాక్యం "For every appointment I made, I made one doubtful friend and ninety-nine enemies" అన్న దానితో ప్రారంభిస్తూ, జేబులో చేయి బెట్టినాడు. ఇంతకుముందు, రామలింగారెడ్డి ఒకనికి ఒక ఉద్యోగ మివ్వమని ఒకజాబు రాజాసాహెబుకు వ్రాసిఉండినాడు. దానినే రాజా బయటకు తీయబోతున్నాడని రెడ్డి ఊహించుకొని, చెట్టున లేచి "In England when Lovers quarrel, they return their letters" అన్నాడు. ఆ సమయస్ఫూర్తికి సభ్యులు ఆనందించినారు. ఉచిత మెరిగిన పానగల్లు ఆ జాబును జేబులో అట్లనే అదిమి వేసుకొన్నాడు. ఇది రాజకీయ వాఙ్మయంలో నిలిచిపోయిన మహావాక్యం. ఇట్టిదీ ఆనాటి రాజకీయ రసికత - సరసత!

## చిత్రలేఖనం

కవితా కన్యకతో బాటు చిత్రలేఖన సుందరిగూడ రామిరెడ్డిని మోహించినది. అయినా సంగీతానికి మాత్రం ఈయన చెవి గొంతుగూడ దూరమైనవి. "నేను రాగమూరజ్ఞి" అని చెప్పుతుండేవాడు. ఈయన వాటర్ కలర్సులో, ఛాక్‌లో కొన్ని చిత్రాలు సృష్టించినాడు. ఈయన ఛాక్‌లో చిత్రించిన రవీంద్రనాథ ఠాకూరు రూపపటం ఇప్పటికీ నెల్లూరు తిక్కన గ్రంథాలయ సభను ఈయన బహుముఖ ప్రజ్ఞకు స్మారకంగా అలంకరించి ఉన్నది. - కాని కవితా

వఘాటి మత్సరానికి తట్టుకోలేక చిత్రలేఖనం విడాకులు తీసుకోకుండానే ఈ ఇల్లు వదలి పోయినది. ఇది మూడునాళ్ళ ముచ్చటే!

## చలనచిత్ర దర్శకత్వం

నెల్లూరు మిత్రులు కొందరు, 1936లో శ్రీ రామా ఫిలిమ్సు అనే సంస్థను నెలకొల్పి సతీ తులసి అనే చిత్రాన్ని నిర్మించను, మదరాసులో పూనుకొన్నారు. దీనికి నేనూ ఘంటసాల బలరామయ్య కార్యకర్తలము. ఆనాటి పెద్ద నటకులు-వేమూరు గగ్గయ్య, మాధవపెద్ది వెంకట రామయ్య, శ్రీరంజని తారలు. దువ్వూరు వారు చిత్రానికి మాటలు పాటలు వ్రాయను వచ్చినారు. ఈయన వ్రాతలలో గీతాలలో ఫిలిం సాహిత్యంలో మొట్టమొదటి తడవగా ఆనాడు కవితాగుణం దీపించినది!

ఈ కంపనీవారే కలకత్తాలో తీసిన చిత్రనళీయానికి రామిరెడ్డి దర్శకుడు (డైరెక్టర్) కథకుడు (స్క్రిప్టు రైటర్) కవి అయినాడు. కాని, పొయిట్టు పొయిట్లుగా ఆవేశం ఎక్కే కవికి. మిషన్‌మాదిరి పనిచేయవలసి వచ్చిన ఫిలిం నిర్మాణం గిట్టలేదు ఆలస్యమై నిర్మాతలకు చీకాకు గలిగించి, ఈ డైరక్టరు మధ్య, ప్రొడ్యూసర్లమధ్య అసంతృప్తిని కలిగించినది. చివరకు ఆ ఫిలింగూడ రక్తిగట్టక ప్రేక్షకులకు నచ్చలేదు- అంటే ఈ చిత్రం ఈ వ్యాపార పరిభాషలో flop అయినది. రామిరెడ్డి జీవితంలో జరిగిన విఫల ప్రయత్నం ఇది ఒక్కటే అనవచ్చు

దీని తర్వాత, రామిరెడ్డి మరి రెండు ఫిలిములకు పద్యాలు వ్రాసి పెట్టినాడు.

## కవికోకిల - బిరుదప్రదానం

దువ్వూరు రామిరెడ్డి ఆంధ్రావళి మోదము పొందినాడు. వారికి ప్రీతి పాత్రుడైనాడు! వనకుమారి బహూకృతి, నెల్లూరు సభలో స్వర్ణపతక ప్రదానం జరిగి, కవిగా ఈయన గుర్తింపబడినాడు. పేరు నలుమూలలా ప్రాకినది.

18-11-1927 లో బెజవాడలో (ఇంకా విజయవాడ కాలేదు) జరిగిన ఆంధ్ర మహా జనసభలో దువ్వూరు రామిరెడ్డికి "కవికోకిల" బిరుదం ఇచ్చి, అఖిలాంధ్ర జనామోదంగా గౌరవించినారు. ఆ సభకు-బారిస్టర్ కడప కోటిరెడ్డి అధ్యక్షుడు. ఆవల జాషువాకు గూడ ఇదే బిరుదం ఒసంగబడి ది. ఈ కోయిలజంట తెనుగు ఆమని తోటను మనోహరగానంతో ముఖరితం చేస్తూనే ఉన్నది. ఈ బిరుదం ఇచ్చేనాటికి రామిరెడ్డికి 32వ ఏడు

## నెల్లూరుకు యుగాంతరం

ప్రాచీన సంప్రదాయానికి మహా మేరువు ఆ వేదం వెంకరాయశాస్త్రి దివికేగినారు. ఆ యుగపురుషుడు అస్తమించగానే నవయుగ వైతాళికుడుగా మా మండలంలో దువ్వూరు కవికోకిల అయినాడు.

## కలుపుగోలుతనం లేనివాడు

రామిరెడ్డి, చొరవగా నెట్టుకొని ముందుకు దూరి, కలుపుగోలుతనంతో మనుషులను కలియవేసుకొనే స్వభావం లేనివాడు ఇది జంకూ గాను బిడియమూ కాదు. తన పద్యాలను రసవంతంగా చదివి ఆకట్టుకోలేక పోవడంకూడ దీనికి ఒక కారణమై ఉండవచ్చు. ఈయన మానసిక తత్త్వమదీ. స్నేహితులూ తక్కువ. దేశం తిరిగి సభలలో తన సన్నాయి తాను ఊదుకోలేకపోయినాడు ఇది ఆయన అలివికి దప్పిన పనిగూడా. ఇతర గాయకకవులు మత్సరమో స్థానిక - కులాభిమానమో గాని ఈయన పద్యాలను సభలలో చదివి వినిపించి శ్రోతలకు పరిచయం చేసేవారుగారు ఈ అన్యోన్య ప్రశంసాభావం సాహితీసమితి సభ్యులలో బాగా ఉండేది.

అయితే ఏమి? గుణగ్రహణ పారీణులు ఈయన కావ్యాలను వ్యాసాలను చదివి రాయప్రోలు వారి యుగకవులలో చేర్చి, సుస్థిర కీర్తి పీఠాన ఈయను కీర్తిమూర్తిని ప్రతిష్ఠించి ఉన్నారు.

## కొన్ని వివాదాలు

ఈయన ఎవరితోనూ వివాదపడడుగాని తనను చెనకితే సాదురేగినట్లు రేగేవాడు. సాదు పలవతనం – Silent Mischief– ఆయనలో అణగిఉండి, దెబ్బ తింటేమాత్రం బుసకొట్టేది. విశ్వనాథ సత్యనారాయణ, ఒక మదరాసు ఆకాశవాణి ప్రసంగంలో తన రెండు కవికోకిలలను (జాషువా అప్పుడు ఆ కార్యాలయంలోనే పనిచేస్తుండినాడు కూడా) ఆయనకు సహజమైన పెళుసు పెంకెఘోరణితో ఎత్తిపొడిచినాడు దీనికి ప్రత్యుత్తరమో అన్నట్లు – "విశ్వనాథుంవాడి విద్వత్కవిత్వంబు కంపడొంకలు ద్రొక్కి కదము ద్రొక్కె" అని వ్రాసి రెడ్డి గాలికి వదలినాడు. చాలామంది విన్నారు.

నెల్లూరులో నా ప్రభాత ముద్రణాలయంలో అచ్చగుచుండిన "స్ట్రీక్రేటేటర్" అనే ఆంధ్రాంగ్ల పక్షపత్రికలో (పి. ఎస్. ఆర్. ఆంజనేయులు సంపాదకుడు) రామిరెడ్డి కుంభరాణాపై విమర్శలు–ప్రతివిమర్శలు బయలుదేరినవి. వేదం వెంకట రాయశాస్త్రి శిష్యులు, దుర్భా సుబ్రహ్మణ్యశర్మ శిష్యులు ఎదురెదురు ఉద్దీలైనారు శాస్త్రి శిష్యులలో మేటి– నేలటూరు రామదాస అయ్యంగారు రసలబ్ధ నామంతో దండు మొనలో నిలిచినాడు. మోచెర్ల రామకృష్ణయ్య, దీపాల పిచ్చయ్యశాస్త్రి శర్మపక్షీయులు దీంట్లో సారస్యమేమిటంటే– శాస్త్రి శర్మ పరస్పరం గౌరవించుకొంటూ బాగుండేవారు. ఇక వచ్చిన రగడరచ్చ ఉభయ శిష్యవర్గంలోనే. నూనె–పువ్వులు ఒకటై నూనెగపుళ్లు వేరైనట్లు. ఈ వాదోపవాదాలలో ఎన్నో అమూల్య సాహిత్య విషయాలు బయటపడినవి. శాస్త్రిని పొగుడుచు మంచి పద్యాలు వ్రాసినా ఈ వివాదంలో రామిరెడ్డిని శర్మపక్షం నెట్టినారు. కుంభరాణాకు మారుదెబ్బగా ఓరుగంటి వెంకటకృష్ణయ్య వ్రాసిన "నందనారు" నాటకంమీద విరుసుకొని పడినారు కళాప్రియుడనే పేరుతో రామిరెడ్డి "సుబోధిని" పత్రికలో మంచి ఖండనవ్యాసం వ్రాసినాడు.

శాస్త్రి ముఖ్యశిష్యుడు – గునుపాటి యానాది రెడ్డి, శర్మ "అభినవ తిక్కన" బిరుదాన్ని చులకనచేస్తూ "అభినయ తిక్కనోయ్" అని నాచెవిలో

వేసి పొయ్యేవాడు. నేను ఉభయ పక్షాలమధ్య దొర్లుడు పుచ్చకాయను. డాక్టర్ కట్టమంచి వారన్నట్లు- మన పండితుల వివాదాలలో పరుషములేగాని సరళములు ఉండవుగదా ?

ఆచార్య గుర్రం సుబ్బరామయ్య వ్రాసిన తెనుగు మేఘదూతను రసలుబ్ధుడు (నే. రామదాస అయ్యంగారు) సవరించినాడు. నందనారును ధరణికోట వెంకటసుబ్బయ్య, క్రైపా సుబ్రహ్మణ్యశర్మ, ఈ రామదాస అయ్యంగారు సరిచూచి అచ్చు వేయించినారు. ఈ కవులిద్దరూ శాస్త్రీయులు. ఈ విమర్శక నాటక కోలాహలానికి భరత వాక్యంగా ఈ కవికోకిల -

- రసలుబ్ధు డొకడు దిద్దిన
గు.సు. రామయ్య మేఘదూత కుంటుచు నడచెన్
వసనాభివంటి ముగ్గురు
రసికుల చేజిక్కి మాల్రబతుకంగలదే -

అని వ్రాసి తన పేరు చెప్పకుండా ప్రచారం చేసినాడు. ఈ వివాదాలన్ని గమ్మత్తుగానే ఆసక్తిని గలిగిస్తుండినవి.

నిధి - పండిత సన్మానాలు

రామిరెడ్డి తన పుస్తకాల అమ్మకంవల్ల వచ్చిన డబ్బునంతా బ్యాంకులో కట్టుతూ, 10వేల రూపాయల నిధిని ఒకదానిని ఏర్పాటు చేసినాడు. ఈనిధి ఒక పాలక సంఘానికి అప్పగించబడినది. ఈ మొత్తంమీద వచ్చేవడ్డితో ఏటేటా ఒక సైన్‌టిస్టుకి రూ. 500 వంతున బహుమతిస ఇస్తుండాలని కట్టడి చేసినారు. 1951 మొదలు 1964 వరకు 12 మంది శాస్త్రవేత్తలకు సన్మానాలు జరిగినవి. ఇదీ రామిరెడ్డి సైన్సు పక్షపాతం. ఎందుకో ఇప్పుడు సన్మానాలు నిలిచి పోయి ఉన్నవి. ట్రస్టు బోర్డువారు, అయన కొమారులు దీనిని మరల ఉద్ధరింతురు గాక !

ఆశావాది

రామయ్య లోకమంతా చెడిపోతున్నదనే ఆందోళనవాది కాదు- మానవుని మంచి మీద విశ్వాసమున్న ఆశావాది. ఓపిక అవసరమంటాడు ;-

- కోరికలన్నియుం గుడ పు గూరవు. సౌఖ్యము దుఃఖమెప్పుడుం
  గూరు రసంబు జేపటుల గూడియె యుండు...

అని వేదాంత ధోరణిలోబడి, ప్రయత్నం విఫలమైనదని నిరాశ పడవల చని ఉత్సాహ మెక్కిస్తున్నాడు. మత్సరాలుమాని మానవతను ప్రకటిస్తారని ఈయన ఆశ :-

- ఓరి బాలక నీ మురళీ రవంబు
  వ్యర్థమౌనని చిత్తతాపంబు వలదు,
  రాగపరిచితు డెవ్వడో రమ్యగీతి
  వినియెయుండు ఆనందబు వెల్లివిరియ -

ఇదీ ఈయన తత్త్వం:

———

# మల్లంపల్లి సోమశేఖరశర్మ

- డా. ముక్కామల రాధాకృష్ణ శర్మ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షులు డా. బెజవాడ గోపాల రెడ్డి గారికి నేటి ముఖ్య అతిథి మంత్రివర్యులు మండలి వెంకట కృష్ణారావు గారికి, అకాడమీ కార్యదర్శి దేవులపల్లి రామానుజరావుగారికి, బోయి భీమన్నగారికి తదితర కార్యకర్తలకు, మరుపూడి కోదండ రామరెడ్డిగారికి సమావేశానికి వచ్చిన పెద్దలకు, పురప్రముఖులకు, యువతరానికి నమస్కారాలు; ఈ అవకాశాన్ని, గౌరవాన్ని ఇచ్చినందుకు కృతజ్ఞతలు.

## ఒక చరిత్రవిద్యార్థి - శర్మగారు

నేను పెరిగింది, చదివింది మద్రాసులో. నా చదువు పూర్తియై చీరాల కళాశాలలో చరిత్రోపన్యాసకునిగా చేరటానికి మద్రాసును విడిచినది ఆంధ్ర రాష్ట్రావతరణ సంవత్సరం: 1953. ఈనాడు వెనుతిరిగి చూసుకుంటే మద్రాసు వాతావరణ ప్రభావం అనేక విధాల తృప్తినిస్తుంది. కాని -

పాఠశాలలో ఆనాడు తెలుగువారి చరిత్రను గురించి చదివింది, తెలుగు భాషావాచకంలో పాఠ్యభాగంగా 'విజయనగర సామ్రాజ్యం' మీద మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వ్రాసిన గంభీరమైన వ్యాసం మాత్రమే. అప్పటికి మాకు తెలుగువారి చరిత్రగాని, సోమశేఖర శర్మగారుకాని తెలియదు. Intermediate లో బ్రిటిష్ హిస్టరీకి G. M. Trevelyan's History of England చదువుతున్నప్పుడు మాత్రం శైలి, రచనాచాతుర్య దృష్ట్యాకాబోలు శర్మగారివ్యాసం స్ఫురిస్తుండేది. చిలుకూరి వీరభద్రరావు, వేటూరి ప్రభాకరశాస్త్రి, నేలటూరి వేంకటరమణయ్య, సోమశేఖర శర్మగారి తెలుగు చరిత్ర రచనలను, పరిశోధన

లను గురించి వినకుండా చరిత్రలో M A Degree వచ్చే రోజులవి. పరీక్షల దృష్ట్యా సాతవాహనులు, కాకతీయులు, తెలుగు చరిత్ర- సంస్కృతి ముఖ్యమైన పాఠ్యభాగాలు కావు. Oratory కి ప్రాధాన్యంకలరోజుల్లో చరిత్రకారుల ఉప న్యాసాలు ఏర్పాటైన బహిరంగ సభలు అరుదు.

ఆనాడు తెలుగు చరిత్ర తెలియక పోయినా, తెలుగు పట్టణంలో పెరిగాం. ప్రకాశం పంతులుగారిలో తెలుగు సాహసం, పొట్టి శ్రీరాములు గారిలో తెలుగు త్యాగం, తెన్నేటిగారిలో తెలుగు తేటదనం, గోపాలరెడ్డి గారిలో తెలుగు కవి, విశ్వనాథ సత్యనారాయణ గారిలో తెలుగు ప్రతిభ, దర్పం; దేవులపల్లి కృష్ణ శాస్త్రి గారిలో తెలుగు సౌకుమార్యం- వీటన్నిటి కలయిక అనిపించే ద్వారం వేంకటస్వామి నాయుడుగారి రఘువంశ, అప్పరా తనా మనా, జో అచ్యుతానంద సంగీతసుధ అనుభవించిన రోజులు. పొట్టి శ్రీరాములుగారి నిరాహారదీక్ష - నాటి తెల్లవారు ఝామున వాలంటీర్లు 'శ్రీరాములు ఇకలేడు' అంటూ నిద్రపోతున్న మమ్మల్ని మద్రాసు జార్జిటౌన్‌లో లేపటం - అమరజీవి పొట్టి శ్రీరాముల భౌతిక కాయం, నిశ్చేష్టులైన ప్రకాశం పంతులు, బులుసు సాంబమూర్తి, ఆచార్యరంగా; ఘంటసాల విషాద ఉత్తేజ గానంతో ఊరేగింపు ఆనాడు అర్థంకాకపోయినా హృదయంమీద చెరగని ముద్రవేసిన భావాలు, చిత్రరువులు ఇవి.

'తెనాలి రామకృష్ణుడు అల్పకవి - ఎందుకంటే నేడు అల్పకవులంతా మహాకవులని పిల్చుకుంటున్నారు - అందుకే అల్పకవి, మహాకవి పదాల అర్థాలే మారిపోయినవి' అని తెనాలి రామకృష్ణునిపై పుట్టపర్తి నారాయణా చార్యులవారు కడప కాలేజిలో 1954-55 ప్రాంతంలో ప్రారంభించిన గొప్ప ఉపన్యాసం, శ్రీపాద గోపాల కృష్ణ మూర్తిగారు అ కళాశాలలోనే 'సంగీతము-సాహిత్యము' అనే విషయంమీద చేసిన ఉత్తేజకరమైన ప్రసంగంవంటివి- బ్రిటన్, అమెరికా, యూరప్, గ్రీస్. రోమ్ దేశచరిత్రలు, సాహిత్యం ఆంగ్లభాషద్వారా అధ్యయనం చేసి అ భాషకు కల భావప్రకటనాశక్తితో పరిచయమున్న నాకు (అంటే ఒక తరంలో కనీసం ఒక వర్గప్రతినిధిగా నన్ను నేను పరిగణించుకొంటున్నాను), ఈ

శక్తి విషయంలో తెనుగుభాష ఏమాత్రం తీసిపోదు అని కనువిప్పు అయింది. లేత మనస్సులను ఆకర్షించి, వాటిపై చిరకాలం వుండే ముద్రలు వేయగల అవకాశం కల ఉపాధ్యాయ వృత్తిలోనున్న నాకు వృత్తిలో చేరిన మరు సంవత్సరమే ఇట్లాంటి, అతిముఖ్యమైన కనువిప్పు కలగటం నా అదృష్టంగా భావిస్తున్నాను. నేను 1957 లో Ph. D. చేయటానికి ఉస్మానియా విశ్వవిద్యాలయానికి వచ్చిన తరువాత, మారేమండ రామారావుగారు, పుట్టపర్తి శ్రీనివాసాచార్యులుగారు, నేలటూరి వెంకట రమణయ్యగారు, తెలుగు చరిత్ర - సంస్కృతి పరిశోధనలతో సన్నిహిత సంబంధం ఏర్పడింది.

సంపూర్ణమైన 'ఆంధ్రతా ముద్ర' కల నిండైన, గంభీరమైన విగ్రహం - శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారిని నేను మొదటిసారిగా చూసింది, విన్నది "విజ్ఞాన సర్వస్వం - తెలుగు సంస్కృతి" ని గురించి హైదరాబాదు ఆంధ్ర యువతీమండలి ఆవరణలో జరిగిన సభలో. 1962 లో ప్రయాణం చేస్తూ కాజీపేట స్టేషన్‌లో నన్ను నేను వారికి పరిచయం చేసుకున్నప్పుడు మల్లంపల్లివారు వెంటనే కౌగలించుకొని అన్నారు: నేలటూరి వేంకట రమణయ్యగారు సాధారణంగా ఎవ్వరినీ మెచ్చుకోడు. నిన్నుగురించి మంచి అభిప్రాయం చెప్పాడు. తెలంగాణా దేవాలయాలను గురించి మంచి కృషి చేస్తున్నాడు అంటే, వయసు ముదిరిన వాడేమో అనుకున్నాను. నీవుటోయ్!". అన్నారు. 'నేనెరిగిన శర్మగారు' వ్యాసంలో డా. నేలటూరి వేంకట రమణయ్యగారు 'ఆయన అమితోత్సాహమునకు తార్కాణము కౌగలింపు' అన్నారు. అంటే శర్మగారు నన్ను కౌగలించుకోవటానికి అర్థం తెలుగు చరిత్ర-సంస్కృతిని గురించి యువకుడు ఒక కృషి ప్రారంభించాడు అని ఆనందిస్తూ, అతనికి ప్రోత్సాహం ఇవ్వటం అన్నమాట.

1975 లో ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ఏర్పాటైన 'తరతరాల తెలుగుజాతి' ప్రదర్శనం అశేషజనాన్ని ఆకర్షించింది, తెలుగు చరిత్ర - సంస్కృతిపట్ల అనురాగాన్ని పెంపొందించింది. ఈ ప్రదర్శనం ఏర్పాటుకు కారకులైన మన విద్యామంత్రి మండలి వేంకట కృష్ణారావుగారికి, ముఖ్యమంత్రి శ్రీ

వెంగళరావుగారికి ఈ కార్యక్రమానికి అనేక విధాల తోడ్పడి ప్రోత్సహించిన మంత్రి శ్రీ కృష్ణమూర్తి నాయుడిగారికి,దేవులపల్లి రామానుజరావుగారికి ఈ దేశము నుంచి, విదేశాలనుంచి పండితులు, సామాన్యులు కృతజ్ఞతతో మన్ననలను అందజేసారు. మల్లంపల్లి సోమశేఖర శర్మగారు కనక బ్రతికుండివుంటే తెలుగుతల్లిని సర్వాలంకరణ రూపంతో చూసి ఎంత ఆనందించేవారో! శర్మగారి తెలుగు చరిత్రను గురించిన పరిశోధనలు, వారు తయారు చేసిన "తెలుగు సంస్కృతి" గ్రంథము లేకుంటే నాలుగు నెలలలో తెలుగుతల్లికి ఇంత అలంకరణ చేయటం సాధ్యమయ్యేదా?

## శర్మగారి జీవితము - చరిత్రసేవ

మల్లంపల్లి సోమశేఖర శర్మగారు 1891వ సంవత్సరం డిసెంబరు 24 నాడు పశ్చిమ గోదావరి జిల్లా మినుమించిలిపాడు అగ్రహారంలో మధ్యతరగతి, సాంప్రదాయ ఆరాధ్య బ్రాహ్మణ కుటుంబానికి చెందిన భద్రయ్య నాగమ్మగార్లకు జన్మించారు. మేనమామ అయ్యగారి ఉమామహేశ్వర రావుగారితో నుండి రాజమండ్రిలో విద్యాభ్యాసం చేశారు. పరపాలనపీడను గుర్తించి ప్రజల మనసులు స్వాతంత్ర్యేచ్ఛవైపు మళ్ళుతున్న రోజులు అప్పుడు రాజమండ్రిలో. ఆ వాతావరణంలో చదివిన శర్మగారు మెట్రిక్ పరీక్షలో ఉత్తీర్ణుడై, పై చదువు కొనసాగించే ఆర్థిక స్థోమత లేక, స్వగ్రామానికి తిరిగివచ్చి అక్కడ ఉండలేక, మెట్రిక్యులేషన్ సర్టిఫికేట్‌ను చించి పారవేసి తిరిగి రాజమండ్రిని చేరుకొన్నారు. మేనమామ కూతురు, ఉత్తమురాలైన సుబ్బాయమ్మను వివాహమాడినారు. మొదట్లో బంధువులైన చాగంటి సుబ్రహ్మణ్యంగారితో వుండి, "దేశమాత" పత్రిక సంపాదకశాఖలో చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు నెలకు 12 రూపాయల ఉద్యోగం ఈయగానే రాజమండ్రిలో వేరుకాపరం పెట్టారు. "దేశమాత" పత్రికకు కథలు, సాహిత్యవ్యాసాలు, నాటికలు వ్రాయటంవల్ల శర్మగారికి నాటి సాహిత్యవేత్తలతోను. చరిత్ర పరిశోధకులతోను పరిచయం జరిగింది శర్మగారు. చరిత్రకారులు చిలుకూరు వీరభద్రరావుగారిని కలవడం, వారికై మద్రాసు

కన్నెమరా గ్రంథాలయంలోని వ్రాత ప్రతులను కాపీచేయటం జరిగింది. 1911లో ఈ విధంగా మల్లంపల్లివారు చరిత్ర రచనా రంగంలో ప్రవేశించారు.

సోమశేఖర శర్మగారు జాతీయోద్యమ ప్రభావంలో తెనుగుదనం పునర్వికాసం పొందుతున్నప్పటి యువతరంవారు. ఇదే ఆయన భావాలకు, రచనలకు పునాది. తెనుగు భాష, తెనుగు సాహిత్యంపట్ల అభిమానం, వాటిలో తుణ్ణమైన ఔన్నత్యం, ప్రవేశం, తెలుగుజాతి పటిమలో విశ్వాసం తెలుగు చరిత్రలో నమ్మకం ఆయన విద్వత్‌కు పునాది రాళ్ళయినాయి. అందుకే ఆయన చరిత్రభావాలు, రచనలు, పాలకుల పట్టీలు, కాలనిర్ణయ సమస్యల ఇరుకులకు పరిమితం కాలేదు. చరిత్ర పరిశోధనా ప్రమాణాల స్థాయి పడిపోకుండా ప్రజాజీవనాన్ని ప్రతిబింబించే సాంఘిక చరిత్ర వ్రాయాలి అని నేడు మనము ఇంకా ఆలోచిస్తున్న లక్ష్యాన్ని సోమశేఖర శర్మగారు ఏనాడో సాధించారు. భావితరాల చరిత్రకారులకై బాటలు వేసారు. 'దేశమాత' పత్రికా సంపాదకులుగా నుంటూ 'పాదుకా పట్టాభిషేకం నాటకం'; 'రోహిణీ చంద్రగుప్త', 'అరణ్యరోదనం', 'వివేకముగల మంత్రి' అనే నవలలు, ప్రాకృత, సంస్కృత గాథలకు తెలుగు అనువాదాలు: 'ఆంధ్రవీరులు', 'ప్రాచీన విద్యాపీఠాలు', 'ప్రాచీన ఆంధ్ర నౌకా జీవనమువంటి ఉన్నతస్థాయి చారిత్రక వ్యాసాలు వ్రాసారు. శర్మగారు చేసే రచనలు ప్రామాణికాలు అన్న అరుదైన, అతి ముఖ్యమైన పేరు సంపాదించారు. తెలుగు చరిత్రలో ఆసక్తిని కల్పించటానికి 'ఆంధ్రాభ్యుదయ గ్రంథమాల"ను స్థాపించారు.

దేశ కాల పాత్ర మత భాషాది ఆవరణలలో సంవర్ధితాలైన వివిధ విజ్ఞానాలను ఆంధ్ర విజ్ఞానామృత మథనానికి సమర్పణ చేయటం విజ్ఞాన సర్వస్వాలకు పరమార్థం. విజ్ఞాన సర్వస్వానికి ప్రయోజనం ఆంధ్రులకు అనుభవ సిద్ధమైన సంస్కార రూపంలో విశ్వవిజ్ఞానానుభవాన్ని సులభం చేయటం. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వ ప్రకటనకు మొదట పూనుకొన్నది శ్రీ కొమర్రాజు వెంకట లక్ష్మణరావు గారు. ఈ కృషిలో వారికి తోడ్పడుతూ విజ్ఞానానుభవాలు సంపాదించటానికి సోమ

శేఖర శర్మగారు తమ నివాసస్థానాన్ని మద్రాసుకు మార్చుకొన్నారు. దుర దృష్టవశాత్తు 1923లో లక్ష్మణరావుగారు నిర్యాణం చెందటంతో విజ్ఞానసర్వస్వం పని ఆగిపోయింది. దేశోద్ధారకులును, విశ్వదాతలునైన శ్రీ కాశీనాథుని నాగేశ్వర రావుగారు లక్ష్మణ రావుగారి కృషిని పునరుద్ధరించి, సోమశేఖరశర్మగారి సహా యముతో కొనసాగించడానికి యత్నించారు. కాని 1938లో నాగేశ్వరరావుగారి నిర్యాణంతో ఈ మహత్తరకార్యం అకారాది పదాంతంలో ఆగిపోయింది తరువాత తెలుగు విజ్ఞాన సర్వస్వ ప్రకటనకు పూనుకొన్నది తెలుగు భాషాసమితి వారు, డా. బెజవాడ గోపాలరెడ్డిగారు, పద్మశ్రీ మోటూరి సత్యనారాయణ గారు 'ఆంధ్ర' సంపుట కార్యనిర్వహణను మల్లంపల్లివారికి అప్పజెప్పినారు. బెజవాడ గోపాల రెడ్డిగారు "తెలుగు సంస్కృతి" సంపుటానికి 1959లో తాము వ్రాసిన విజ్ఞప్తిలో ఇలా అన్నారు: "తెలుగు భాషకు, వాఙ్మయమునకు, తెలుగువారి చరిత్రకు, సంస్కృతికి సంబంధించిన ప్రత్యేక సంపుటము నొకదానిని ప్రచురించుట సమితి ఉద్దేశము. దాని ప్రకారము కొమర్రాజు వెంకట లక్ష్మణరావు పంతులుగారికి కుడిభుజముగను, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి సర్వాంగీణముగను విజ్ఞానసర్వస్వ నిర్వహణ భారమును వహించి చక్కని అనుభవమును, నిరతిశయ సామర్థ్యమును సముపార్జించిన ఆంధ్రదేశ చరిత్ర పరిశోధక విపులు. అద్వి తీయాంధ్రాభిమానులునైన శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ఈ తెలుగు సంస్కృతి సంపుటము యొక్క ప్రకటన కార్యమును నిర్వహించుటకై సంగ్రా హకులుగా 1950లో నియమింపబడిరి." "తెలుగు సంస్కృతి" గ్రంథము విషయములోను, సాంకేతిక విలువలలోను, అలంకరణలోను తెలుగుదేశంలో వెలువడిన గ్రంథాలలో నేటికినీ అద్వితీయ స్థానాన్ని అలంకరిస్తోంది. ఆ గ్రంథా నికి వ్రాసిన "కృతజ్ఞత"లో శర్మగారు ఇలా అన్నారు."ప్రముఖ రాష్ట్రేతరాంధ్ర కుటుంబములను గురించియు, సముద్రాంతరస్థ ద్వీపములకు, ఖండాంతర దేశము లకు వలస వెళ్ళిన తెలుగువారిని గురించియు ఈ సంపుటమున ప్రకటించు నుద్దేశ ముతో తెలిసినవారు విషయమును సేకరించి పంపవలసినదిగ కోరుచు ఉత్తర దక్షిణ భారతదేశ దైనిక పత్రికలలో లేఖలు ప్రకటింపబడినవి ఇతర ఖండాంతర దేశ

ముల, ద్వీపములలోని భారతీయ సంఘములతో ఉత్తర ప్రత్యుత్తరములు జరు
బడినవి; కాని చేసిన ప్రయత్నమునకు ప్రయోజనము కలుగలేదు" అని వ్రాసారు
1975లో మండలి వెంకటకృష్ణారావుగారు "ప్రపంచ తెలుగు మహాసభల కార
క్రమాన్ని ప్రారంభించటంతో "తెలుగు సంస్కృతి" సంపుటంలో శర్మగారి
వ్యక్తపరచిన లోటు తీరుట ప్రారంభమైంది. అందుకే మొదట్లో అన్నాను, ప్రపంచ
తెలుగు మహాసభలప్పుడు మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ఉండివుంటే ఎంతటి
మహదానందాన్ని పొందివుండేవారో అని.

1938లో కాశీనాథుని నాగేశ్వరరావుగారు నిర్యాణం పొందిన తరువా
సోమశేఖర శర్మగారు "భారతి" పత్రిక సంపాదక వర్గంలో చేరారు భావరాజు
వేంకట కృష్ణారావుగారు శర్మగారిని త్రివేణి పత్రిక రామకోటేశ్వర రావుగారి
పరిచయం చేయటం, "త్రివేణి" ప్రారంభోత్సవంనాడు విశ్వనాథ సత్యనారాయణ
గారు "ఆంధ్ర ప్రశస్తి"ని శర్మగారికి అంకితం చేయటం జరిగినవి.

పిస్సా అప్పారావుగారు చెప్పటంతో డా సి. ఆర్. రెడ్డిగారు సోమశేఖర
శర్మగారిని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో చేరటానికి ఆహ్వానించారు. 1940నుండి
1956వరకు శర్మగారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో నున్నారు. కాకతీయ
సామ్రాజ్యం పతనమైన తరువాత ముసునూరి నాయకులు మధ్యయుగమున తెలుగు
దేశంలో సాగించిన స్వాతంత్ర్య సమరం గురించిన 'A Forgotten chapter of
Andhra History' అనే గ్రంథాన్ని 1945లో ప్రచురించారు. ఈ గ్రంథం
తొలిపలుకులో గుత్తి వెంకటరావు గారు ఇలా వ్రాసారు:

...... the resolute action of a band of Andhra patriots in the third decade of the fourteenth century. When the Turkish sultans of Delhi had overthrown practically all the Hindu kingdoms of South India and the country was groaning under the alien rule, these patriots rose in revolt, and in the face of overwhelming odds succeeded in winning the freedom of their land. Their

of the founders of the Empire of Vijayanagara the Turkish domination in the South was completely eliminated. The details of this epic struggle, its genesis and nature,remained for long shrouded in mystery.Due to the paucity of materials and erroneous statements of Barani and Ferishta, the very identity of the original leaders of this war of liberation remained unknown, and, until Mr.M.S.Sarma disproved the story, it was wrongly accepted on all hands that this movement was headed by Kanya Nayak or Krisna Nayak, a son of Kakatiya Prataparudra".

1975లో వెంకటరామయ్యగారు వ్రాసిన మాటలు అక్షరాల నిజమైనాయి. Mr. Sarma's scholarly work will be a powerful stimulant to the Andhras of the present generation and will prove of permanent value to all historians of India"

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో నున్నప్పుడు తాము చేసిన కృషివి. క్రీ.శ. 1385 నుంచి క్రీ.శ. 1448 దాకా తెలుగుదేశ చరిత్రను, 'History of Reddi Kingdoms' అను గ్రంథంగా 1948లో ప్రచురించినారు. శర్మగారే అన్నట్లు "...it embodies the history of a very momentous period in the annals of the Andhra country,a period of transition from the early medieval to the late medieval period which held the moorings of the modern age. It was the period in which the country, after re- establishment of Hindu supremacy subsequent to the national up-rising, rehabilitated itself and its life in accordance with the changed conditions and with the new forces released".

దేశ సాంఘిక చరిత్రను ఆధునికంగా నూతనంగా వ్రాయాలి అని అమితోత్సాహంతో నినాదాలు చేసే యువ చరిత్రకారులకు నిష్పాక్షిక దృక్పథంతో శర్మగారు ఈ గ్రంథం ఉపోద్ఘాతంలో అన్న మాటలు వినిపిస్తాను:

In the second part of this work, the social and cultural history to which I attach greater importanee, I have attempted a faithful representation of the age and its ideals and clear portrayal of the life of the period in its different aspects It is really very difficult for us to discover the key to the mysterious forces at work in a by - gone age, like that of the Reddis, and unravel the motives which impelled the people of that age to act as they did, since we are far removed in time, and our outlook, ideas and habits are greatly affected by western culture and thought".

సోమశేఖరశర్మ గారు 1946లో ఆంధ్ర విశ్వవిద్యాలయం విడిచి తిరిగి మద్రాసు చేరారు తెలుగు భాషాసమితి వారి సంపుటం పనిని చేసి 1957 లో డా. వి. ఎస్. కృష్ణగారి ఆహ్వానం మీద మరల ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రవేశించి తెలుగు చరిత్రకు, శాసనశాస్త్ర బోధనకు ఎనలేని సేవ చేశారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము వారిని తెలుగు లిపి [illegible] అధ్యక్షునిగా నియమించి గౌరవించింది.

జనవరి 7వతేదీ. 1963న మల్లంపల్లి సోమశేఖర శర్మగారు నిర్యాణం చెందారు ఆంధ్ర చరిత్ర రచనలో ఒక శకం ముగిసింది.

## శర్మగారు - సన్నిహితుల తలపులు.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో సోమశేఖర శర్మగారి సంతాపసభలో మాట్లాడుతూ అంతకు ముందే ఒక ఆంగ్ల ప్రసిద్ధపత్రికలో నేను చదివిన, సంతాపాన్ని గురించిన, వ్యాసంలోని విషయాన్ని ఉదహరించాను ఆదేమిటంటే: మరణించిన వ్యక్తి మేధావి మాత్రం ఐతే, సంతాపం కొంతకాలమే వుంటుంది: అతడు మంచివాడు కూడా ఐతే సంతాపం ఎల్లకాలం వుంటుందని. సోమశేఖర శర్మగారి మరణంపట్ల ప్రజలు వెలిబుచ్చిన సంతాపం ఎల్లకాలం వుండేది.

. . . . .

"నేనెరిగిన శర్మగారు" అనే వ్యాసంలో డా నేలటూరి వెంకట రమణయ్యగారు చెప్పిన విషయాలు 1. శర్మగారి ఉదయప్ప వీధి గృహం "హిస్టారికల్ అకాడమీ". అడివి బాపిరాజు, చిలుకూరి వీరభద్రరావు, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, వేలాల సుబ్బారావు, చాపలి బంగారమ్మ, ప్రతివాది భయంకర రంగాచార్యులు, కొంపెల్ల జనార్దనరావు, కోలవెన్ను రామకోటేశ్వరరావు, ఖాసా సుబ్బారావు, డా. పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు, టి యస్. రామచంద్రన్ మొదలైనవారు అక్కడ సమావేశమయ్యేవారు. 2. డా. నేలటూరి వెంకట రమణయ్యగారి ప్రధాన గ్రంథాలు 3. అవి.'Origin of the city of Vijayanagara', 'Studies in the third Dynasty,' 'Early Muslim Expansion In South India'. ఈ మూడు రచనలకు ప్రోత్సాహమిచ్చింది. సోమశేఖర శర్మగారు.

శర్మగారికి పేరే శాసనాల శర్మగారు. వారి ప్రత్యేకకృషి శాసనశాస్త్రంలో. అందులో వారి మిత్రులు నేలటూరి వారు. "అహదనకరం" – వేటూరి ప్రభాకర శాస్త్రి, శర్మగార్ల మధ్య చర్చ పండితలోకం ఎరిగినది. నేలటూరి వెంటకరమణయ్యగారు "భారతి"లో ఇలా అన్నారు. "ఉద్యోగధర్మమువలన పరిశోధనకు గడగు విద్యాధికులపలెగాక శర్మగారికి చరిత్ర పరిశోధన సహజక్రీడ. శాసన పరిష్కార మభిమాన విద్య; లిపి శాస్త్రమునందుతో సమానమైన జ్ఞానముగలవారి సంఖ్య యల్పిష్టము లిపిమర్మ విశారదులగుటచే నెట్టి ప్రాచీన శాసనముయొక్క గుప్తార్థమును నాయనకు బట్టబయలు. శర్మగారు సంపాదించి పరిష్కరించి ప్రకటించినన్ని శాసనములను మరియెవ్వరును ప్రకటించి యుండలేదు."

. . . . . .

శర్మగారు భావకవితను, నవ్యసాహిత్యాన్ని సమర్థించి తల్లావఝుల శివశంకరశాస్త్రిగారితో పని చేసారు. "మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ప్రసాదించిన మూడు అపూర్వరత్నాలు" అన్న వ్యాసంలో శ్రీ తిరుమల రామచంద్ర తను శర్మగారికి అంకితమిచ్చిన "మన లిపి పుట్టు పూర్వోత్తరాలు" గ్రంథం వ్రాయ

టంలో వారి సలహాను చెప్పారు. శర్మగారు అన్నారట "మీ ఉద్దేశం ప్రజలకు లిపిని తెలపడం కదా! దీనిలో వాద వివాదాలు ఎక్కువగా ఉండనీకండి: పరుషంగా దేనినీ చెప్పకండి" అని.

. . . . .

Inter - disciplinary studies గురించి నివేదికలు, UGC Circulars లేని రోజులవి "ఎల్లంపల్లివారితో మఱపురాని సాంగత్యం" అనే వ్యాసంలో దువ్వూరి వెంకటరమణ శాస్త్రిగారు ఇలా వ్రాసారు:

"ఆయనకు ప్రియమైనది చరిత్ర పరిశోధన, నాకిష్టమైనది వ్యాకరణ వ్యాసంగం, ఈ రెండింటికి సంబంధం తక్కువ. ఇద్దరికీ కలిసింది"

. . . . .

"శర్మగారి ధన్యజీవితం" అనే వ్యాసంలో డా. యస్వీ. జోగారావుగారు చెప్పింది శర్మగారిని జోగారావుగారు అడిగారట: "ఆ రాజు చరిత్రలూ, ఈ రాజుల చరిత్రలూ వ్రాస్తారే, మీరు మీ చరిత్ర వ్రాసుకోరే" అని. చప్పున శర్మగారు సమాధాన మిచ్చారుట. "అంత అహంకారం నాకింకా ముదరలేదులేండి" అని. మళ్లా జోగారావుగారు వేసే ప్రశ్నను గమనించి, "ఇప్పటికి వ్రాసినవాళ్ళ మాట అలా ఉండనీయండి, నేను నా దేశ చరిత్ర వ్రాసుకుంటున్నానుగా!" అని మరోసారి అసలు సంగతి అనేశారట "నేనేగాని స్వీయచరిత్ర [illegible] మది చాలా అద్దాలకి కళాయిపోతుంది" అని.

. . . . .

శర్మగారి తీరని కోరికను చెప్పారు దేవులపల్లి రామానుజ రావుగారు: "తెలంగాణా చరిత్రపై ప్రత్యేక పరిశోధన జరిపి ఒక సమగ్ర గ్రంథాన్ని రచించాలని ఆయన సంకల్పించారు. ఈ కోరిక నెరవేరకముందే ఆయన అస్తమించడం దురదృష్టకరం" అని.

## శర్మగారి అభిప్రాయాలు - నేడు

### ప్రాచీన వృత్తివిద్యా విధానము

"ఈ సంగతుల నన్నిటినిబట్టి చూడగా పూర్వము ప్రభువరేణ్యులు అగ్రహారముల నొసంగి వైదికవిద్య నెట్లాదరించిరో, బహుకళా కావ్యరచనములు గావించిన వృత్తివిద్యా విశారదులను గూడ నట్లు సమానముగనే బహూకరించిరని స్పష్టపడ గలదు. వేదశాస్త్ర పారంగతుడయిన ఛాందస బ్రాహ్మణుని హస్తమున మతవిద్య కెట్టి యాధ్యాత్మికపు తీర్పు కలిగెనో అట్లే కుటీరవాసియు, నిరుపేదయు, నమాయకుడునైన పారిశ్రామికుని చేతిలో వృత్తివిద్యయు కళాకుసుమముగ వికసించి దశదిశల దన నెత్తావిని విరజల్లి సర్వజనానంద సంధాయకమై విరాజిల్లెను. అంతటి యౌన్నత్యదశ నందిన యీరెండు విధములగు విజ్ఞాన వల్లరులకు గ్రామమే యాలవాలము, ప్రాథమిక క్రీడారంగము. పల్లెటూరి పారిశ్రామికుడు తన కర్మశాలలో వెలిగించిన యీ విజ్ఞానరత్న దీపము దేశాంతరములను గూడ ప్రకాశవంతము చేసి, సౌందర్యరస సృష్టికి పరమావధి యయినది. అట్టిది మన పూర్వపు వృత్తివిద్య. అంతటి నిరాడంబరమైనది తద్ విద్యా విధానము; అంతటి యుత్కృష్టమైనది దాని ఫలితము."

### మన ప్రాచీన విద్యాసంస్థలు

మన పూర్వపు విద్యాపద్ధతి ఇప్పటి విద్యాపద్ధతికంటె నుత్తమమైన దయినను కాకపోయినను అశోక, కృష్ణదేవరాయ, శివాజీలవంటి ప్రభు పుంగవులును, యుగంధర, తిమ్మరసాదులవంటి మంత్రివరేణ్యులును, కాళిదాస, భవభూత్యాదుల వంటి కవివతంసులును, నాగార్జున, శంకరాచార్యుల వంటి మతసంస్కర్తలును విలసిల్లుటకు కారణభూతమై, జాతీయాభ్యుదయమునకును, వాఙ్మయ వికాసమునకును, దేశీయ పురోభివృద్ధికిని దోడ్పడి, హైందవ విజ్ఞాన కాంతికిరణములను నలుదెసల బ్రసరింప జేసి, భారతజాతి కఖండ గౌరవప్రతిష్ఠలను సముపార్జించిపెట్టిన దగుటచేత నది సంస్తుతి పాత్రమును, చిరస్మరణార్హమును గాకపోదు."

"పూర్వోక్తములైయున మన ప్రాచీన విద్యా సంస్థలను గురించియు, విద్యాపద్ధతిని గురించియు గాఢముగ యోజించినచో పల్లెటూరి జీవన మెంత నిరాడంబరముగ నుండెనో యీసంస్థలు. నాపద్ధతియు నంత నిరాడంబరముగ నుండెడివని స్పష్టము కాగలదు "

చరిత్రకు ప్రస్తుతానికి గల సంబంధం

చరిత్ర ప్రయోజనం గతంద్వారా వర్తమానానికి అర్థంచెప్పి. భవిష్యత్తుకు బాటలు వేయుట

"భావికాలము యొక్క బీజములు భూతకాలమునందుండెను. భూతకాలపు ప్రతిభావిభూతులు భావికాలమున ఇనుమడించిన కాంతితో తెలిలి తేజరిల్లుచు వచ్చినవి. ఒక్కటే మార్గము; ఒక్కటే చుట్టు; బింబమునకు ప్రతిబింబము. అంతే. మార్పులేదు; క్రొత్తకూర్పులేదు ఆ కాలము వేఱు; ఈ కాలము వేఱు; కాని అది ఇది కూడ ఆ గతకాలపు పరిణామమే కదా!"

. . . . .

డిగ్రీలు లేని పాండిత్యంబు వన్నెకు
రాని యీ పాడుకాలాన బుట్టి
నీ చరిత్రజ్ఞాన నిర్మలాంభః పూర
మూషరక్షేత్ర పదోదకమయి
చాడీలకు ముఖప్రశంసల కీర్ష్యకు
స్థానమైనట్టి లోకాననుంచి
నీయచ్చతర కమనీయ లీలాజ్యోత్స్న
అడవిగాసిన వెన్నెలగుచు చెంగి
తంతె కాని గౌరీశంకరాచ్ఛ శృంగ
తుంగము త్వదీయము మనస్సు పొంగి తెలుగు
నాటి పూర్వం చరిత్ర కాణాచి యెల్ల
త్రవ్వి తలకెత్తలేదె యాంధ్ర జనములకును.

— విశ్వనాథ

# వేటూరి ప్రభాకర శాస్త్రి

– శ్రీ యస్. సచ్చిదానందం

" శ్రీ నిరంతరానంద నిశ్శ్రేయసార్థ
సాధకము సర్వకిల్బిష బాధకము స
మగ్ర విజ్ఞానదము మహామహిమ ఘనము
శరణమగు మాకు సద్గురు చరణయుగము"

ఆచార్య సత్తముడై, ఆధ్యాత్మ విజ్ఞాన మూర్తియై, ఆజీవితము మానవ కల్యాణమే తమ మనుగడకు ఫలితమని తపస్సును సాగించిన యోగిపుంగవులు పూర్ణపురుషులు, మనస్వి, అమృతమయ మూర్తి శ్రీవేటూరి ప్రభాకర శాస్త్రిగారు. ఆంధ్రభాషలోని తీరుతీయములైన పలుకుబళ్లను సందర్భశుద్ధితో ఔచితీ నిర్వహణ ముతో వివరించు ప్రజ్ఞతో వారి జీవితము సాగినది. శ్రీ ప్రభాకర శాస్త్రిగారికి అంతేవాసులమై విద్యార్జనము సేయు సదృష్టమునకు నోచుకొనిన మేము ధన్యులము. "మిత్రులకై తన ప్రాణమర్పించుట కన్న నుత్కృష్ట ప్రేమను మానవుడెఱుగడు" అన్న జీససు మహోదార వచనమునకు పరమ లక్ష్య భూతమైనది శ్రీ ప్రభాకర శాస్త్రిగారి జీవితము ప్రభాకర శాస్త్రిగారు ఆధివ్యాధులచే దారీతెన్నూ తెలియని నిస్పృహులైన వారికి పరమమిత్రులుగా, ఆ బాధితుల యాపన్నివారణ మునకై రాత్రింబవళ్లు పరితపించి. ఆ యనుతాపమున లభించిన యాత్మశక్తిచే వారివారి బాధలను నివారించెడివారు. వారి వారిని గట్టెక్కించిన పిమ్మటగూడ వారి యోగక్షేమముల నరయుచు ఆపదలలో నాదుకొనుట వారి నిత్యకృత్యము. "సమర్థ మాపత్సఖ" మ్మను స్తుతికి శ్రీ శాస్త్రిగారు అన్నివిధముల తగి యుండెడివారు.

" ఆపద గడువం బెట్టగ
నోపి శుభంబయినదాని నొడగూర్పగ మా

కీ పుట్టువునకు పాండు
క్ష్మాపాలుడు నిన్ను జూపి చనియె మహాత్మా"

అని శ్రీకృష్ణుని గూర్చిన యుధిష్ఠిరుని సంబోధనమున్నది. శ్రీ శాస్త్రిగారిచే పరిరక్షితులైన పెక్కురీ విధముగా వారిని స్మరింతురనుట కేవలము స్వభావోక్తి. వారి కరుణాప్రసారమున నుజ్జీవితులైన వారిలో నేనొక్కడను. వారి ప్రేమాదరములను చవిచూచినవారు

"ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖంవా యదివా దుఃఖం సయోగీ పరమోమతః"

భగవద్గీత 6 - 32

అను గీతావాక్యమును తలపునకు తెచ్చుకొందురు.

## శాస్త్రిగారి జననాదికము

పవిత్ర కృష్ణవేణీ తీరమున పెదకళ్లేపల్లి గ్రామమున వైదిక జ్యోతిష శిల్ప సంస్కృత సాహిత్యములను నేర్చిన శ్రీవత్సగోత్రజులైన వేటూరి సుందర శాస్త్రి, శేషమ్మలకు మూడవ సంతానముగా ప్రభాకర శాస్త్రిగారు సర్వజిత్తు మాఘబహుళ ఏకాదశీ మంగళవారమున క్రీ. శ. 1888 ఫిబ్రవరి 7వ తేదీన జన్మించారు. వీరు నల్వురు సోదరులు, నల్వురు సోదరీమణులు. వీరి తండ్రిగారా కాలమున సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులుగా ప్రసిద్ధివహించి యుండినారు. ప్రాథమిక విద్యాభ్యాసము వీరి స్వగ్రామముననే సాగినది. చిన్నవయసున సంస్కృతాంధ్రములను తమ తండ్రికడను వద్దూరి రామావధానుల గారి కడను చదివినారు. వీరి చిన్నవయసులో కళ్లేపల్లిలో జరిగిన గ్రామదేవత జాతర ఉత్సవమూ, ఆ యుత్సవమున సాగిన జంతుబలులూ చూచి చిన్ననాటి నుండి, మరణమును గూర్చి, పుట్టుకను గూర్చి, జీవుని గూర్చిన చింతలు వీరిలో రేకెత్తినవి. ఆనాటి నుండియే దైవము పేరున జరుగు నా పశుహింసను మాన్పగల్గుటెట్లాయని యా వేదన పడుచుండెడివారు ప్రభాకర శాస్త్రిగారు.

అకాలముననే వారి కుపనయనాదికములు జరిపి "చల్లపల్లిలో" మహర్షి కల్పులైన అద్దేపల్లి సోమనాథ శాస్త్రిగారికడ కౌముది మొదలగు శాస్త్ర గ్రంథముల నధ్యయనము సేయుటకై వారి తండ్రిగారు చేర్చినారు. చిన్ననాటి నుండీ శాస్త్రిగారికి కర్మానుష్ఠానముల మీద గొప్పగా శ్రద్ధలేదు. ఒక్కొక్కప్పుడు మాట్లాడుచూ "విహాయ శాస్త్రజాలాని యత్సత్యం తదుపాస్యతామ్"అని అంటూ ఉండే వారట.

శ్రీ చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారు బందరువచ్చి హైస్కూలులో ఆంధ్రోపాధ్యాయులుగా ఉన్నారనీ, వారి మహనీయత నా చుట్టుప్రక్కల యూళ్లలో చాల విడ్డూరముగా చెప్పుకొనుటను వినుటచేతనూ శ్రీ సోమనాథ శాస్త్రిగారివద్ద సహాధ్యాయులుగా ఉన్న శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, శ్రీ పిసిపాటి వెంకట రామశాస్త్రిగారు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారూ బందరుకు వెళ్లవలయునని నిశ్చయించుకొన్నారు. ముందుగా శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రిగారూ, వేంకట రామ శాస్త్రిగారునూ వెళ్లి బందరు చేరినారు. తర్వాత కొన్నాళ్లకు శ్రీ ప్రభాకరశాస్త్రి గారు వెళ్లి నారు. వారి కప్పటికి పదునారేండ్ల ప్రాయము. శ్రీ వెంకటశాస్త్రిగారి కడ తమ విద్యాభ్యాసమును గూర్చి శ్రీ ప్రభాకరశాస్త్రిగారు. "తెలుగున నాకేమేని యెఱుక యేర్పడెనన్నచో నది శ్రీ వేంకట శాస్త్రిగారి గురుతానుగ్రహ ప్రాప్తియే. వారి దగ్గఱ పుస్తకము పట్టి చదివిన దానికంటె వారి ముఖతః వినోదగోష్ఠిలో విని నేర్చినది చాలా. అధ్యాత్మ విషయమున బందరు వాసమునం గాని శ్రీ శాస్త్రిగారి సన్నిధినిగాని నాకు గలిగిన యుద్బోధ మేమియు లేదనియే యనవలెను.అంతేకాదు,శ్రీ శాస్త్రిగారి సన్నిధిని అవధాన ధారణలు, పద్యరచనలు, ఉపన్యాస వినోదములు, కవితా కల్పనములు, వాదప్రతి వాదములు, అహంతలు, మమతలు బలసి అధ్యాత్మచింత యంతర్ధాన మందినదనవలెను. శ్రీ శాస్త్రిగారు మాయామర్మము లెఱుగని స్వచ్ఛ హృదయులు. బందరు రాకపూర్వము వారి తీరు 'దేశాటనం పండిత మిత్రతాచ" అన్న శ్లోకముచొప్పున చాతుర్య మూలములు

గలదై వర్తిల్లినది. అప్పటి దేశాటన పండిత మిత్రతా రాజసభా ప్రవేశాదులు వారు చెప్పవచ్చును మేము వినవచ్చును కాని పండిత మిత్రతకు దర్వాతిదియు రాజసభా ప్రవేశమునకు బూర్వపుదియునగు చాతుర్యమూలము వారు చాటు చేయక సవిస్తరముగాఁ జెప్పుచుండెడివారు. నేను సిగ్గునఁజిదికిపోవుచుండెడి వాడను" 1

శ్రీ ప్రభాకర శాస్త్రిగారు బందరులో విద్యార్జనము చేయు కాలములో దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారి యింటను, శ్రీ వల్లూరి సూర్యనారాయణ రావుగారి యింటను ఉండేవారు. శ్రీ శాస్త్రిగారు మదరాసుకు తమ పదునెన్మిదవ సంవత్సరంలో[2] చేరినారు శ్రీ వల్లూరి సూర్యనారాయణ రావుగారు శ్రీ శాస్త్రిగారిని పరిచయము చేస్తూ శ్రీ రెంటాల సుబ్బారావుగారికి ఒక జాబు వ్రాసి యిచ్చినారట. అది వారి కెంతయో ఉపకరించినది మదరాసులో శ్రీ ప్రభాకరశాస్త్రిగారి తొలినాళ్ల జీవితము: శ్రీ వేపా రామేశముగారి యొద్ద గుమాస్తాగా నుండిన శ్రీ కాజ శేషయ్యగారు శ్రీ ప్రభాకరశాస్త్రిగారి బావగారు. వారి సహాయముతో మదరాసులో శ్రీ శాస్త్రిగారు నెలకొన గల్గినారు. మదరాసులో పండిత డి గోపాలాచార్యులు, శ్రీ పురాణం నాగభూషణ శర్మగార్లును మిత్రులయినారు. శ్రీ గోపాలాచార్యులుగారి మూలమున శ్రీ పనప్పాకం అనంతాచార్యులుగారు, వారి కుమారులు శ్రీనివాసాచార్యులుగారునూ మిత్రులయినారు. మదరాసు చేరిన వెంటనే వెస్లీ మిషన్ హైస్కూలులో రెండేండ్లకాలము తెలుగు పండితులుగ ఉద్యోగించినారు. శ్రీ ప్రభాకర శాస్త్రిగారు. ఆ యీ సమయమునసే ప్రాచ్యలిఖిత పుస్తకశాలకు వెళ్లి అక్కడి గ్రంథములను చదువుచుండెడి వారు. శ్రీ వేపా రామేశముగారితో తఱచు విద్యావినోదగోష్ఠి సాగించుచూ శ్రీ ప్రభాకర శాస్త్రిగారు గణితఖగోళ చరిత్రాది రహస్యముల నెన్నింటినో

1. ప్రజ్ఞా ప్రభాకరము 32, 33 pp.
2. క్రీ శ. 1908.

క్షుణ్ణముగ తెలిసికోగల్గినారు. రాత్రులలో శ్రీ రామేశముగారితో గలసి వారి టెలస్కోపు మూలమున నక్షత్రగ్రహ మండలముల గతివిశేష రహస్యముల నెన్నింటినో పరిశీలించినారు. ఆ కాలముననే ఎపిగ్రాఫికా ఇండికా,ఇండియన్ ఆంటిక్వెరీ, ఎపిగ్రాఫికల్ రిపోర్టులు మొదలగు చరిత్రాధార గ్రంథములనెల్ల శ్రీ రామేశముగారి నుండి తెచ్చుకొని క్షుణ్ణముగా చదివి యా విశేషములనెల్ల గ్రహించినారు. చరిత్ర, ఖగోళ రహస్య పరిశీలనమున వారికిగల తీవ్రమగు పరిశోధకతా దృష్టికి దృష్టాంతము - 1910వ సంవత్సరమున హాలీసు కామెట్ వచ్చినపుడు మదరాసులో దానిని తొలుత గుర్తించిన వ్యక్తి శ్రీ ప్రభాకరశాస్త్రిగారు. ఒకనాడు బైనాకులర్‌తో దానిని పరిశీలనముగా గుర్తించుచూ దాని యుత్పత్తినీ ఉనికినీ శ్రీ రామేశముగారికి తెల్పుటకై శ్రీ శాస్త్రిగారు వడిగా పర్వెత్తుటలో మేడమెట్లు కొట్టుకొని మోకాలిగూటి చర్మము చిట్లి నెత్తురు కారుటను గూడ గమనింపక ఆత్రముగా వెళ్లినారట. నెత్తుటినిచూచి శ్రీ రామేశముగారు నివ్వెర చెందినారట. పర్నాడు శ్రీ రామేశముగారు ఆ ధూమకేతువునుగూర్చి హిందూ పత్రికలో నొక వ్యాసము వ్రాసినారు. ఈ విషయమును చెప్పుటలోగల యాంతర్యము: శ్రీ శాస్త్రిగారు విషయమును పరిశీలించు పుడు విషయ పరిశీలన దృష్టియేగాని ఇతరములగు స్వవిషయముల యందేమాత్రము ఆసక్తి ఉండెడిదికాదని.

శ్రీ ప్రభాకర శాస్త్రిగారు కెలెట్ హైస్కూలులో రెండేడ్లకాలము తెలుగు పండితులుగా పనిచేసినారు. ఆ కాలముననే వీరి ఇర్వదవ యేట, వీరి సహాధ్యాయిగా నుండిన పిసిపాటి వేంకటరామ శాస్త్రిగారి సోదరి శ్రీమతి మహలక్ష్మిగారితో ఘంటసాలలో వీరికి వివాహమైనది. వివాహానంతరము మదరాసుకు వచ్చి తమ యుద్యోగాదికములను సాగించుకొనుచుండినారు.

శ్రీ శాస్త్రిగారి మదరాసు జీవితమున సాహిత్యవిశేషములు: మదరాసులో శ్రీ ప్రభాకరశాస్త్రిగారు మైలాపూరులో వారి బావగారితో కలసియే యుండినారు; కాని భోజనాదికములు మాత్రము హోటలులో. విరామము దొరకినప్పుడెల్ల ప్రాచ్యలిఖిత పుస్తకములకు(Browns Library)వెళ్లి యముద్రిత గ్రంథములను పరిశీలించుచు

లోకల్ రికార్డులనెల్ల చదువుచు అపూర్వాంశములను గుర్తించుచు, గుర్తించిన వానిని మిత్రులకు ఉత్తరముల ద్వారా తెల్పుచు తన్మయతతో విద్యావ్యాసంగము చేయుచుండినారు. ప్రాచ్యలిఖిత పుస్తక శాలాధ్యక్షులు లైబ్రరికి వచ్చినపుడు వీరిని గూర్చి లైబ్రేరియన్ద్వారా తెలిసికొని గ్రంథాలయమున ఉద్యోగ మిచ్చినారట.

ఆ నాళ్లలో పావులూరి మల్లనను గూర్చి వీరొక వ్యాసము వ్రాసినారు. ఆ వ్యాస సారాంశము: శ్రీ వీరేశలింగము పంతులు గారు, కవులచరితలో వ్రాసిన తీరు సరిగాదని, పావులూరి మల్లన నన్నయనాటి మల్లన్న యనుమదనీ నిరూపించుచూ శ్రీ శాస్త్రిగారు వ్రాసిన వ్యాసమది. ఆ కాలమున మదరాసునుండి వెలువడుచుండిన "శశిలేఖ" అను పత్రిక ఇతరులగు కొందరు పండితులును - ముఖ్యముగా శ్రీ చిలుకూరి వీరభద్ర రావుగారు - శ్రీ వీరేశలింగము గారి పక్షమై వీరావేశముతో శాస్త్రిగారిని విమర్శించినవి. అంతేగాదు - శ్రీ ప్రభాకరశాస్త్రి గారిని ఆ యుద్యోగములో నుండనీయరాదని తీవ్రముగా వ్యాసములు వ్రాసినారు. ప్రభాకర శాస్త్రిగారు లైబ్రరీలోని పుస్తకములను తారుమారు చేయుచున్నారని కూడ వ్రాసినారు శ్రీ వీరభద్ర రావుగారు.

ఆ దినములలో ప్రొఫెసరు రంగాచార్యులు గారు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోగల మహావీరాచార్యుని గణిత సారసంగ్రహమును ముద్రించుచుండినారు. మల్లన గణితము దానికి తెలుగగుటను వారికి తెల్పుచూ, శ్రీ వీరభద్రరావు మొదలగు వారి వ్రాతలయిన వ్యాసములను గూర్చికూడ శాస్త్రిగారు రంగాచార్యుల వారికి తెల్పినారు. ఈ విషయములో సత్యాసత్య నిరూపణమునకై శ్రీ రామేశముగారు ప్రాచ్యలిఖిత గ్రంథాలయములోని రికార్డులను పరిశీలించి ప్రామాణికముగానున్న శ్రీ ప్రభాకర శాస్త్రిగారి రచనల యెడ వైరస్యమూని వారి యుద్యోగమునకే హానిగలిగించు నుద్దేశముగల వారి విషయమై శ్రీ జయ్యా నరసింహేశ్వర శర్మగారితో నొకనాడు ముచ్చటించి యథార్థవిషయమును అప్పటి దొరతనము వారికి తెల్పుటకు నిశ్చయించినారు. శ్రీ శాస్త్రిగారి రచనము ప్రామాణికమని వ్యక్తమగునట్లు "శశిలేఖ"లో లైబ్రరీలోని మల్లనగణిత'పు వ్రాతప్రతులలోని పాత

ములనెల్ల ప్రకటించుట జరిగినది. కాకినాడలోని కాశ్చెర్ల శ్రీనివాస రావుగారు పావులూరి మల్లన్న తాలూకు వ్రాత ప్రతులను సంపాదించి, శ్రీపోలవరము జమీందారుగారు, దురుసేటి శేషగిరిరావు వగైరాల సంతకాలతో నా పాఠములను ప్రకటించినారు. అవియెల్ల శ్రీ ప్రభాకర శాస్త్రిగారి వాదమును బలపరచినవి. ఇవి యన్నియు సాహిత్య విషయముగా కూడ ఎట్టి ప్రమాణజ్ఞత ఉండవలయుననుట శ్రీ శాస్త్రిగారి యాశయమో వ్యక్తము చేయుచున్నవి ఈ కాలముననే ఒక పర్యాయము శ్రీ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు శ్రీ వీరేశలింగం పంతులు గారితో కలిసి ప్రాచ్యలిఖిత పుస్తకశాలకు వెళ్ళియుండినారు. ఆ దినములలో శ్రీ వీరేశలింగం పంతులుగారాంధ్రకవుల చరిత్రను సంస్కరించి ప్రకటించుటకై పూని యుండినారు. ఆ సందర్భమున శ్రీ ప్రభాకర శాస్త్రిగారి సహాయమును చేకూర్చు ప్రయత్నములో శ్రీ లక్ష్మణ రావుగారు శ్రీ వీరేశలింగం పంతులు గారికి శ్రీ ప్రభాకర శాస్త్రిగారిని పరిచయము చేసి పావులూరి మల్లన్న చరిత్రము యొక్క తత్త్వమును నిర్ణయింప నభిలషించినారు. అక్కడ ఉన్న వ్రాత ప్రతులన్నియూ శ్రీ ప్రభాకర శాస్త్రిగారి వాదమునే నిరూపించినవి. శ్రీ వీరేశలింగము పంతులుగారికి కవుల చరిత్ర సంస్కరణము విషయమున ఎన్నో విషయములను శాస్త్రి వ్రాసిపంపినారు.

మదరాసులో నున్న కాలముననే ప్రాచ్య లిఖిత పుస్తకాలయమునగల గ్రంథ పరిశీలన పఠనోత్సాహములు శ్రీ ప్రభాకర శాస్త్రిగారి సాహిత్యజీవనమున అనేక విషయములను గుర్తింపజేసినవి. అనేకములయిన చాటుపద్యములను సేకరించి "చాటుపద్య మణిమంజరి"ని ప్రకటించినారు. ఆ కాలమున మదరాసులో సాగిన సాహితీ చర్చలలో అన్నింటిలోనూ శ్రీ శాస్త్రిగారిది అగ్రస్థానముగా ఉండెడివి. వీరు సాగించిన వాఙ్మయ విమర్శలుగాని,రచించిన కథలు, కావ్యములు గాని మనసు నిర్మలమై సత్యాన్వేషణయుతమైన సాహిత్యజీవిగా వీరిని గుర్తింప జేయును.

## శ్రీ ప్రభాకర శాస్త్రిగారి రచనలు

1. పద్యకావ్యములు:

దివ్యదర్శనము, మూన్నాళ్లముచ్చట, కడపుటీపు, కపోతకథ, చిన్ననాటి చేష్టలు, విశ్వాసము, పెండ్లిముచ్చట, గృహలక్ష్మి, పూలవిందు. సీతాఫలము, సప్తపదులు, శరణార్థి, మాతృశ్రీ, సనత్సుజాతీయము మొదలగునవి.

2. అనువాదములు ( రూపకములు ) ;

కర్ణభారము, ప్రతిమ, భగవదజ్జుకము, మత్తవిలాసము, మధ్యమ వ్యాయోగము. నాగానందమున రెండంకములు (మిగిలినది పూజ్యపాదులు ఆచార్య దివాకర్లవెంకటావధానిగారు పూర్తిచేసినారు).

3 గద్యగ్రంథములు - :

ప్రజ్ఞాప్రభాకరము, (శ్రీవారి యాత్మకథ), నీతినిధి - (అనువాదము. ఆంగ్లమున దీనిపేరు "The Economy of Human Life" ఆంధ్ర గ్రంథమాలయ దాఱవ సుమముగా ప్రకటితమైనది.

4. కట్టుకథలు కొన్ని.

4. వాఙ్మయచరిత్రలో విమర్శ కవి జీవితాదులను సప్రమాణముగా వివరించు గ్రంథము: శృంగార శ్రీనాథము,

5. చారిత్రకాధారములతో సవిమర్శముగా పరిష్కరించి ప్రకటించిన గ్రంథములు :

తంజావూరి యాంధ్రరాజులచరిత్ర, బసవ పురాణము, క్రీడాభిరామము, ఉద్భటారాధ్య చరిత్ర, హరవిలాసము, అన్నమాచార్య చరిత్ర, పావులూరి మల్లన్న గణితము, ధనుర్విద్యావిలాసము, ఆంధ్ర కామందకము, సుభద్రాకల్యాణము. వేంకటేశ్వర వచనములు, సుగ్రీవ విజయము, ఉత్తరహరివంశము, మను చరిత్ర, శృంగార అమరు కావ్యము, ప్రబంధరత్నావళి, నీతి ద్విషష్టికా, అప్పన చారు

చర్య, వేంకటేశ్వర స్తుతి రత్నమాల, వేంకటేశ్వర లఘుకృతులు, రంగనాథ రామాయణము. బసవోదాహరణము.

6. సంకలనములు ;

చాటుపద్య మణిమంజరి మూడుభాగాలు (ఇందలి రెండుభాగము లచ్చయినవి).

7. అహదనకర తామ్రశాసనము, లక్ష్మీపురము శాసనము, మంచాళ్ల ముట్లూరు కపిరేశ్వరపురము మొదలగు చారిత్రక నిరూపణములగు శాసనములను పాఠ పరిశోధనలతో ప్రామాణికముగా పరిశోధించి ప్రకటించినారు. శాతవాహనులూ, ఇక్ష్వాకులూ మొదలైన ప్రాచీన రాజ వంశముల చరిత్రలను పరిశోధించి వారాంధ్రులను విషయమును నిరూపించినారు. ప్రాచీన శాసనములలోని వింత యక్కరమైన 'ఱ' ను గూర్చిన చర్చను సాకల్యముగా పరిశీలించి దాని పుట్టు పూర్వోత్తరములను నిరూపించినారు, శాస్త్రిగారు.

'నాగబు'

శ్రీ ప్రభాకర శాస్త్రిగారు నిరంతరము గాలించిన తాళపత్ర గ్రంథ పరిశీలనా ఫలితముగ, లిపి భాష మొదలగువాని పరిణామ తత్త్వమును చక్కగ గుర్తించు టయే కాక ప్రాచీన భాషావ్యవస్థను గూడ నిరూపించు శాసన భాషావిధానమును అవగాహనము చేసికొని యాంధ్రాభాషా తత్త్వమును నిరూపించగల్గినారు. పూజ్యులు విమర్శకాగ్రేసరులు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు శ్రీ ప్రభాకర శాస్త్రి గారికి శ్రద్ధాంజలి ఘటించుచూ పరిశోధనలో ఇట్లు వ్రాసినారు:

"మన కుపలబ్ధమైన మొదటి తెనుగు పదమును కనిపెట్టిన కీర్తి శాస్త్రిలు గారిది. 'నాగబు' అను పదము ప్రత్యేకముగా అమరావతి శాసనములందు లభించినది. ఇది రెండువేల యేండ్ల క్రిందటిది. 'నాగబు' అనునది 'నాగము' అను పదమునకు రూపాంతరము. సంస్కృత పదమగు 'నాగ' అనునది 'బు' అను తెనుగు ప్రత్యయముతో వాడబడినది. అనగా నానాటికే అనగా క్రీస్తు పూర్వమే సంస్కృత పదములు తెనుగు ప్రత్యయములతో వ్యవహరింపబడినట్లు తెలియు

చున్నది. మఱియు క్రైస్తవ శకానంతరము వెలసిన శాసనములలో 'పట్టనబు వక్రబు, సిద్ధాయబు, మున్నగు రూపములు వెయుచుండుట చేతను "సంవత్స రంబుళ్" అను ఒందు పూర్వక "బు" రూపము క్రీ శ. 506లోనే కనబడు చుండుటచేతను శ్రీ శాస్త్రిగారు చూపన రూపము సహజభాషా పరిణామమును సూచించుచున్నది."

"మీమాంసా శాస్త్రమున ప్రాభాకరమతమున కెట్టి విశిష్టతకలదో, ఆంధ్ర భాషామీమాంసా శాస్త్రమున ప్రభాకర మతమునకు నంతటి విశిష్టస్థానము గలదు. ఈ ప్రాభాకరభాషా సంప్రదాయములతో పరిశోధనల సాగించినచో నదియే పరిశో ధనకు పరమావధియై భాషా ప్రపంచమునకు దివ్యజ్యోతి కాగలదు" అని.

శ్రీ ప్రభాకర శాస్త్రి గారి పరిశోధన కేవలము పుస్తక పఠనమాత్ర పరి శోధనము కాదు. ఆత్మతత్త్వ పరిశోధనతో జతగూర్చి భాషా పరిశోధనము కావించుట యాయన నిత్యకృత్యము.

పూజ్యులు చారిత్రకి పరిశోధకులకు గురుకల్పులయిన మల్లంపల్లి సోమ శేఖర శర్మగారు శ్రీ ప్రభాకర శాస్త్రి గారిని గూర్చి "మూడుమూర్తులా అయన పరిశోధకుడు, భాషా పరిశోధకుడు. చరిత్ర పరిశోధకుడు, గేయ ఛందః పరి శోధకుడు, ఆత్మపరిశోధకుడు. విశేషించి ఆధ్యాత్మిక పరిశోధకుడు. మూర్తీభవిం చిన పరిశోధన ఆయన" అని పేర్కొనివారు. వీరిర్వురూ మదరాసులో కలిసినవ్వు డనుదినమూ ఎన్నో వాఙ్మయ శాసన విశేషములను పదింబదిగా చర్చించుకొనే వారు. అహదనకర తామ్రశాసనమును పరిష్కరించి పాఠములను చదువుటలో వీరికి మతభేదము కలిగినది. కాని వారి మైత్రికి మాత్రము భంగము కలుగలేదు.

ప్రఖ్యాత చరిత్రకారులు పూజ్యులు శ్రీ నేలటూరి వేంకటరమణయ్య గారు. శృంగార శ్రీనాథరచనముచే రెడ్డి రాజ్య సంశోధనకు పునాదివేసినవారు శ్రీ ప్రభా కర శాస్త్రి గారని భారతి రజతోత్సవ సంచికలో వ్రాయుచు "కేవల భాషా పండి తులయందు లేని చరిత్ర జిజ్ఞాస వీరియందు కానవచ్చుచున్నది" - అని వ్రాసి వారు.

దేశి సాహిత్య సౌందర్యముల నెన్నిటినో త్రవ్వితీసిన ఘనత శ్రీ ప్రభాకర శాస్త్రి గారిదే. ద్విపద కవితా ప్రశస్తిని గూర్చిగానీ. గొబ్బి పాటలు, ఉయ్యాల పాటలు, వెన్నెల పదాలు, చిలుక పదాలు, ధవళాలు మొదలగు వానిని వివరించు పట్టులలో దేశికవిత యందలి జాను తెనుగును వివరించునపుడు జానపద వాఙ్మయ రహస్యముల నన్నిటినీ పరిశీలించి వెలికిదీసిన గాని తృప్తినందని తత్త్వము శ్రీ ప్రభాకర శాస్త్రిగారిది.

మదరాసులో నుండు దినములలో శ్రీ శాస్త్రిగారికి టైఫాయిడు జ్వరము 1912 - 13 సంవత్సరములలో వచ్చినది ఆ జ్వర తీవ్రతవలన చాలగా చిక్కిపోయిరి అవి ప్రథమ ప్రపంచ సంగ్రామము జరుగుచున్న దినములు.యుద్ధ విషయములను చదివి శ్రీ శాస్త్రిగారు మిక్కిలి తపించుచుండువారు. మూడేండ్లు నిద్రాహారములు సరిగాలేక వీరు చాల బాధపడినారు. ఆ సందర్భమున వీరు పేర్వాసిగాంచిన వైద్యుల వైద్యములనూ, ప్రఖ్యాత దివ్య క్షేత్రములనూ దర్శించి తమ రుగ్మతను పోగొట్టుకొన నెన్నియో ప్రయత్నములు ప్రయత్నించినారు.కాని కుదర లేదు. వీరి యనారోగ్యమును తొలగించు కొనుటకు మార్గమేదియు తోచక వ్యథితులై యుండగా అప్పటి ప్రసిడెన్సి కళాశాల తత్త్వశాస్త్రాచార్యులు ప్రొ. పోతరాజు నరసింహముగారి సహాయమున కుంభకోణమున నుండిన మాస్టరు సి. వి. వి. గారి కడకు వెళ్లి వారి యోగమార్గమున శిష్యులై సంపూర్ణారోగ్యమును పొందగల్గినారు.

శ్రీ శాస్త్రిగారి కావ్యములు :

శ్రీ ప్రభాకర శాస్త్రిగారు సర్వాంధ్ర దేశమునకును పండితులుగా, విమర్శకులుగా సుపరిచితులు. పసితనము నుండీ వారిలో పెరిగిన యాధ్యాత్మచింతన, కరుణ వాత్సల్యములు, మానవత కుండదగు సత్యశీల ప్రకటనము వారి కావ్యములలో ప్రతిఫలించడము ప్రత్యేక విశేషము. మహాకావ్యములను వ్రాయగల సామ

ర్థ్యము కలవారైనా ఖండకావ్యములను మాత్రమే వ్రాసినారు. ప్రతికావ్యములోనూ వారి ప్రత్యేక వ్యక్తిత్వము కొట్టవచ్చినట్లు ప్రకాశిస్తూ ఉంటుంది. అనవరతము అంతరాత్మావలోకన తత్పరులై ఆర్తుల ఆధివ్యాధులను ఆర్చుటకై యోగానుష్ఠానము నెఱపినవారు. అలవోకగా వ్రాసిన కావ్యములు సైజులో చిన్నవిగా కానవచ్చినప్పటికినీ గుణవిశేషములో దండితనము గలవి.

"విశ్వాసము" : విజయవాద నుండి వారు బందరుకు రైలుప్రయాణము సేయునపుడు ఉప్పరివాని పెంపుడు కుక్క విశ్వాసముతో నాతని వెన్నడించివచ్చి యాతడు ప్రయాణించుచున్న రైలుతో పర్వెత్తి ప్రాణత్యాగము చేసిన గాథ. ఇది ప్రత్యక్ష ప్రమాణమైనది. కఱకుగుండెను గూడ కఱగించిన కరుణకమైన కథ. "మున్నాళ్ల ముచ్చట" యు యథార్థ గాథయే

* " ఆరం గూరిన కూరిమిం జెలగు భార్యాభర్త లేతత్కథా
సారం బారసి మేలు గాంతురను నుత్సాహంబునన్ నీతి నిం
డారం గల్గి యథార్థ మైన యొక గాథార్థంబు వాక్రుస్వగా
నారంభించితి నేనిదే సుకవితా వ్యాహారపుం ధోరణిన్"

దిన్యదర్శనము "నిజమును పెంచిన సత్కృతి" కనుకనే శ్రీ శాస్త్రిగారు

" తలపులు విశుద్ధములుగా
దలపింపుము పలుకు లమృత ధారలుగా
బలికింపుము కార్యంబులు
సరిపింపుము పరహిత ప్రశస్తములు గాన. ఆని వ్రాసినారు.

మదరాసులో నుండగా సాగిన, సాగించిన తీవ్రమగు వాఙ్మయ విమర్శలు. ఆ సమయమున వారి కేర్పడిన యనారోగ్యము, తన్నివారణముకై వారు

\-\-

* మూన్నాళ్ల ముచ్చట

చేరిన యోగము వారిని యనవరతము ఆత్మావలోకన తత్పరులుగా, మానవ కల్యాణమునకై ఎడతెగని తపస్సున జీవితమును సాగించునట్లు చేసినవి.

1939 - 40 సంవత్సరములలో మదరాసునుండి తిరుపతికి వారు విచ్చేసినారు. తిరుమల తిరుపతి దేవస్థానములవారు నిర్వహించిన శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయమున ఉద్యోగ జీవనము. ఆ దినములలో శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య కళాశాలలో ప్రధానాంధ్రాధ్యాపకులుగా, అపుడే ప్రారంభించిన విద్వత్పరీక్షకై వచ్చిన విద్యార్థులను విద్వాంసులుగా జేయుట, ఆయా విద్యార్థుల నిత్య జీవితము కూడ సుశీల సంపన్నముగా ఉండునట్లుగా జేయుట వారి ధ్యేయముగా ఉండెడిది. ప్రతి విద్యార్థినీ అడుగడుగున స్వచ్ఛము, అచ్ఛతరముగా తీర్చిదిద్దుటకై వారి ప్రయత్నమూ, నిజముగా మాయందఱను చకితులను జేసెడిది మాలో శ్రీ విజయ రాఘవన్ అని యొక విద్యార్థి యుండెడివాడు. అతడేవో కొన్ని పద్యములను మఱి యొకరిని గూర్చి వ్యంగ్యముగాను దురుసుగాను విమర్శించుచూ వ్రాసినాడు. అది చదివి మాలో మేము తమాషగా కేరింతలతో చర్చించుకొనుచూ ఉండినాము. కళాశాలలో అటువైపుగా వెళ్ళుచూ శ్రీ శాస్త్రి గారు విన్నారు. చాలా నొచ్చుకొని యాతనిని పిలచి ఇతరుల నట్లవమానించుట న్యాయధర్మబద్ధముగా ఉండదని చెప్పుచూ

ఇతరుల నవమానించెడి
మతి మాన్పుము పరుల చెడ్డగుణములు సైపన్
ధృతి గూర్పుము సంతోషా
మృత రసమిడి సేద దేర్పుమీ నా స్వామీ"

అని మందలించినారు. మఱి యొకనాడు మేము రెండవ సంవత్సరమున చదువును సాగించుచున్నపుడు ప్రథమ వర్షమున శ్రీ తిమ్మావఝ్ఝుల కోదండరామయ్యగారు, శ్రీ నిడదవర్తి శ్రీరామ మూర్తి గారు మొదలగువారు విద్యార్థులుగా ఉండేవారు. ఆయేడే తొలిసారిగా మా కళాశాలలో విద్యార్థినులిర్వురు చేరినారు తమ విద్యార్థులు సచ్ఛీల సంపన్నులుగా ఉండవలయు ననుట శ్రీ శాస్త్రి గారి తత్త్వము.

వారానాడే అనగా విద్యార్థులను చేర్చిననాడే తరగతిలోనికి వచ్చిరావడముతో మాకందఱకూ ఒక పద్యమును చెప్పి మఱునాడు ఒప్పజెప్పవలసినదిగా కోరినారు

"లాఁచి పరాంగనల్ వరవిలాస మనోహర రూప సంపదన్
జూచినఁ జూడ డుత్తముఁడు, జూచినఁ జూచును మధ్యముండు తాఁ
జూచినఁ జూడకుండినను జూచును నీచుఁడు వారిలోన నన్
జూచినఁ జూడకుండు గుణి జూచిన చూపునఁ జూడు మంబికా

అని చెప్పుచూ

"ఇది రావిపాటి త్రిపురాంతకుడను కవీశ్వరునిది. ఈ తరగతిలోని మీరు సోదరీ సోదరులుగా మెలఁగవలయు" నన్నారు. అందరి కన్నులు వారి యా మాటలకు చెమ్మగిల్లినవి.

చక్కని దస్తూరి యనిన వారికి మిక్కిలి మక్కువ. మాలో ఏ ఒకరి యక్షరములు గుండ్రనగా ఉన్ననూ

" ఆంధ్రభాష యమృత మాంధ్రాక్షరంబులు
మురువు లొలుకు గుండ్ర ముత్తియములు
ఆంధ్రదేశ మాయురారోగ్య వర్ధకం
బాంధ్రజాతి నీతి ననుసరించు" నని దగ్గరకు బిల్చి ప్రీతిగా వీపు తట్టి తమ తృప్తిని చూపేవారు.

ఒకమారు మాకు హాస్టలులో ఆంధ్ర తమిళ భేదములు తీవ్రముగా చెలరేగినవి. అవి వాగ్వివాదములుగా నిలువక సిగపట్లుల దాకా వెళ్లినవి. ఆ తమిళుల కుతంత్రములు సమ్మతముగాక మాలో కొందఱ ముద్రికులమైనాము. నేనూ, శ్రీరామమూర్తి, శ్రీరామసుబ్బ శర్మ అను వారము తమిళ విద్యార్థులలో కొందఱిని శంకరగిరి మాన్యాలు చూచేపర్యంతము చేసినాము. ఈ విషయము శాస్త్రిగారికి తెలిసినది. వెంటనే తమ్ము కలుసుకోవలసినదిగా కబురంపినారు. వారి ఇంటికి

వెళ్లినాము. అంతే. మా ప్రవర్తనము దౌర్జన్య భూయిష్టమనీ దానిని మార్చుకోవల సియున్నదనీ మందలించినారు కాని వారి రచనయే యైన

"ఓర్వరు మాయమర్మముల నుజ్జ్వల ధీమహిమంబు పేర్వఁడన్
నేర్వరు గాక విద్దియలు నెయ్యము తియ్యము చూచుకొండ్రు లో
గర్వము తక్కువేయయిన గంద్రతనంబునఁ గానవత్తు రా
యుర్వపు రుజ్జ్వలుల్ బలసమున్నతు లెన్నఁగ నంధ్ర పుత్త్రికుల్
ఆతిథ్య గౌరవంబును
స్వాతంత్ర్య ప్రియత, స్వల్పసంతోషము, దు
ర్నీతి విహీనత, నైచ్యా
పేతత్వము నాంధ్రులందుఁ బేర్వఁడు గుణముల్" - అను నీ పద్యము

లను బేర్కొని వారు మన కతిథులుగదా. అట్టివారియెడ కార్కశ్యము తగదని తెల్పినారు.

ఆ దినములలో మా కళాశాలలో సవర్ణ హిందువులకు మాత్రమే ప్రవేశ ముండెడిది. శ్రీ శాస్త్రిగారు సర్వమత సమత గలవారు. పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరినుండి షేక్ మస్తాన్ అనే ముస్లిం విద్యార్థి, కృష్ణాజిల్లాలో శ్రీ శాస్త్రిగారి గ్రామ ప్రాంతమునుండి దాసి బసవయ్య అనే హరిజన విద్యార్థీ మా కళాశాలలో చేరుటకై వచ్చినారు. ఇది 1942 నాటిమాట. అప్పటి కమలోనున్న రూల్సు ప్రకారము వారిద్వరికీ మేము చదువుచున్న కళాశాలలో ప్రవేశము లభ్యము కాలేదు. కళాశాలనుండి శ్రీ శాస్త్రిగారి యింటికడకు వచ్చినవారు ఇంటిలోనికి రాక దూరముగా నిలుచుండినారు. వారు దగ్గరకు రమ్మనగా మస్తాన్‌మాత్రము వచ్చి నాడు. బసవయ్య కదలక యుండుటను జూచి "నీవు నాదగ్గరకు రావచ్చును" రమ్మనినారు. వారి నిర్బంధమూ, అందున బసవయ్యను-దగ్గఱగా కూర్చుండబెట్టు కొని, తమయింట నాతనికి భోజనమొసగి చదువు చెప్పినారు. మాయందఱ కును కూడ వారి సహపంక్తి భోజనమే సాగిన దానాడు. అపుడు వారు,

"వర్తింతున్ మతదేశ జాతికృతముల్ వైవిధ్యముల్ వీడి ని
ర్వర్తింతుం బరిచర్య నార్తులకు యావత్ప్రజ్ఞ నర్పించి యా
వర్తింతున్ గురుదేవ సూక్తములు భావస్ఫూర్తి నట్లయ్యునే
దూర్తుండౌదు నొకొక్కచో నడవుమీ తుందుడ్కు నాత్మేశ్వరా!

అను పద్యమును జెప్పి మాలో కొందరకు గల్గిన సంశయ నివారణము కావించి నారు.

శ్రీ శాస్త్రిగారి సాహిత్య జీవనసుకన్న యోగానుష్ఠాన సంభరితమగు జీవితము ఎందఱెందఱినో సన్మార్గ వర్తనులుగా మార్చినది. శరీర మానసిక అనారోగ్యములను తొలగించినది. తిరుపతిలో వారు వర్తిల్లిన పది సంవత్సర కాలములో మేము చూచిన యద్భుతసంఘటన లెన్నో కలవు. కట్టెలమ్ముకొని జీవించు ఒక ఏనాది చెట్టుపైనుండి పడినాడు నడుమునకు గల్గిన దెబ్బవలని బాధ ఒక మాత్రమున తొలగలేదు. డాక్టర్ల వైద్యములన్నీ కావించుకొని యాతడు తన యిల్లాలిని వెంటనిడుకొని ఓచ్చమునకై వచ్చినాడు. మంచి వయసులోనున్న నీకీ బిచ్చమెత్తుకొను దుర్బుద్ధి యెందుకని మేమనుచుండగా లోపలినుండి శ్రీ శాస్త్రిగారు వాకిటికి వచ్చినారు. వాని యవస్థ చూచినారు. చాల ఖిన్నులై వానిని యింటిలోనికి రమ్మని కూర్చొనుమనగా నాతడది సాధ్యము కాదని ఒకప్రక్కకు ఒడ్డగిలగా వాలినాడు. వాని యా యంగ వైకల్యమును తొలగించి తీరవలెనను వారి పట్టుదల, వాని యవస్థను జూచి వారు పడిన తపన చూచిన వారికిగాని అది యథార్థమని నమ్మలేనంతగా ఉండినది. వారు కన్ను మూసికొని యాతని యారోగ్యమునకై ప్రార్థించినారు. పది పదునైదు నిముషాలలో నా ఒడ్డొరకముగా ప్రక్కకు వాలియున్న మనిషి అప్రయత్నముగా వెల్లకిల పరుండి, పరుండిన యాతడు లేచి, లేచిన యాతడు నిర్భయముగా ఎట్టి బాధయు లేక తన యిల్లాలితో ముచ్చట లాడుచు వెళ్లినాడు.

నా పసితనమున అనగా పదనాల్గు పదునైదు సంవత్సరముల వయసులో నాకు గుండెనొప్పి తీవ్రముగా వచ్చెడిది. అపుడే నేను తిరుపతి శ్రీ వెంకటే

శ్వర ప్రాచ్య కళాశాలలో విద్యార్జనమునకై చేరినది. ఆ నొప్పి తగ్గుటకు ప్రాణాయామాదులు, శరీర వ్యాయామము చేసెడివాడను కానీ తగ్గలేదు. మిత్రులు నీది పిచ్చుకగుండెరా యని పరిహసించెడివారు నా యీ బాధను మా శాస్త్రిగారికి విన్నవించుకొన్నాను. సాయంత్రమువేళ వారి యింటికి వెళ్లేవాడను. నా బాధ తొలగుటకై సర్వాంతర్యామికి భగవంతునకు నమస్కారము చేసికోమన్నారు. కండ్లు మూసికొని వారి యాదేశము మేరకు నమస్కారము చేసికొన్నాను. అంతే. నన్నెఱుగకయే నా ప్రయత్నము లేకయే నేను బోరగిలపడి కాలుసేతులు కలిసి "ధనురాసనము" వేసినట్లయి నా గుండెలోని యస్తవ్యస్తముగానున్న ఎముకల నేదోశక్తి తన చేతితో నిమిరి సర్దుచున్నట్లుగా అనుభూతి నందినాను. అట్లు కొన్నాళ్లు సాగినది మఱి యా నొప్పి యెటు పోయినదో యేమో! ఈ యోగ మార్గమున వారివలన చికిత్స నందినవారి యనుభూతులన్నియు వినువారికి యిది నిజమా! అని యనిపించును. కాని ఆ యమృతత్వము నాస్వాదించినవారికి దాని యానంద తన్మయత ఎట్టిదో తెలియును.

1946 మా స్వగ్రామమైన శ్రీకాళహస్తికి శ్రీ ప్రభాకర శాస్త్రిగారు వచ్చినారు. శ్రీ కాళహస్తి సంస్థానము లైబ్రరీలోని యముద్రితములగు గ్రంథములను పరిశీలించి వానిని దేవస్థానము (తి.తి.దే.) వారి గ్రంథాలయమునకు జేర్పించుట యప్పటిపని. ప్రథమాంధ్ర కవయిత్రి తాళ్లపాక తిమ్మక్క రచితమయిన సుభద్రా కల్యాణము ఆ గ్రంథములలో లభ్యమైనదే. తిరుపతి దేవస్థానమువారి ప్రకటనముగా దానిని శాస్త్రిగారు ప్రకటించినారు.

పద కవితా పితామహుడుగా ప్రశస్తి వహించిన తాళ్లపాక అన్నమాచార్యుని సంకీర్తనములను, అంతకు మున్దెన్నడో మహంతు ప్రయాగదాసుని కాలమున ప్రకటితములై నిలచిపోయిన వాని ముద్రణ కార్యక్రమమును తిరుమల తిరుపతి దేవస్థానముల పాలకవర్గమువారిచే ఆమోదింపజేసి నిర్విరామముగా సాగునట్లు చేసినవారు శ్రీ శాస్త్రిగారు. అంతేకాక ప్రతివర్షము అన్నమాచార్య వర్ధంతిని తిరుపతిలో జరుపుటకై పునాదివేసిన వారుకూడ శ్రీ ప్రభాకర శాస్త్రిగారే.

శ్రీ శాస్త్రిగారి మాట యెడగల గౌరవమూ, ప్రమాణము కారణముగా అప్పటి దేవస్థానము ఎక్సిక్యూటివు ఆఫీసరు, నేటి ధర్మకర్తలమండలి అధ్యక్షులు, శ్రీ. శ్రీ. చెలికాని అన్నారావుగారి యాదరము దేవస్థానమువారు పురావస్తుశాలయమును గూడ స్థాపించునట్లు జేసినవి. 1950 వేసవిలో విధివిరామ మెఱుగక పలనాటి సీమలో మ్యూజియము వస్తువుల సేకరణమునకై తిరుగుట కారణముగా శాస్త్రి గారికి తీవ్రమగు జ్వరము వచ్చినది. అప్పటికే వారి యారోగ్యము పూర్తిగా చెడినది. తమ యోగ మాహాత్మ్యమున వారు పలువురను మృత్యుదంష్ట్రల నుండి వెలికి లాగినారు. అట్టివార మనేకులము వారిచుట్టు నుండినాము. కాని వారిని దక్కించుకోగల శక్తి మాకేదీ. . . ఆ హఠాద్వార్తను విని పూజ్యులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు "తుదకు నిన్నే జయించె మృత్యువు మహాత్మ"- అని వగచినారు -

"అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా
చక్షురున్మీలితా యేన తస్మై శ్రీ గురవే నమః"

అన్న ఆర్యోక్తి మా గురుపాదులు శ్రీ ప్రభాకర శాస్త్రిగారి యెడ అక్షరాక్షరమూ నిజము - అది అనుభవించిన వారికే తెలియును- ఆ మహాత్మునకు అంజలి.

"మనసు నిర్మలమై మనిషిగా పెరిగినవారే మహాత్ములు;
వారి కోవలోనివారే శ్రీ ప్రభాకర శాస్త్రిగారు."



# కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి

- అమరేంద్ర

తమ మొదటి నవల " అసమర్థుని జీవయాత్ర " ను తండ్రిగారికి గోపీ చంద్‌గారు అంకితం చేశారు. " ఎందుకు అని ప్రశ్నించటం నేర్పినందుకు" కృతి సమర్పణ చేశానని ఒక్క వాక్యంలో తండ్రిగారి గొప్పతనాన్ని సూత్ర ప్రాయంగా వెల్లడించారు ప్రతిభాశాలి గోపీచంద్.

రవీంద్ర గురుదేవులు అన్నట్లు ఆలోచనా స్రవంతి శుష్కమైన ఆచారాల మరుభూమిలో ఇంకిపోవటం భారత జాతికి గొప్ప విపత్తు. మత్తు నిద్రలో మను షులు మునిగి వున్నప్పుడు ఒక్క కుదుపు కుదిపి కళ్లు తెరిపించి ముందుకు నడిపించటం, ఇదంతా ఏమిటి, ఎందుకు అని ప్రశ్నించటం నేర్పటం కవి వైతా ళికుల కర్తవ్యం. తరతరాలుగా చీకట్లు ముసురుకున్న మనోమందిరాలలో ఆలోచనా దీపిక వెలిగించిన మేధావి కవిరాజు రామస్వామి.రాజా రామమోహన్ రాయ్, వీరేశలింగం, దయానంద ప్రభృతుల కోవకు చెందిన సంస్కర్త ఆయన. కత్తిపోటును మించిన కలం పోటుతో సాహిత్యరంగంలో విక్రమించిన కవివీరుడు. ఉక్కుగుండెలతో "దీక్షారథమున్ మరల్పక కళాశాస్త్రమ్ము చూపించిన" ధీరుడు, కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి.

ఆయన 1887లో జనవరి 15వ తేదీన అంగలూరు గ్రామంలో జన్మిం చారు. కృష్ణాజిల్లా గుడివాడ తాలూకాలో చరిత్ర ప్రసిద్ధమైన గ్రామం అంగలూరు. ప్రతాపరుద్రుడు కాకతీయ వైభవాన్ని చాటిస్తూ క్షేత్రయాత్రకు బయలుదేరి వచ్చినప్పుడు అంగలూరులో కొన్నాళ్లు మకాం చేశాడు. ఓరుగల్లుకు తిరిగి వెళ్లే

ఓప్పుడు తనకు నమ్మిన బంటుగా వున్న శంభుని ప్రాంతీయ సేనానిగా నియమించి పెత్తనం అప్పగించాడు ఆ శంభుడే త్రిపురనేని వంశానికి మూలపురుషుడు. ఆయన నందివాడ గుడివాడ కౌతరం గ్రామాలలో శివాలయాలు నిర్మించి చక్కగా పరిపాలన చేసి ప్రతాపరుద్రుని ప్రశంసలు పొందాడు. త్రిపురనేడు అనే బిరుదును ప్రతాపరుద్రుడే శంభునికి ప్రసాదించాడు. ఆయనను ప్రశంసిస్తూ కవిరాజు ఇల్లా అన్నారు:

"శాశ్వత శివాలయ ప్రతిష్ఠాత, యగ్రహార సంప్రదాత, విమల వారిపూర్ణ తతతటాక నిర్మాత, యుద్యాన వన విధాత, ఎత్కాల త్రాత ముత్తాత తాత"

తాతగారు గోపాలయ్య. తండ్రి వెంకయ్య, తల్లి రామమ్మ. "రౌద్రరస మూర్తి శౌర్యసముద్రుడు, అద్రి ధీరుడు, అక్షుద్ర వితరణ దేవతాద్రుమమ్ము మహిత భద్రమూర్తి, పుణ్యకీర్తి" అని జనకుని ప్రస్తుతించారు. "ప్రేమమయాత్మ, సాధ్వీమణి, ధర్మమూర్తి, జననీమతల్లి" అని మాతృవందనం చేశారు కటగొట్టు బిడ్డ కాబట్టి ఆడింది ఆటగా పాడింది పాటగా అల్లారు ముద్దుగా పెరిగాడు బాల రామస్వామి.

"అలకలు దీర్చి కొంపె తన మ్రాన్పె యొనర్పగబోకు మంచు నా
యలుకలు దీర్చి చెప్పి మనసారగ సాకుచు బద్ధరాగులై
కలకలు లేక వర్తిలిన గణ్యుల నా తలిదండ్రులన్ దనూ
పులకలుగా నుతించెదను బుణ్యుల చల్మయ రామమాంబలన్"

అని వాత్సల్యమూర్తులను నిరంతరమూ స్మరించేవారు

ఆయన అక్షరాభ్యాసం అంగలూరు వీధిబడిలో మంగయ్యగారి వద్ద జరిగింది చదువు కూడ ఒక ఆటగానే సాగింది. తనయుడు ఇంగ్లీషు చదువుకొని గొప్పవాడు కావాలని తల్లి రామమ్మగారి ఆశయం. అ ప్రకారమే గుడివాడలో బందరు హిందూ హైస్కూలులో పిమ్మట నోబిల్ కాలేజీలో ఆయన విద్యావ్యాసంగం కొనసాగింది. హైస్కూలులో చదువుతున్న సమయంలో చెళ్లపిళ్ల

వెంకట శాస్త్రిగారి శుశ్రూషవల్ల కవితా ప్రావీణ్యం అలవడింది మెట్రిక్యులేషను పరీక్షకు చదువుతున్న ప్రాయంలో "కారెంపూడి కదనము" "రాణాప్రతాప్" అనే చరిత్రాత్మక నాటకాలు రచించి దేశాభిమానమూ, జాతీయ చైతన్యమూ ప్రకటించారు. తరవాత 1911లో కురుక్షేత్ర సంగ్రామమనే పౌరాణిక నాటకం రాశారు. ఆ సమయంలోనే అష్టావధాన ప్రదర్శనలు కూడాచేసి గురువిరోధులైన కొప్పరపు కవుల మీద సవాలుచేశారు. ఆటలలో మేటిగా క్రీడారంగంలో కూడా ప్రఖ్యాతి సంపాదించారు.

కవితావ్యాసంగంవల్ల ఇంటర్మీడియట్ పరీక్షలో విజయం పొందలేదు. బి. ఏ. చదవటం కష్టమనీ అనవసరమనీ తోచింది. ఫస్టుగ్రేడు పరీక్షకు చదివి ప్లీడరు పరీక్షకు కూచుని న్యాయవాదియై స్వతంత్రవృత్తితో ధనార్జన చేస్తూ కవితా వ్యాసంగం కొనసాగించ వచ్చునని తీర్మానించుకుని బొంబాయి వెళ్లారు. కాని పరీక్షలో నెగ్గలేదు. ఎల్లాగైనా న్యాయవాది కావాలనే పట్టుదలలో బారిస్టరు పరీక్షకు విదేశాలకు వెళ్లాలని నిర్ణయించుకున్నారు.

1914లో పాస్‌పోర్టు వచ్చింది. పెద్దన్నగారు గోపాల కృష్ణయ్యగారి ప్రోత్సాహంతో ఐర్లండు వెళ్లి మూడు సంవత్సరాలు విద్యావ్యాసంగం చేసి బారిస్టరు పట్టం సంపాదించారు. అప్పుడు ఐరిష్ ప్రజలు స్వాతంత్ర్య సముపార్జన కోసం సాగించిన సిన్‌ఫిన్ వుద్యమాన్ని కళ్లార చూశారు. అక్కడవున్న సమయంలో భారతీయతకు చిహ్నంగా తలపాగా ధరించి ఆత్మగౌరవమూ, నిర్భయ నిశ్చల వైఖరీ ప్రదర్శించి జాతిప్రతిష్ఠను నిలబెట్టారు.

1917వ సంవత్సరములో నవంబరు 11వ తేదీన స్వదేశానికి తిరిగి వచ్చారు. బారిస్టరుగా బందరులో ప్రాక్టీసు ప్రారంభించారు. తరవాత 1922లో తెనాలికి వచ్చి 1943 జనవరిలో కన్నుమూసే దాకా అక్కడే తమ బహుముఖ కార్యకలాపాలు కొనసాగించారు. తెనాలి మున్సిపాలిటీకి చైర్మనుగా మూడుసార్లు ఎన్నికైనారు. ఎనిమిదేళ్లు చైర్మను పదవిని అలంకరించి అన్ని వర్గాల ప్రజల

తోనూ సన్నిహిత సంబంధం ఏర్పరచుకున్నారు జంతుబలులూ జాతరలూ నిషేధించారు. సూతాశ్రమం స్థాపించి సంఘసంస్కరణ కార్యక్రమాలను నిరాటకంగా నిర్వహించారు.

రామస్వామిగారు మూడుసార్లు వివాహం చేసుకున్నారు. పున్నమ్మ, చంద్రమతి, అన్నపూర్ణమ్మ గార్లు అర్ధాంగులు. మొదటి భార్య సంతానం ప్రఖ్యాత రచయిత గోపీచంద్. అతిథులతో, మిత్రులతో, ప్రాయాలు వేరైనా అభిప్రాయాలు ఏకమైన శిష్యులతో సూతాశ్రమం కలకలలాడుతుండేదట.

మొదట జాతీయవాదిగనూ, తరవాత జస్టిసు పార్టీ మనిషిగానూ, కొన్నాళ్లు కాంగ్రెసువాదిగానూ, మళ్లీ జస్టిసుపార్టీ అభిమానిగానూ రాజకీయ సిద్ధాంతాలలో పరివర్తన పొంది చివరికి కవిరాజు హేతువాదిగా, మానవతావాదిగా పరిణమించారు. గజారోహణం వంటి ఘనమైన సన్మానాలు అందుకొన్నారు సాహిత్య మర్మజ్ఞులైన దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు ఎంతో సముచితమైన కవిరాజు బిరుదు ప్రసాదించారు.

హేతువాదిగా సంస్కర్తగా రామస్వామి చౌదరిగారిని గుర్తించినంతగా కవిరాజుగా ఆయన ప్రతిభను గౌరవించటం లేదేమో అనిపిస్తుంది. మెదడును పదును పెడుతుందికాని హృదయాన్ని కదలించి ఉర్రూతలూగించదు ఆయన కవిత. భావకవులకు సమకాలికులై జన్మించిన క్లాసికల్ కవి ఆయన. సాహిత్యాన్ని ఆనందంకోసం కాక సంఘ శ్రేయస్సుకోసం మానవ కళ్యాణంకోసం శక్తిమంతమైన శస్త్రంగా ప్రయోగించిన మేధానిధి. చెప్పదలచుకున్న విషయాన్ని సూటిగా ధాటిగా ప్రకటించగల ధీశాలి. "సమస్తలోక మంగళకరమైన సత్యమును కమ్మని వాక్కుల నిర్భయమ్ముగా పలుకు" కవిత్వ విశారదుడు.

ఆయన అభిప్రాయాలతో ఏకీభవించని వారు కూడా కవిరాజు పాండిత్య వైభవాన్ని, వాదకౌశలాన్నీ, కొనియాడి సూతపురాణమొక మహాగ్రంథమని సగౌరవంగా పేర్కొన్నారు. హేతువాద యుగానికి ఆదిపురుష డన్నారు.

ఆయన "భగవద్గీత"లో వ్యంగ్యోక్తిని అత్యంత ప్రతిభావంతంగా వాడుకున్న మహాకవియని, ఈ రచన సంస్కృత గీతకు ఏ విషయంలోనూ తీసిపోదని శ్రీ పాదకృష్ణమూర్తి శాస్త్రిగారు శ్లాఘించారు. "గీతను అలా సెటైర్ చేయటం, పల్నాటి చరిత్రను జోడించి తెలుగుతనం తేవటం, ఆ రెంటి సామ్యాలనూ హత్తించటం, ఆ భాష, ఆ పద్యాలు అన్నీ అపూర్వం" అన్నారు జంటసూత్రం దక్షిణామూర్తి శాస్త్రిగారు.

అభిప్రాయాలను ఎడంగా పెట్టి కవిత్వంలో ఆయన సాధించిన ఘన విజయాన్ని గ్రహించాలంటే సూత పురాణగ్రంథంలో నాలుగు ఆశ్వాసాలలో ఎన్నో సన్నివేశాలున్నాయి. పద్యరచనలో ఆయనకున్న అసాధారణ నైపుణ్యం, శబ్దం మీద ఆయన సాధించిన అపారమైన అధికారం కవిరాజు నిజంగా కవిరాజే అని నిరూపిస్తాయి. ప్రబంధ కవుల శబ్దాలంకార వైభవమూ, శివకవుల జాను తెనుగు తీయదనమూ, వాస్తవదృష్టితో సాగే వర్ణనా విశేషమూ కొత్త సొగసులు దిద్దుకుని ఆయన పద్యాలలో తొంగి చూస్తున్నాయి.

"కడలు చేయని కోడెలు కాలుద్రవ్వి
మోరవంచి ఱంకెలిడ, మార్మోగ దొడ్డి
కట్టుకారు పెయ్యలు తోకలట్టె యెత్తి
మెడలు సారించి మూచూచు మేతమాని"

తలగల మోపు, చిక్కములు దామెనలున్ మొగముట్టు చుట్టలున్
బలుపులు కట్టుగుంజ గుదబండలు, పెన్ సెలకోల కట్టలున్
బలు తలత్రాళ్లు, మువ్వ మెడపట్టెలు, బందము, లెన్ని యేనియో
కలిగిన నంద గోష్ఠములు కన్నులపండువు సేయు నిత్యమున్"

అన్న వర్ణనలో కృష్ణాజిల్లాలో సంపన్నులైన పెద్ద రైతుల పశువుల శాలలు కళ్లలో మెదులుతున్నాయి.

నందనోద్యాన వర్ణనం ఎంతో రమణీయంగా హృద్యంగా చేశారు వసు చరిత్రను జ్ఞాపకం చేస్తూ.

"ఒక వంక వీక్షింప నుత్ఫుల్ల సౌవర్ణ
పంకజాత పరాగ పంకిలంబు
ఒక చాయ గనుగొన్న శుక శారికానీక
కోకిల కాకలీ కూజితంబు
ఒక క్రేవ కనుగొన్న వికచ మందార పు
ష్ప మరంద గురు ఝరీ ప్లావితంబు
ఒక కోన బరికింప నురు వేపథుః గ్లాని
సంహారక సమీర చాలితంబు

మధుర వేణు వీణాగాన మండితంబు
స్వైరకేళీ సహారిణీ సంకులంబు
విట విటీ నటీ నట పరివేష్టితంబు
నందనోద్యాన మానంద మందిరంబు"

అన్న పద్యం చదివితే ప్రబంధ కవులంతా అసూయ పడతారేమో అనిపిస్తుంది.

"కాలియందలి యందెలు గల్లురనగ
జిందు ద్రొక్కుచు దన తల్లి చేతికోల
గాంచి కల్లారి కన్నీరు గాంచునట్టి
నవ్య నవనీతచోరుడు నాకు దోచె"

అన్నప్పుడు యశోదా, దొంగ కన్నీరు కార్చే కృష్ణుడూ బొమ్మగీసినట్లు కనిపిస్తున్నారు. ఎంతో పొదుపుగా ఎంచుకున్న పదాలతో ఎంత చక్కటి చిత్రం అందించి Poetry is speaking painting అనే వాక్యం నిజమనిపిస్తున్నారు.

"ఈరేడు జగములకీ రేడు తగువాడు
వేరేడు తగడన్న పేరుగాంచె
చదువుసాములు నేర్చి చదువు సాములనేర్చు
చదువుసాములనేర్చు చతురుడయ్యె"

అనే సీసపద్యంలో రావణుని వర్ణించిన పంక్తులు చదువుతుంటే చేమకూర వెంకట కవే రాశాడా అని ఆశ్చర్యం కలుగుతుంది. శ్లేషచమత్కారం అప్రయత్నంగా సరళంగా సాగింది.

"మాతృభాష వలని మమకారమును జేసి
తెలుగుబాస జదివి దేశికవిత
నుడుల కూర్పునేర్పు నోరూరునట్టుగా
బలుకనేర్చు వారె తెలుగు కవులు" అని జానుతెలుగుమీద

మక్కువ వెల్లడించారు.

"చదల దాకు మ్రాని మొదలు కుదులు పొదల
మెదల తుమ్మెదల రొదలు కదలు నదులు
విదులు క్రొందావి విరిగుత్తి పదులు పొదలు
మొదలు తుదిలేని ముదిగొంద మొదలు గంటి"

అని తేటతెలుగుతో పద్యం నడిపి వెంటనే సందర్భానుసారంగా మూడు పాదాల సంస్కృత ప్రౌఢ సమాసంతో హిమవత్పర్వత ప్రాంతారణ్యాలను "గోలాంగూల లులాయ సూకర" అనే శార్దూల వృత్తంలో, వర్ణించి ఔచిత్యం చాటుకున్నారు. సన్నివేశానుగుణంగా శైలిని మార్పు చేయటంలో గొప్ప నేర్పు చూపించిన కవిరాజుకు అచ్చతెనుగులోనే రాయాలనే పట్టింపు లేదు. ఆయన వాడే జాను తెలుగు చదువరిని బాధపెట్టదు సాధారణంగా.

సాంఘిక వ్యవహారాలలో నియమ నిబంధనలను ధిక్కరించిన కవిరాజు సాహిత్య విషయాలలో సంప్రదాయానికి అత్యంత విధేయులుగా వర్తించటం నాకు ఆశ్చర్యంగా వుంటుంది. ఈ వైఖరి ఆయన వచన రచనలో మరీ విడ్డూరంగా కనబడుతుంది. మరీ అంత వీరగ్రాంథికం కాకుండా సరళ గ్రాంథికం రాసినా బాగుండేదనిపిస్తుంది. కాల ప్రవాహానికి ఎదురీదాలనే పట్టుదల ఆయన గద్యంలో నన్ను కరుస్తున్నట్లుంటుంది.

రామస్వామి చౌదరిగారి సాహిత్యం పురాణంగా వెలువడినా, శతకంగా వెలసినా, నాటకంగా వెలసినా ఏదో ఒక లక్ష్యం కోసం ఒక ప్రయోజనంతో రచించినదనే విషయం గుర్తుపెట్టుకోవాలి.

"లోకులు దిట్టిన నిజమే
వాకొనగా కలము చేతబట్టిన వాడన్
లోకుల ఇష్టానిష్టము
లా? కవిలోకంబు కలము నాకట్టంగన్"

అనే విశ్వాసం. సత్యం పలకాలనే దీక్షగలవారు జీవితంలోనూ సాహిత్యంలోనూ అగ్రగాములవుతారు.

ఎవరూ తోడురాకపోయినా పిలుపు అందుకుని వెంట నడవకపోయినా తమ లక్ష్యం దిక్కుగా ఒక్కరే సాగిపోగల ధీరులు వారు. చరిత్రను వారే సృష్టించగలరు, "పాడిన పాటనే మరల పాడెదవ, కూడిన భావమే మరింకూడెదె" అంటూ గాడిని వదలక చర్విత చర్వణులైన ఆంధ్ర కవిప్రపంచంలో కవిరాజు క్రొత్తగొంతు విప్పి "నూతనాంశ మేదో యొకటేని యుం దెలుపనోపని గ్రంథ సమూహ మేటికో?" అని హెచ్చరించారు. క్రొత్త వెలుగును భరించలేని కళ్లు వుంటాయని గుర్తించారు. హేతువాద దోరణితో తాను చేసిన విమర్శలను "కాంచినంతనే యోజన సేయకూని పరుషోక్తులకున్ దిగకద్దు తొందఱన్" అని అర్థించారు.

"మనసు నచ్చునెడల మన్నింపగావచ్చు
మనసు నొచ్చునెడల మానవచ్చు
గాని వివర మేమి కనకుండ వినకుండ
ఐదుల బ్రువ్వఁదిట్ట ఫలము కలదె?"

అని ప్రశ్నిస్తూ ఆలోచించుకోమని హేతువాదికుండవలసిన సహనాన్ని నిరూపించుకున్నారు. సహేతుకంగా లేని ఆచారాలనూ విశ్వాసాలనూ నిరసించారే కాని నీతి నిజాయితీలను ఎన్నడూ కాదనలేదు.

"పిట్టకథలకు నివియెల్ల పుట్టినిళ్లు" అనే అభిప్రాయంతో పురాణాలను నిశితమైన తార్కిక దృష్టితో పరిశీలన చేశారు. ఈ పరిశీలనకు అక్షర రూపాలు సూతపురాణం, భగవద్గీత, శంబుకవధ, ఖూనీ. కేవలం శబ్దచమత్కారాలతో మనోరంజనం చేయటానికి అలవాటుపడిన మన పద్య కవిత్వానికీ అసాధారణ మేధాశక్తీ తర్కబలమూ సంతరించారు. చిత్తశుద్ధితో స్పందించే హృదంతరాళం నుంచి ప్రతిపాదమూ నయాగరా జలపాత లాగా దూకుతూ లావాలాగా సెగలు చిమ్ముతూ ఎగసి వస్తుంది. నగారాలాగా ఖంగున మోగుతుంది.

ఆంధ్రసాహిత్యంలో మానవతావాద ప్రతిపాదన చేసిన మహాకవి రామస్వామి చౌదరి. మానవ కళ్యాణం మనసారా కాంక్షించి కృషిచేసే వారందరూ మానవతావాదులే. రామమోహన్‌రాయ్, వివేకానందస్వామి, రవీంద్రకవీంద్రుడు, గాంధీమహాత్ముడూ ఆస్తిక దృష్టితో దీనమానవులలో మాధవుని దర్శించి సేవించిన మానవతావాదులు. కాని పాశ్చాత్య భావ ప్రభావితమైన మానవతావాదం నాస్తిక సిద్ధాంతంతో ముడివేసుకుంది దేవుని తోసివేసి Man is the measure of all things అని చాటుతూ జీవితరంగంలో మనిషికే ప్రాధాన్యమిచ్చి మానవుడే నా సంగీతం మానవుడే నా సందేశం అని గొంతెత్తి చాటుతుంది. రష్యా విప్లవాన్ని గురించి వ్యాఖ్యానిస్తూ ఖూనీ నాటకం పీఠికలో "గుడులన్నియు యంత్రాగారములుగనూ పుస్తకభాండాగారములుగనూ మారిపోయెను. ఈమార్పు వల్ల రష్యాదేశమునకు కలిగిన ఫలమేమి? నూటికి డెబ్బది మందికి తినకూడును కట్ట బట్టయు, పండ మంచమును, సాపడ కంచమును లభించినవి. పురుషకారమప్రతిహతమగు అధికారమును చెల్లించుకొనుచున్నది" అన్నారు. అప్రతిహత పురుషకారం, ప్రజల సంక్షేమం ఆయన మానవతావాదానికి లక్ష్యాలు. అందుకే దేవుణ్ని పీఠం మీదినుంచి దించివేసారు.

సకల సృష్టికీ మానవుడే మకుటధారి అనే విశ్వాసం మానవతావాదానికి ప్రాతిపదిక. "నేను ఆలయాన్ని నిర్మిస్తే అందులో మానవుని ప్రతిమనే ప్రతిష్ఠి

స్తాను మానవుడే నా దైవం" అంటాడు వాల్టు విట్మన్ కవిశేఖరుడు. ఆ ధోరణి లోనే చౌదరిగారు "శంకరుని యత వేదాంత శాస్త్రవేత్త యనియెగా 'అహం బ్రహ్మాస్మి' యనుచు గాన నాకు నేనె నమనస్సులొనర్చుకొందు నాది మధ్యాంత శూన్యుండ నైతి ననుచు" అన్నారు. నమస్కరించుకుంటున్న "నేను" అనే భావం పరిమితం కాదు. విశాల విశ్వ స్వరూపాన్ని తనలో ప్రతిఫలించుకో గలిగిన "నేను" అనే భవనానికి సంకుచిత స్వార్థప్రాకారాలు లేవుకదా!

సమస్త జీవరాశినీ ప్రేమాలింగనంతో గుండెలకు హత్తుకోగల కారుణ్యభావం మానవతావాదాన్ని మహత్తర శోభతో భాసింప జేయగలదు. అందు వల్లనే పరమ కారుణికోత్తముడైన బుద్ధ భగవానునికి ఎంతో భక్తితో వందనం చేశారు.

"భారత భూతధాత్రి తలభాగము సర్వము సొంత యిల్లుగా
నారసి, సర్వభూతములయందు సమత్వము విజ్ఞాల్చి, సే
వారమణీయ భూతదయ వర్ధిల జేసి ప్రపంచమందు బెం
పారిన బుద్ధదేవుని పదాబ్జము లొదల దాల్చు టొప్పదే!"

ఇటువంటి కారుణ్యభావం సేవాధర్మం మరిచిపోయి ఆడంబర భక్తితో గుళ్ళూ గోపురాలూ కట్టించే ఆధ్యాత్మిక ప్రదర్శకులను ఆయన నిరసిస్తారు.

"మలమలమాడు పొట్ట, తెగమాసిన బట్ట, కలంత పెట్టగా
విలవిల యేడ్చుచున్న నిరుపేదకు జాలిని జూపకుండ, ను
త్తలపడి పోయి జీవరహితంబగు బొమ్మకు నిల్లు వాకిళుల్
పొలయును పుట్టనిచ్చెడి ప్రబుద్ధ వదాన్యులను" ఆయన

ఏవగించుకుంటారు.

"చేసిన దోస మీశ్వరుని చింతనచే నశియించునన్న విశ్వాసము గల్గి రేబవలు పాప మొనర్చుచు, దీరినప్పు డేదో సమయంబునం గలము తొందరగా గొని" రామకోటిని రాసే కపట భక్తులను హేళన చేశారు. అంతేకాని మాన

జాతికి ఆదర పాత్రములైనటువంటి శాశ్వత సత్యాలను నిరాకరించలేదు. సర్వ మత సమ్మతములైన సత్య ధర్మ శాంతి ప్రేమలను దూరంగా తోసివేయలేదు. జుగుప్స కలిగించే అశ్లీల పురాణ గాథలను నిరాకరించారే కాని శాశ్వత ధర్మము లను అగౌరవించలేదు.

నశించే జగత్తులో నశించని వస్తువున్నదని ఉద్ఘాటించారు. ఇది కేవల భౌతికవాది ఒప్పుకోని విషయం.

"ఎది చరాచరంబయిన సృష్టికి సర్వము మూలకారణం
బేది మునీశ్వర ప్రతతికేని యగోచరమైన దొడ్డ వె
ల్గేది లయాంతమందయిన యించుక వైకృత మందకుండు, నే
తాదృశ నిత్య సత్య పరతత్వ మహత్తము నాశ్రయించెదన్"

అని పరతత్వాన్ని ప్రస్తుతించారు

"మంట లెగబ్రాకి బగబగ మండుచున్న
యగ్గిలో కూలినట్టి కాయంబు బూది
రాసియై పోవు నంతమాత్రంబ కాని
యాత్మయో చెక్కుచెదరక యట్టెయుండు"

అని బ్రహ్మనాయని నోట అమృతమైన ఆత్మతత్వాన్ని ప్రకటించారు.

"ప్రాణ పంచకమ్ము నంతరాత్మయు గూడ
నాత్మ జాత్మ జాతలైన భాతి
బుత్ర పంచకమ్ము పుత్రిక యొక్కర్తు
కాన్పుపంట యనగ గల్గిరందు" అన్న పద్యాన్ని బట్టి కూడా ఆత్మ ఉన్నదనే నమ్మకం వెల్లడి అవుతున్నది. నిర్గుణోపాసకులుగా కనిపించే కవిరాజును నాస్తికునిగా చిత్రించటం ఆయన అనుయాయులకు పరిపాటి అయింది.

అల్లాగే చౌదరిగారి సంస్కరణావేశాన్ని బ్రాహ్మణ వ్యతిరేకత అనటం కూడా వక్రభాష్యమే పుట్టుకవల్ల కులం. దాన్నిబట్టి సంఘంలో ఆధిక్యం వుండ రాదనే ఆయన వాదం.

"తండ్రి బ్రాహ్మణుడైన మాత్రంబుచేత,
బ్రాహ్మణుడు కాడు తత్తనూభవుడు, పుత్రః
అమల గుణకర్మ పరిహీను డయ్యెనేని"

అన్నారు.

బ్రహ్మవిద్యాసక్తి బహుభక్తి నెవ్వాడు
సతతమున్ యత్నముల్ సలుపుచుండు"

అంటూ బ్రహ్మ విద్యాసక్తి గలవాడే బ్రాహ్మణుడని ఛాందోగ్యోపనిషత్తు చెప్పిన దానినే ఆయన గట్టిగా నొక్కిచెప్పారు. ఈ అంశాన్నే రవీంద్రులు 'బ్రాహ్మణ్' అనే కథా కావ్యంలో సత్యకాముని జన్మవృత్తాంతం ద్వారా ప్రబోధించారు.

కారుణ్యభావం ఎంతవున్నప్పటికీ మానవతావాది సంఘర్షణనూ హింసనూ ఎదుర్కోక తప్పదు. చీకట్లు కొత్తవెలుగును ప్రతిఘటిస్తాయి అప్పుడు విధ్వంసమూ వినాశమూ తప్పవు. మానవతావాది నిర్భీకుడై తన ఆశయాలపట్ల స్థిర విశ్వాసంతో నిలబడాలి. ఆ ధీర గంభీర వాణిని బ్రహ్మనాయని కంఠంలో పలికించారు కవిరాజు.

"ఆత్మవిశ్వాస మడుగంటె నంతరించె
బ్రహ్మ ధీబల దోర్బల ప్రౌఢియెల్ల
బ్రతికి యుండెను జీవచ్ఛవంబు రీతి
దెలుగు జాతి పునస్సృష్టి వలదె చెపుమ"

అనే ఆవేశంతో ఆవేదనతో కలం పట్టారు. కాల స్వరూపులై విక్రమించారు పునస్సృష్టి చేయాలని. కలానికీ గళానికీ ఆలోచనకూ వివేచనకూ బిగించిన తరతరాల సంకెళ్లను సడలించి నవతనూ సమతనూ మమతనూ మానవతతో మేళవించటంకోసం తన కలాన్ని ఖడ్గంగా మెరిపించిన కవివీరుడాయన ఆంధ్ర జాతికి స్ఫూర్తిని ప్రసాదించిన ఆ మహాకవి ఆ మనీషి నిర్జర కీర్తికి మేరు సమాన ధీరమూర్తికి ఇదే నా అక్షరాంజలి.

# వేలూరి శివరామశాస్త్రిగారి ప్రతిభా వ్యక్తిత్వములు.

- మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి

అద్యతనాంధ్ర కవిప్రపంచ నిర్మాతలు తిరుపతి వెంకటకవుల విద్యా వంశ చూడామణి ఆయన ఎవరన్న ప్రశ్న లేదు ఆ నాల్గురోజులు సదస్సులకు పెండ్లిసందడి. గుంటూరు కళాశాల ప్రాంగణములో కోలాహలము. విద్వాంసులు విదుషీమణులు కవులు కళావిదులు యువకులు అధికారులు! అభిరూపభూయిష్ఠ మైన పరిషత్తు ఈ పిల్లవాని యవధాన మెట్లు సాగునో చూతమన్న మాత్సర్యదిగ్ధ హృదయాలుసు సభలో లేకపోలేదు.

వేలూరి శివరామశాస్త్రిగారి శతావధాన సాహసము ఆరంభమయ్యెను. విద్యు న్మాలా వృత్తములో కాశీ ప్రార్థన జరిగెను. అది మొదలు నాల్గునాళ్లు సభామంటపమున చంపకోత్పలముల సౌరభములు, ఆటవెలదుల నృత్యగీతాలు, మత్తేభాల వప్ర క్రీడలు, శాత్రవ భీకరమైన శార్దూలగతులు: గుంటూరు కళాశాల అవధాన కళా శాలగా పేర్మోగెను. 'అద్ధా వాగ్విబుధ మ్మహో వచన కవ్యాహార మాహా వచస్సిద్ధ, ఇ త్మని రాయలవారు చెప్పిన పద్యమును జ్ఞప్తికి తెచ్చు ప్రశంసోద్ఘోషలు. అనేక భాషా యుద్ధములలో ఆరితేఱి దేజిన వృద్ధమూర్తులు గురువులు వేంచేసియు న్నారు. నాఁటి యువ శతవధాని వయస్సు శద్ద్వావింశతి. చెళ్లపిళ్లవారి పరిభా షలో 'ఎఱుఁగడు పిల్లకాయ యెటులే నొనరించు శతావధానమున్'. 'గ్రహణధా రణ పటుర్బాలః'...అని వారి చమత్కారోక్తి.

19 1 సెప్టెంబరు 14వ తేదీ స్థిరవాసరము ఉదయవేళ ఉపక్రాంతమైన శతావధానమునకు నాల్గవనాఁడు రాత్రి 9 గంటలకు సమాప్తి మంగళము

రోజున కొక పాదము వంతుగా నూఱుగురు పృచ్ఛకులకు చెప్పి నాల్గవనాఁడు పద్యములన్నియు ధారణకు తెచ్చుకొని యొప్పఁజెప్పఁజలయుఁగదా! అప్పటి శతావధాని మేధ శతధారమై మంచి పదనుగా నుండును. ఆ రేయి జయారావములతో సభారంగము పొంగి నభోమండలమును ముట్టెను మహా ప్రతిభాప్రదర్శనము చేసి దేశికోత్తముల యానందాశ్రువులతో శిష్యుని ఉత్తమాంగము అభిషిక్తమైన యా సన్నివేశము. ప్రత్యర్థులను వాకట్టి అవధాన సామ్రాజ్యమున యౌవరాజ్య పట్టము కట్టించుకొన్న యా సంఘటనము, చరిత్ర చిరంటికి ధగద్ధగాయమానములైన చెవికమ్మలు.

అవధానానంతరము తొట్టతొలి దివాకర్ల తిరుపతి శాస్త్రిగారి అనురక్త కంఠమునుండి ఆశీర్వాద కల్యాణి యిటులు వినబడినది:

జగతీనాథులు పెక్కుమంది ముదిత స్వాంతంబునం గాన్క లం
పఁగ సాంగంబు సలక్షణంబుగ శరద్ద్వావింశతిం బేర్మి హె
చ్చఁగ మా యేలిన యీ వధాన కవితా సామ్రాజ్య భారంబు మో
యఁగఁ బూనం గదవయ్య, తండ్రి శివరామయ్యా! చిరంజీవివై.

అవనీదేవులు నిస్సమాన కవితా వ్యాపార పారీణ సం
భవ పీయూష రసాభిలిప్త లలిత వ్యాహార నీహారులై
యవలోకింప శతావధానమున మా కానందముం గూర్చి గౌ
రవమున్ నిల్పితివయ్య మా ఋణము తీఱన్ శిష్యచూడామణీ,

వెనువెంట, జగన్మోహనమైన చెళ్లపిళ్లవారి గళస్వరాశంసనము:

నీకున్ శ్రీయును ధీయుఁ గల్గుత! మఱిన్ నీ కంఠసారస్య మ
స్తోకంబై యలరారుఁ గావుత! నినుం దూలింపఁగా లేక దు
ర్ధీకుల్ గ్రామ్య శతావధాను లిఁక వ్యర్థీభావముం గంద్రుగా
కేకాకార యశంబు గైకొనఁ గదోయీ! ఛాత్ర చూడామణీ!

గుంటూరులో నాఁటి నాందీవాణి శివరామశాస్త్రిగారి జీవితములో వేళ్లుఁ గొల్చుగా పంటకు వచ్చెను ఆకాలము-ఈ శతాబ్ది ప్రవేశము- అది యొక యుగ. లోకజ్ఞులైన విద్వత్కవుల జంట కంఠములు అవధానకళకు యుగత్రయఖ్యాతి చేకూర్చిన రోజులు. యుగ మనఁగా జంట యన్న యర్థము ప్రసిద్ధము ఇద్దఱిద్దఱు కవగూడి యీ కళ ప్రదర్శించుటలో మనకు తెలియని సౌకర్య మొకఁడు వారికి లేకపోలేదు. పగలు చెప్పిన పద్యచరణాలు ఏ ఉషోవేళలోనో అవధాని పునశ్చరణము చేసికోవచ్చును. అట్టి తఱి సహపాఠి ధారణా పటిమ తనకుఁ గొంత తోడ్పాటు కావచ్చును. ఈ సౌకర్యము వయస్సులోనున్న మేధావికి అపేక్షితము కాదన్నచో సరి! మొత్తముమీఁద, తిరుపతి వేంకటకవులు, దేవులపల్లి సోదర కవులు, వేంకట రామకృష్ణకవులు, కొప్పరపు సోదరకవులు. రాజశేఖర వేంకట శేష కవులు... మరికొంత దూరము రాగా శేషాద్రి రమణకవులు... ఇటులు కవులు కవ కవగాఁ గూడుట అవధానకిరణమునకే అనలేము కాని, వీరందఱు అపుడో ఎపుడో అవధానము చేయకుండలేదని మన మెఱింగిన విషయము. శివరామశాస్త్రిగారిది ఆ యుగములోని పుట్టువు, జన్మతః శివుఁడు రాముడు జత గూడిన నామధేయము వారిది. నైసర్గికమైన ధీరత్వముతో అద్వితీయమైన మనీషా బలముతో సహాయనిరాకరణము చేసి అవధాన విద్యను ప్రదర్శించుటకు సంసిద్ధుఁ డాయెననఁగా శివరామశాస్త్రిగారి తత్త్వ మట్టిది. ప్రచండమైన మేధ. వ్యుత్పన్న మతిత్వముతోడి పెంకెతనము దేనిని పట్టిన దానిని సాధించవలె నన్న సత్యాగ్రహము బహుభాషలలో సాహిత్య పాండిత్యములే కావు; సంగీతము నాట్యము ఇత్యాది కళా రహస్యములు ఆయన కప్పటికే కరామలకములు జనావర్జనమునకు పద్యపఠనములో రాగమేళనము ఆనాడు కొందఱికే అందుపాటు కళ శివరామశాస్త్రిగారి పద్యగానములో రాగ పరిజ్ఞానము విశకలితముగా ద్యోతక మయ్యెడిది. తెలుఁగు పద్యము చదువుట యన్నది చెళ్లపిళ్లవారికి అది యొక పట్టు. దానికి "పొడుముపట్టు" అనురంజకము. ఆయన పద్యగానము ప్రాయశః మోహనలో. సీసాది పద్యములలో ఆరోహణావరోహణ సంగతులు. మధ్యమధ్య వ్యాఖ్యానములు. సామెతలు. ఈ హంగులతో వేంకటశాస్త్రిగారి పద్య

పఠన వాణి యనగా, అది యొక మేజువాణి. వేలూరివారి యొద్దను ఆ యొతు పులు కొన్ని విన్నవారున్నారు. ఇంతకు, శాస్త్రిగారిది గండుఁగోయిల గొంతు. అది సంగీత సాహిత్య సమ్మేళన వసంతమునకు సరివంతు. "నీ కంఠసారస్య మస్తోకంబై యలరారుఁగావుత" మని గురువు లిచ్చిన దీవఃమెచ్చు మనము విన్నదే.

వేలూరివారు 1911 సాలున గుంటూరు కళాశాలలో చేసిన శతావధానము మొదటిది యనుకొన్నచో 1924 లో తాళ్లపూడి యవధానము చరమమో, చరమ దేశీయమో: ఇది ఊహకాని, నిక్కచ్చిగా ఇదే యనుట కాదు. తాళ్లపూడి అవధానా రంభములో శాస్త్రిగారి నిట్టూర్పులు రెండు గుండెకు పట్టుకొన్నవి:

అవధానంబడ నూఱుమందికిని చేయంజేయఁ గొన్నాళ్లకున్
దవులొందెన్ విసు వంతకున్ బయిని గొన్నాళ్లేఁగ నస్మద్గురు
ప్రవరుల్ తిర్పతిశాస్త్రి దేశికులు పోవంబోతివా! నిన్ను నో
యవధానంబ! పునః ప్రతిష్ఠితము చేయంజూతు నే నియ్యెడన్.

తిరుపతి వేంకటేశ్వరులు దేశము నెల్లను ద్రిప్పిద్రిప్పి య
బ్బురముగ నాదు మూఁపునను మోపిన మోసితి, దానఁ జేసి దు
ర్భరమగు నుబ్బసంబు తన భారము మోపిన మోయుచుంటి; నే
బరు విఁక వీడనెంచెద; నెవండు కనంబడఁ డో వధానమా!

అది యటులుండె: ఒక్కొకరికి లోకమున వచ్చు ఖ్యాతి విలక్షణమైనది. ఏదో యొక లక్ష్యమును ప్రధానముగా సాధించుటకు ఒకఁడు జన్మించును. తద ధీనముగా అతని జీవనయాత్ర సాగుచుండును, జగత్తు వాని లక్ష్యమును తొందరగా గుర్తింపలేదు; దాని కంత యక్కఱయు లేదు ఆ విశిష్టవ్యక్తి జీవిత యాత్రలో ఆనుషంగికముగా ప్రదర్శించిన కొన్ని శక్తులకు లోకము ఆశ్చర్య చకిత మగును. ఓహో యని నలువురు చెప్పుకొందురు. అపుడు ఆ వ్యక్తి "పేరు గలవాఁ"డన్న పేరు పొందును. "వ్యుత్థానే శక్త య స్సమాధా వంతరాయాః"

శక్తి సమాధిని చెడఁదీయును. లక్ష్యైక చక్షుష్కులైన సమాహితాంతః కరణులు ప్రాసంగికమైన వింతమెఱపులకుఁ బరవశులు కారు. చెప్పవచ్చినది: మన శివ రామశాస్త్రిగారి సారస్వత సమాధి తత్కాలీనములైన గారడీంచే, పేరడీంచే విచలితము కాకుండుట. అది–ఆ జీవుని యదృష్టసిద్ధి

ఆంధ్ర సారస్వత చరిత్రలో నింత పేర్పడసిన శివరామశాస్త్రిగారు ఎక్కడివారు! ఎప్పటివారు! ఎంతటివారు! నేఁటి నా బదులు మాటలు తెలిసిన వారికి జ్ఞాపకములు. తెలిసికోఁదలఁచినవారికి దీపకములు.

కృష్ణామండలములోని నూజవీడుకడ నున్న చిరివాడలో వేలూరివారిది సిరిసంపదల కాలంబమైన కుటుంబము "కిలారములనుండి పాలిండ్లు కేతెర బహు ధాన్యములు చేలఁ బండి యొరఁగ' అన్న తెనాలికవి సీసములోని గార్హస్థ్యవైభవ సువర్ణమునకు ఆ సంసారము మూస. భగవద్భాషలోఁ జెప్పినచో శ్రీమంతము శుచిమంతమునైన గేహములో శివరామశాస్త్రిగారు యోగభ్రంశమునందిన వ్యక్తి. తల్లి విశాలాక్షమ్మగారి కటాక్షము కొమారుని భావవైశాల్యమునకు వైశికము. జనకులు వేంకటేశ్వరావధానలుగారు అనూచాన సంపత్తిగల గేస్తు. 1882 శివరామ శాస్త్రిగారి జన్మవర్షము తెలుఁగులో "నందనము". ఇక్కడ ఒక రహ స్యము బహిరంగ మగుచున్నది.

భావకవిత్వ మాధురీ దర్శనముతో ఆంధ్రావళికి రమ్యాలోకము నిచ్చిన రాయప్రోలు సుబ్బారావుగారొకరు, శిరీషపేశలమైన విమర్శనాత్మక సాహిత్య వచనమునకు కర్ణాటక గాంధర్వధారలు పాటింపఁజేసిన రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారొకరు, ఒకనాఁడు "సాహితీ సమితి" "నవ్యసాహిత్య పరిషత్" సంస్థ లను ప్రతిభావైభవముతో నడపి, గీతి నాటికా ప్రక్రియకు ఖ్యాతితెచ్చిన విద్వ త్తల్లజులు తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి–స్వామివారొకరు–స్వర్గీయులైన శివరామ

శాస్త్రిగారొకరు- వెరసి యీ నలువురు ఆధునికాంధ్ర సారస్వతమును "నందన ప్రసవములు"గా పరిమళింపజేసిన తెలుగు తోఁబుట్టువులు

శివరామ శాస్త్రిగారి అన్నగారు యజ్ఞనారాయణగారు స్వాతంత్ర్యోద్యమమున పాలుగొని కారాప్రవేశము చేసిన దేశభక్తులు. సోదరుడు చంద్రశేఖరముగారు అరవిందుని పూర్ణయోగ దర్శనములో భాగస్వామియై బహురచనలు చేసినవారు. చిన్ననాఁట మన శాస్త్రిగారికి ఆంగ్లము పాఠశాల చదువు మాత్రమే కాదు. ఆ వాఙ్మయములో ప్రసిద్ధమైన గ్రంథములు తలస్పర్శిగాఁ జదివెను. అలంకార శాస్త్రము, శాబ్దము ప్రత్యేకించి అధ్యయనము చేసిరి. చెళ్లపిళ్లవారి అభిజనమైన "ఇంజరము"లో మకాము పెట్టి ఆయనతో శతావధానపు మెలఁకువలు కవిత్వపుఁ బోలకువలు తెలిసికొనుట, జయంతి భగీరథశాస్త్రిగారి సన్నిధిని మహాభాష్యాధ్యయనము చేయుట జరిగెను. ఆ రోజులనాఁటి ముచ్చట యొకటి కోవిద గ్రామవృద్ధుల వలన వినవచ్చినది. సదాచారపరుడైన ఒక పేద వేదవిద్యార్థి పెండ్లి చేసికోదలఁచి ధనమునకు తడుములాడుచుండెను. శివరామశాస్త్రిగారు కనిపట్టి తన యింటఁగల బంగారునగ నమ్మివైచి ఆ పెండ్లికి వలసిన విత్తము ఆ విద్యార్థి కిచ్చిరి. ఆ ప్రతిగ్రహీత వివాహితుఁడై తరువాత సోమయాజియై కర్మిష్ఠి యయ్యెను. శాస్త్రిగారి ఔదార్యమున కిదియొక ఉదాహరణ కణము. ఆయన ఏకసంథాగ్రాహితలో ఒక చమత్కారమును గూర్చి వినవచ్చును.

ఏలూరులో మంత్రిప్రెగడ భుజంగరావుగారు జమీందారు; కవి; కవితాపోషకుడు. ఆయన కొమార్తెకు వివాహము జరుగుచున్నది. పెద్ద యెత్తుగడతో కవుల ఆశీర్వచన సభ ఏర్పాటు చేయఁబడెను. ఎందఱో యిగా విద్వత్కవు లందు పాల్గొనుటకు విచ్చేసినారు. సమ్మేళనమునకు ముందు ఒకరి పద్యము నొకరికి మిత్రులు వినిపించుకొను నలవాటుతో వడ్డాది సుబ్బారాయుడు గారి ఆశీర్వాద పద్యాలు శివరామశాస్త్రిగారి చెవిని పడ్డవి. సభ ఆరంభమైనది. కొందఱు పెద్దలు ఆశీస్సులు వినిపించినారు. శాస్త్రిగారు ఒక చిత్రము చేసిరి. తన పద్యములు రెండు వడ్డాదివారి పద్యాలు రెండు కోటించి వధూవరుల నాశీర్వదించిరి. తరువాత

దీవింపవలసిన సుబ్బారాయడుగారికి ఆబ్బురము మిగిలెను. ఆట్టి మనీషా నైశిత్యము నకు వశముగాని భాష ఏముండును!" ఒక్కభాష కాదు తక్కిన భాషల నన్నికూడ నేర్పుమయ్య యాంధ్ర!" అని ఆయన ప్రబోధము. శాస్త్రిగారి గ్రంథభాండారము చిరివాడలోనిది బ్రహ్మాండమంత. దానికై వారు వేలు వెచ్చించిరి. పర్ణశాల బీరువాల గ్రంథాల నడుమ జటాజూటాభిరామాకృతి శివదర్శనము.

వర్చస్వంతమైన మూర్తి, తప్తకాంచన శలాక తనూరేఖ. శరత్ స్వచ్ఛమైన చంద్రికోత్తరీయము కప్పకొన్న భావయోగి సందర్శనానుభవము అది.

ఏ యొకరుండు లేని యొక యేటి సమీపతలంబునం దర  
న్యాయతనంబునందును దటాక తటంబునయందుఁ దోఁటయం  
దాయత శైలశృంగమునయందు జనించు మహావనీజమం  
దూయెల యొండు నాసనము నొందును దప్పక నాకుఁ గావలెన్.

ఏకాంతవాసముపై శాస్త్రిగారికి "పేరాస". నిరుపహతి స్థలమ్మొ రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు ... బాపతు కోర్కెలకు, శివరామ శాస్త్రిగారి కాంక్షలకు రసభేదము లేకపోలేదు. కాఁగా, వారు చేసిన పద్యరచనలు కాని, వచనములు కాని సంఖ్యకు విడ్డూరములు కావు. ప్రతి రచనయు లెక్కింపదగినది. ధ్వనిప్రధానమైన వాగ్విన్యాసము పద్యములో మన వెనుకటివారు ఎన్ని యొకుపులు తీసికొనిరావలెనో అన్నియుఁ దీసికొని వచ్చినారు. ఇఁక, తియ్యమైన బియ్యారమైన రసప్రౌఢమైన చిక్కణ రమణీయమైన తెనుఁగు వచనమునకు వేలూరివారు వేసినది మేలుదారి. ఆయన గ్రాంథికపుఁబట్టు ఆశిథిలబంధము. వాడుకభాష అంటరాదన్న చుప్పనాతితనము ఆయనకు లేదు. నాలుగైదు "శరత్తు" నవలలు తెలిఁగించినవి యున్నవి. తీరని కోరికలు, సర్వేసు వీలునామా, బాపనపిల్ల, రాముని బుద్ధిమంతనం ... ఈ నవలలు వ్యావహారిక భాషలో వ్రాసినవే. ఏమి వ్రాసినను ఆయనదొక ప్రత్యేకపు ముద్ర యుండితీరినది. దార్శనికమైన వైజ్ఞానికమైన కొన్ని గంభీర విషయములకు ఆయన లక్షణప్రవణభాష ఉపయోగించెను.

ప్రాచీన భూగోళము-ప్రాచీన ఖగోళము-అనెడి శీర్షికలతో శాస్త్రిగారు వెలువరించిన పరిశోధన రచనలు 1947,48 సంవత్సరముల ప్రాంతమున "భారతి" చెక్కుటద్దములందు పరంపరంగా పత్రలేఖము దిద్దిన జాడలు రసజ్ఞుల చిత్తవీథులలో చెఱిగిపోలేదు. వేదపురాణాదులు, పాశ్చాత్య పరిశీలకుల కథనములు తఱచి తఱచి తీసిన వెన్న. భూగోళ ఖగోళ పరిజ్ఞాన స్ఫోరకములైన ఈ రచనలు "కవిః క్రాంతదర్శీ" అనుదానికి అపరోక్ష నిదర్శనములు. శాస్త్రీయమైన దుర్బోధాంశములు స్వాదువాక్యరసోన్మిశ్రము చేసి పిపాసువుల కిచ్చుటలో ఆయన లేఖిని యోగదండము. పరిణామవాదము- ఉనికి, ఎఱుక- ఆనంద త్రయము. . మఱి ఎన్నో యెన్నో వ్యాసములు! ఈ కథ యటు లుండఁగా. .,

•

ఈ శతాబ్ది తొలుతటి కాలము తెలుఁగులో "చిన్నకథ" కు వెలుతురు చూపిన కాలము. ఒక శతావధాని ఒక విద్వత్కవి కలము చిందులు కథానికకు చిన్నారి పొన్నారి నడకలు నేర్పిన సన్నివేశము స్మృతిచ్ఛాయకు వచ్చినది. తెలుఁగునాడు రెండువేలేండ్లనాఁడు గుణాఢ్యమైన బృహత్కథకు పురుడు మోసిన పుణ్యదేశము. మఱి, ఇటీవల వచ్చిన చిన్నకథ వేరు ఎక్కడనున్నది! నారు పోసినది యెవరు! నీరు పోసినది యెవరు! ఈ మీమాంస కిది తావుకాదు. ఒకటి మాత్రము సర్వాంగీకారము నందుట కభ్యంతర ముండక పోవచ్చును. వేలూరివారి రసలేఖిని కథానికా వల్లికకు సురభిళములగు పూలు పూయించినది; తియ్యని పండ్లు పండించినది; రసములు పిండి యిచ్చినది కొంత సంస్కారము గల తెలుఁగు చదువరుల తృష్ణకు అనాఁటి వేలూరివారి కథలు శరచ్చంద్రికలో విరితోఁట విందులు. పడమటి భాషా సారస్వతములలోని పోకడలు ఆయనకు ఆకళింతలోనివి. ఇరుగుపొరుగు రాష్ట్రి సాహిత్య ప్రక్రియలు అయనకు అవగాహితములు. వంగదేశ వాఙ్మయపు నిగనిగలు అపుడపుడే అగురు పొగలుగా తెలుఁగు వారికి ఘ్రాణతర్పణము చేయుచున్న రోజులు. వేలూరివారి భావుకత్వపు తూలికకు టాగూరుగారి అవిష్కార వర్ణవైఖరి పట్టుకొన్నది. ఆ ముహూర్తము తెలుఁగు వారి చిన్నకథల వెన్నెలసిరికి శరత్తు శాస్త్రిగారు కథానికలతో

మధురమైన కవిత్వరసము పోసెను. కవిత్వములో "ఏకావళిగా" "కథలు గాథలు" వ్రాసెను. ధ్వని ప్రమితము; రసభరితము; కథారచనలో ఆ వచోవిన్యాసము అనన్యలభ్యము వాక్యము రూపమునకు వామనము; భావమునకు త్రివిక్రమము. వస్తుగ్రహణములో అధునిక వైఖరి. కథాగమనములో ప్రత్యేకత. వర్ణనములో ప్రత్యగ్రత. పెక్కేల? నా చిన్ననాఁడు వేలూరివారి కథ యనఁగా, 'భారతీ' పఠితలకు ఒక వల. పక్షికి పైబడి యుండవచ్చు నన్న వారి కథలలో పదుమూఁడు మాత్రమే వావిళ్లవారు అచ్చుకొట్టించిరి. కథాష్టకము-కథాసప్తకము. రెండు సంపుటాలు. మిగిలిన కథా కర్పూరమును ప్రాఁత పత్రికల జీర్ణ పత్రములు పశ్లెములుగా మెల్లమెల్ల నివ్వాళిపట్టుచున్నవి.

ఈ సందర్భమున, పరిషదధ్యక్షులు శ్రీ గోపాలరెడ్డిగారితో ఒక మనవి. వేలూరివారి కథ లన్నియు ఏరించి ఒక సంపుటికి రప్పించి వెలువరించినచో కథానికా శాఖకు బలాధానము చేయుట యగునేమో! ఒక విధముగా ఈ పని జీర్ణోద్ధారరూపమైన మేల్సేఁతగా ఆలోచింప గోరుచున్నాను.

వేలూరివారి తొలికథ "కృతి". సృష్టి మొదలు సమాజ పరిణామ కథన సంక్షిప్తికి ఆవిష్కృతి (1912). వీథిబడి పూర్వపు బడులలోని చదువునుగూర్చి వ్యగ్యంధోరణి కథ. మాలదాసరి, వ్యత్యయము అన్నవి జాతికిఁగాక నీతికి గుణోన్నతికి ఉత్కర్ష చూపిన గొప్పకథలు.

దత్తు, క్షమాపణ, తన్మయత- ఈ కథలు మానవుని అమృతపుత్రత్వమునకు సముదాహరణములు. వారి కథకు ఆధునిక సమస్యలు ఉద్యమములు విరోధులు కావు. గాంధిమహాత్ముని గ్రామపునర్నిర్మాణ కార్యక్రమమును చేపట్టిన యువకుని గాథ "ఓబయ్య" అన్న కథ.

ఒకనాఁటి హైదరాబాదు ఆగడములను గూర్చిన కథ "నకల్ హైదరాబాదు"; "ప్రౌఢాపరివ్రాజక వివాహము" బాల్య వివాహములను అధిక్షేపించిన కథ. "అతిథి దేవుఁడు" భారతీయమైన ఆతిథ్యమునకు ప్రాతినిధ్యముగా నిలబడిన కథ.

పిత్తల్‌కా దర్వాజా, సుల్తానీ, ఓరి నాయనా! చీకటి తప్పు, పద్మాక్షి, వివాహబలి, డిప్రెషన్ - చెంబు, ఆచారము, వెలి, నమశ్శివాయ... వట్టిపేర్ల ఏకరువు పెట్టినచో ఏమైనట్లు! వారి ఒక్కొక్క కథ రసఖండము; కలకండము: భావభాండము.

"వ్యత్యయము" కథలోనిది, ఒక భాగము జ్ఞప్తికి తెచ్చుచున్నాను.

"పంటలు చక్కఁగా పండెను. పైరు వరిగి నేలమీఁద వాలుచున్న రామచిలుకదండు రెక్కలవలె నుండెను. పొగాకు మొక్కలు నన్ను కాల్పవలదు. అను చందముగ వెడందపాటాకులతో చేతులొగ్గి నిలువఁబడెను. తవిఁద యాకులు తమ లక్ష్మి యంతయు వెన్నులకిచ్చి దివాలాతీసెను... రేపు ఎల్లుండి కోయవచ్చుననగా భూతములలోఁ గల్లోలము పుట్టెను. గాలి చెలరేగెను. మబ్బులు క్రమ్మి తళిమితళిమి ఉరిమెను. పాములవలె మెఱపులు. ఫిరంగిగుండ్లవలె పిడుగులు. తుపాను. తనకూతురైన భూమిని జలము పెద్దపులివలె గ్రసించెను. జడముల కేటి పాడి: . . ."

"క్షమాపణ" యన్న కథలోనివి కొన్ని పంక్తులు:

"అపూర్వమైన కాంతిమండలము నా ప్రత్యవయవమును గుడికట్టెను. కపోల విన్యస్తమైన నన్నపుడు ధర్మారెడ్డి చూచినఁజాలును. నరోత్తమరెడ్డి చూడకున్నఁజాలును. అంచుమట్టముగాఁ దేనెవోసి రేకులుకుట్టివైచిన పూవువలె నేనపు డుంటిని. ఈశ్వరుడు నన్నొక సుఖపిపాస కాలవాలము కావించెను. నాలో నేనే దహించుకొని పోయితిని నాకీ జగతియంతయు నిస్సారముగా తోఁచెను. ధర్మారెడ్డి చిత్తరువేని లేనియెడల నామేడ చవుటిదిబ్బగా నుండెడిది. ఒకరేయి యంతయు నే నాచిత్తరువు నెదుట కూరుచుంటిని. కొంతసేపు దానితో వినోదించితిని. క్రమక్రమముగా నా కనులవెంట బాష్పములు స్రవించినవి. తెల్లవారులటులే కూరుచుంటిని. అవుడు మయూరము కొకటొకటి లేచి స్తంభమెక్కి కూయఁదొడఁగెను... నేను స్వప్నమున ధర్మారెడ్డికొక ఉత్తరము వ్రాసితిని.

వ్రాత కుపకరణము కలము కాదు. వ్రాత కుపయోగి-పిండి కాగితమును గాదు. ఇచ్చట నా మానసముమీద నన్ను కరగించి కరగించి కరకకాయ సిరా చేసి అక్షరములుగా పోసినది. అపుడు ధర్మారెడ్డి నాలో ఒక భాగముగా నుండెను గాన దానిని పఠించెను"

ఇటియు, వారి కథలలో సుకుమారమైన హాస్యము అయత్న వశ్యమై మెఱయుచుండెను. "ఊరి బడి" కథలో-

"రాజభక్తి కీర్తన లప్పటి కెవరును కనిపెట్టియుండలేదు. గురుభక్తి కీర్తనలు కలవుకాని అవి గ్రంథములందును వెత్తములందును మాత్రమే కలవు. ."

"నాగమ్మ కెనుబదియేండ్లు. ఆమె తన మగని నెఱుగదు. కాని తన మగని గురుతుగా క్రిందటి యేటివఱకు ఒకపండ్రెక ఉంచుకొనెను. నాగమ్మ తన మగని గురుతును విడిచి ఇతులు సనాతనమత మవలంబించిన నాటి నుండియు కొబ్బరికాయ యను పేరుదు వడసెను."

శివరామశాస్త్రిగారికి విశ్వమునం దెంత ప్రగాఢ ప్రవేశమో, వేదాంతమున అంతటి నిగూఢాభినివేశము. యథార్థమైన ఆయన కవిత్వం ఆత్మారామత సూరవరములో చిరివాడలో వాన ప్రస్థము చేయించినది ఆ భావతపస్వి మనస్సు నడివయస్సులో ఆధులకు గుఱి యయ్యెను. పిదప యేండ్లలో శరీరము వ్యాధులకు నిలయ మయ్యెను, అయినను, అవి వారి గంభీర ధీరమైన స్వాంతశ్చైతన్య సరస్సుమీద గాలితరంగల కదలికలు.

1928 లో, శాస్త్రిగారు ముప్పదినాల్గేండ్ల వయస్సులో నుండగా, చిరివాడలో వేలకొలది గ్రంథాలతో నున్న వారి ఆలయము కాలిపోయెను. జీవాణువులు ప్రాణకణములు నేత్రచుక్కలు కుమిలి కూలారిన అకాండ విలయవేళ వేలూరివారి గుండెలో శ్లక్ష్ణకుండము సలసలలు!

పెంచితి పెద్ద చేసితిని ప్రీతియుతంబుగ రాణివాస మం
దుంచితి రాజయోగ్య కుసుమోపవనంబులు గుమ్మరిల్ల ని

ర్మించితి విస్మరించితిని మేదిని మింటిని నొక్కపెట్ట న
ర్పించితి నిన్ను నగ్గికిని పెస్ బలిగాఁ గవితాసరస్వతీ!

కాల్చితి విల్లు సర్వమును గాల్చితి పాత్రము లూచముట్టుగాఁ
గాల్చితి వెల్లయున్ ధనము గాల్చితి వెల్లయు ధాన్యరాసులన్
గాల్చితి వృక్షవెల్లయును గాల్చనఁ గాల్చితికాక గ్రంథముల్
గాల్చిన నీకు నో జ్వలనః కడ్పుది నిండెనొ కాలు నిండెనో!

ఋగ్వేదమా! యష్టదిగ్విధులను నన్నుఁ
గనవెంత యదలితో గాలునపుడు
వేదాంతమా! నన్ను వీక్షింప యోగస్మృ
జ్మతి నెంత పూనితో మాడునపుడు
వ్యాకృతీ! యల యజ్ఞాగంతమౌ "దృశి" నెంత
వఱపితో నాకయి చరమవేళ
కవితా కుమారి: నిన్ గనుపొంటె నెన్ని ము
ఖాల దుఃఖించితో క్రాఁగు తటిని

కట్టః సాహితిరో నన్నుఁ గౌఁగిలింప
నెంత చేతులు చాఁపితో! యే మనందు
నన్నుఁ గంగాతమును జేసి చన్నవారె!
పుస్తకములార! విజ్ఞాన పుటములార!

ఈ గ్రంథాలయ హోమమునకుఁ జాలఁ బూర్వము వ ఱియొక విషాదము. 1919 ప్రాంతములో విదేశీయ గ్రంథావలోకన నైరంతర్యమువలన తెలుగు కవిత్వవిషయమున ఒకానొక పాఁప్లవ భావము శాస్త్రిగారిలో చోటు చేసికొనెను. యతిప్రాసములు విడిచి పద్యములలో మహాభారతము ఆది సభాపర్వములు తెలిగించిరి. కొన్ని శోక పర్యవసానములగు నాటకములును వ్రాసిరి. ఋగ్వేద ముక్కలు కొన్ని తెలుగునకుఁదెచ్చి వెనుదిరిగి చూచుకొనిరి. ఈ యూహ విప్లవము ఆయన యంతరంగముననే అంగీకారము కాలేదట. తరువాత నిబంధ ములు విడువక "మణిమేఖల" యను నేడాశ్వాసముల ప్రబంధము రచించిరి.

అప్పుడే రస గంగాధరము మొదటి ఆననము. ధ్వన్యాలోకము సంపూర్ణము, తెని గింప బడెను. పయి గ్రంథముల వ్రాత ప్రతులు పెట్టెలో పెట్టుకొని దివాకర్ల తిరుపతి శాస్త్రిగారి స్మృతిసభకై ఏలూరు వెళ్ళియుండిన సందర్భమున బసలో నున్న ఆ పెట్టె ధనాశతో చోరులు దక్కించుకొనిరట. ఈ విధముగా కొన్ని వ్రాత ప్రతులు పోయినవి. పద్మ పురాణము కొన్ని ఖండముల తెలిగింపు యోగవాసిష్ఠము నిర్వాణ ప్రకరణము వఱకు అనువాదము, సాంఖ్య న్యాయ వైశేషికముల భాష్యములు-మున్నగు వ్రాతలోని పొత్తములు తరువాత ధనంజయాధీనము లైనవి.

శివరామ శాస్త్రిగారి ధీరత్వ తితిక్షల కివి పరీక్షలు. వీనిలో నూటికి నూఱు మార్కుల యుత్తీర్ణత ఆయనను వరించె ననుటకు అనేక రసప్రవచనలు సాక్షి పత్రములై యున్నవి.

వారి వచనానువాదములలో "ఆత్మకథ" మేలుతరమైన రచన.

వేలూరి భావనావైఖరి ఎంత సనాతనమో, అంత అధునాతనము. సమ కాలమునందలి సమాజము ఉద్యమములు వ్యక్తులు ఆశయములు వారి ప్రేమభావ పరీవాహ సహానుభూతులకు పాత్రములు. 1949 జనవరి 8వ తేదీ మైలాపూరు "శ్రీబాగ్" లో "భారతీ" పత్రిక రజతోత్సవసభ జ్ఞప్తి చేసికోవచ్చును. శ్రీ శివ రామశాస్త్రిగారి అధ్యక్ష్యము ఆసభకు సువర్ణశోభ. సాహితీవర్గములన్నిటికి ఒక సరసమైన సమన్వితిని ఉద్బోధించిన వారి ముక్తకంఠము నేఁటికిని ఆలింపదగినది గానే ఉన్నది.

"నిక్కానికి నవీన సాహిత్యమంటూ ప్రాచీన సాహిత్యమంటూ రెండు సాహిత్యాలు లేవు. ఇవి విభక్తులగు సోదరులవంటివి కావు. కవలలుకూడా కావు. ఇవి ఒకటంటే ఒకటే. ప్రాచీనతా నవీనతలు కాలంవల్ల కలుగుతవి. సజీవమైన సమాజంలో నిరుటిసాహిత్యం ఈ యేటికి పాత చింతపండు. మన దేశంలోనే

మన భాషలోనే అభ్యుదయ పత్రికను చూడండి. ఈ పాతిక యేండ్లలో ఒక యేటికి మరొక ఏటికి "భారతి"నే చూడండి. ఎంత తేడా ఉందో!

సాంఘికాచారాలూ, రాజ్య పరివర్తనమూ, ఆయాయీ విప్లవాలూ, భావనా ఈ మొదలైనవాని ప్రాబల్యం సాహిత్యాన్ని పరిణమింప జేస్తూనే ఉంటుంది. జగత్తూ, ప్రతిదినమూ కాలముచే పక్వమవుతూ పరిణామం చెందుతూనే వుంది. దానితోపాటు సాహిత్యం పరిణామం చెందకపోతే కవుల చైతన్యమూ నిద్రాణమై ఉన్నదన్నమాట..."

ఇది ఆనాటి వేలూరివారి వైతాళిక వచనము. కాలదోషాలకు అతీతమై నేఁటికిని తెలుగువారికి దాని ప్రతిధ్వానమే శ్రూయమాణ మగుచున్నది. మఱొక విషయము: శతాబ్ది ప్రారంభమున అవతరించిన భావకవితోద్యమమును శాస్త్రిగారు సోపపత్తికముగా సమర్థించిరనుటకు "భారతి"లో ప్రచురితమైన వ్యాసము "భావకవిత్వము" చూడవచ్చును. ఋక్కులనుండి ఉపనిషత్తులనుండి ఉదాహరణము లిచ్చి "లిరిక్ పొయిట్రీ" తో సమరసత్వమును సముద్ఘాటించిరి. ఆలంకారికులు చెప్పిన భావధ్వని-రసధ్వని భావకవితారీతికి మూల ప్రాణమని పేర్కొనిరి. వేంకట పార్వతీశ్వరకవుల ఏకాంతసేవ, దేవులపల్లివారి కృష్ణపక్షము, తల్లావఝ్ఝులవారి హృదయేశ్వరి... ఈ సమకాలిక కవుల కావ్యములనుండి లక్ష్యములెత్తి మెచ్చికోలు పలికిరి. ఇచ్చట మన మనుకోవలసినది, వేలూరివారి విద్వత్తా భావుకత్వములకు వారి సహిష్ణుతా గుణము పైయెత్తు.

శాస్త్రిగారి ముక్తాలత (1910) కల్పిత కావ్యము. ఇందలి పాత్రలు ముగ్గురు. శముఁడు జయంతుఁడు ఇద్దఱు సహపాఠులు, చెలికాండ్రు. ముక్తాలత వార యువతి. శము దన్న వానిని ముక్తాలత కామించెను. జయంతుఁడు ముక్తాలతపై వలపు నిల్పెను. ముక్తాలతకు ప్రేమస్థానమైన శముని జయంతుడు చంపివైచెను. ఇఁక మన బ్రతుకెందులకని ముక్తాలత మడిసెను. ఆమెతో జయంతుడు

సహమరణము చేసెను. ప్రాణాంతకమైన యీ కథ పద్యకావ్యముగా శాస్త్రిగారు సంతరించిరి.

భారతీయ సంప్రదాయమునకు వేఱడముగా వారు కొన్ని స్వాతంత్ర్యము లిట్టుల ప్రదర్శించిరి. "మాధవశర్మ" యన్న నాటకము శోకావసానముగా (1920) వ్రాసి వెలువరించిరి. కృతక సూత్రము- ఖండకావ్యము (1910), బిడాలోపాఖ్యానము (1911) పద్యకథ. ఇవి యన్నియు నూత్న యౌవనము లోనివి, నిండు జవ్వనములోనివి సంతరింపులు.

శాస్త్రిగారి కలము కథారచనలో నెంత బలము చూపించెనో, విమర్శ నము నందును దాని కధికమైన పాటవము ప్రదర్శించెను. వేలూరివారిది బహిః ప్రమాణ నిదర్శనము స్వాంతరంగ సాక్షికమునైన విమర్శనము. "ఉత్తర హరి వంశ విమర్శనము" (1919) చిత్తగించినచో యుందురు. సోమన - ఎఱ్ఱనల కాలము వెనుక ముందులను గూర్చి తర్జన భర్జనలు రేగినవి. ఈ యుభయుల గ్రంథముల అనుకార్యానుకారి సంబంధపు తగవులాటలో దిగ్గంతులు కలుగఁ జేసికొనిరి.

"సోముని హరివంశమును ఎఱ్ఱన హరివంశమును పోల్చి చూచినచో ఎఱ్ఱన ననుసరించియే సోముఁడు వ్రాసెననుటలో సందేహము లేదు" అని రాళ్ల పల్లి అనంతకృష్ణశర్మగారి ఆలోకముకాఁగా, వేలూరివారి లోచనము- "నాచన సోముని ఉత్తర హరివంశమును ఎఱ్ఱాప్రెగడ హరివంశమును ఒకేమారు క్రమ క్రమముగా చదువుచు పోవఁగా సోమననే ఎఱ్ఱన అనుకరించినటులు నాకు తోఁచి నది." అని సూచించుచున్నది. ఈ ఐరావత పుండరీకముల అభిప్రాయము లిటు లుండఁగా, మఱొక సార్వభౌమము "హరివంశోత్తర హరివంశములు దేని కది స్వతంత్రము; దాని మొగము దీనికి, దీని మొగము దానికి తెలియనే తెలియ"దని కొట్టివైచెను. పరిశోధన విషయము నిర్బాధ మనుట కేనాఁడును వీలుండదు.

వేలూరివారి విమర్శము రసగర్భము;సమన్వయరీతి నిర్భరము పూర్వ రచనలు హరివంశము మున్నగువానికి వ్రాసిన పీఠికలు, మొన్నటి ఆంధ్ర ధ్వన్యాలోకము,

నాట్యవేదము, అనుభవసారము, శ్రీ రామకృష్ణ పరమహంస జీవితచరిత్ర ఇత్యాది కృతులకు వ్రాసిన విపుల భూమికలు చదువనగు వారికి శాస్త్రిగారి సచేతో హృదయ సంవాదము కొంత తెలియవచ్చును.

అరవిందులు, రామకృష్ణ పరమహంస, గాంధి, బుద్ధుడు, శంకరులు, కామకోటి స్వాములు, పుట్టపర్తి సత్యసాయిబాబా . . . మున్నగు నాఁటి నేఁటి అధ్యాత్మవేత్తలు యోగులు సిద్ధులు, మహాత్ములు, శివరామ శాస్త్రిగారి భావ తపస్వితలో విద్యుల్లేఖలుగా మెఱసియున్నారు. రామకృష్ణ పరమహంస భాషను గూర్చిన ఈ మాటలు వారివి తేనెయూటలు;

"శ్రీరామకృష్ణుఁడు కవి.- 'కవిం కవీనామ్'. పరమహంస పలుకు తత్త్వదృష్టిలో నెట్లు గురువాక్యమో కావ్యదృష్టిలో అట్లు రసవాక్యము. అది చీకటి కోణములో నెటులు వైద్యుత ఘర్షమో జాగ్రత్క్షేత్రములో నటులు ఆనంద వర్షము. ఉద్ధవుని చందముగా నీతఁడు పసగుర భాషలో బోధించును. ఆ భాషకు రెండు వైపులను పదను. అది రెండు చేతులతోడను రెండు కత్తులతో సాము చేయును. అది యెంత తేటతెలుఁగో అంత లోఁతువెలుఁగు. దాని మాహాత్మ్యము మెఱిఁగియే శ్రీ వివేకానందస్వామి కాదంబరి మొదలగు కావ్యముల భాషను నిరసించి తత్త్వప్రకాశమునకు వాడుకమాటల అక్కఱకు కన్ను తెఱచి చూపెను".

ఇటులు తాత్త్వికమైన దృష్టి శాస్త్రివారిలో మన మెటులు గమనింతుమో, అంత కంత వారిలో జాతీయ దృష్టియు సమకాలికోద్యమ ప్రీతియు పరికింప గలుగుదుము. 1948లో భోగరాజు పట్టాభి సీతారామయ్యగారిని గురించిన వారి ప్రశంస మఱువరాదు.

సూపెల్ కారులు నీవు వర్ధతరమున్ సూచింప నెవ్వారు నీ
పేరే పల్కి మహాసభాధిపతిగా వేంచేసి పట్టాభి సీ
తారామా! నడిపి ప్రజా అవి స్వాతంత్ర్య జ్యోతికిన్ జ్యోతివై
పారావార హిమాద్రి దీపితము యావద్భారత ద్వీపమున్.

జాతిన్ జాతిని మేలుకొల్పఁ గల భైషజ్యంబు నీ చేతిలో
చాతుర్యం బని పిన్నపెద్ద లెచటన్ శంఖంబు పూరించి నీ
నేతృత్వంబున నగ్నికుండమున నేనిం దూఁక సంసిద్ధు లో
సీతారామా! సుధైక భాండమునకుం జేకొంచుఁబో మ్మిందఱన్.

తెలుగుజాతి తెలుఁగుభాష శాస్త్రిగారికి పురస్కృతి పాత్రము లనుట మన మాటలతో చెప్పవలసిన యవసరము లేదు. వారే చెప్పిన పద్యము:

తెలివికి సంస్కృతమున్ మఱి
కలిమికి నాంగ్లేయమో యిఁకం దురకంబో
విలువ యిడి నేర్చి నీ
తెలుఁ గెవ్వరి పాలు చేసి లిరిగెద వాంధ్రా!

వేలూరివారికి వెండితెర తలంపులు కూడ ఉండె ననుటకు, జయాఫిల్మ్సు వారి "జరాసంధ"కు వ్రాసియిచ్చిన కథా సంవిధానము ముచ్చటగూర్చు తార కాణము. ఒకటేమి· ఆయన దేశకాలజ్ఞతకు మచ్చులుగా నెన్నియో చెప్పవచ్చును. కాని, వారి దృక్కోణము రసైక లోకమునకు ద్వారస్థానము. యౌవన ప్రవేశ ములో, ఒకప్పుడు కొప్పరపు కవులతో –

"అనిమిత్తంబుగఁ గాలుద్రవ్విన శ్వదీయాహంత నాఁపుందలం
పున నీ నీరస నిర్గుణాశుకవనంబున్ జెప్పి సిగ్గెవ్వ నెం
చిన యస్మద్గురువర్యులన్ సుకవిశా శ్రీధుర్యులన్ మానిపిం
చి నిసుం గెల్వఁగ వచ్చినా నిదె సభన్ జేయింతువో! వత్తువో!"

అని కజ్జా పెట్టుకొన్న ప్రకృతి –

నేనొక కవినని గానీ
నేనొక శాస్త్రంబునకును నిధివని గానీ
నే నసను నన్ను లోకుల
చే నవ్వింపంగ నేమి చేసితి చెపుడా!

అని తన సమ్మాన సందర్భములో లజ్జాళువై ముడుచుకొని యుండుట మనకు పెద్ద ఆశ్చర్యము కలిగింపదు. శివరామ శాస్త్రిగారిది మహాత్మ ప్రకృతి. పాండిత్యమునకు తగ్గ భావుకత్వము, సహృదయత్వమును మించిన సహిష్ణుత, సాధనమునకు దీటైన సమాధియోగము. లోకజ్ఞతకు సరిపడిన తత్త్వపరిజ్ఞానము. ఇన్నింటికి ప్రోవైన శతావధాని, కవి శిఖామణి, కథారచనా పరమేష్ఠి. శాస్త్రిగారు డెబ్బది యైదేండ్లు మాత్రమే భౌతికముగా విలసిల్లినటు లున్నను, తెలుగు వాఙ్మయమున వారొక ధ్రువస్థానము నందుకొన్న మహాపురుషులు. ఊరక, చారిత్రకులు లెక్క వేసికొనుటకు శాస్త్రిగారు 1892లో జన్మించిరనియు, 1967 మార్చి 17వ తేదీ ఉదయము బాలభాను మండలమున ప్రవేశించి రనియు వ్రాయుట!

'కథలు-గాథలు' అన్న కృతి సంపుటిలో, 'ఏకావళి' లో వేలూరివారి కవితాత్మ సాకార రసస్మృతిరేఖగా తెలుగువారికి మిగిలినది. 'పదములు' వారి వదన రంగమునుండి ఎట్లు ధ్వనించుచున్నవో వినవచ్చును.

వీణియపై చేయి వేయదు వాగ్దేవి
మా నైజ సంగీత మహిమ వించు
నలినాసమని నాల్గు నగుమోము లెక్కడె
క్కడ నంచు మాకు స్వాగత మొసంగు
మౌనివర్యులు మనో మందిరంబులయందు
నలరింత్రు మాకు సింహాసనంబు
కవిరాజు లమృతంబు కడగాఁగఁ బెట్టి మ
మ్మాదరింతురు భావమేదురముగ

మేము లేకున్న మూఁగలు మీరలెల్ల
మేము వచ్చిన వాక్పతుల్ మీరలెల్ల
మేము లేకుంట మీ చెవి మింటి గుంట
మేము కలమేని మీచెవి 'పేఋవాని'.

వేలూరివారిది "నాఁగేటి చాలు" ఒక్కటి చాలు ఆంధ్ర సాహిత్యక్షేత్రమున అమృతము పండించిన పరార్థ్య రచనాఖండము. అందుండి రెండు బిందువులు:

పారావారమునందు నొక్క మధురావర్తం బుదాత్తంబుగా
నారంభింపుడు, నందుఁ దియ్యయల యొం డాకాశ సీమాంతరా
పూరంబై యెద బీటిపట్టఁ ఖిలమ్ముల్ ముంచి యివ్వానన్
దూరం బశ్రుతపూర్వమైన యెసకుం ద్రోసెన్ ద్వరాక్రాంతమై.

మేరల్ మీఱి పెరింగి పోవు నల యూర్మిం గొట్టుకోపోయి, త
ద్ధారా నీరమయైక యష్టి నయి, నిద్రాదేవి యంకంబునన్
వీరావేశము మద్యమం దమృతనాభిన్ స్వచ్ఛ మూర్ఛా మహా
గారంపున్ గుహయందు నెంతవఱకో కానిమ్ము నే నుండితిన్.

———

# వావిలికొలను సుబ్బరావు

## (వా.సు. దాసస్వామి)

- గౌరిపెద్ది రామసుబ్బశర్మ

ఆంధ్రదేశమున కడప మండలము, కవిపండిత కోటిని కడుపార కని పెంచుచున్న దొడ్డయిల్లాలు. నాచనసోముడు, పోతన, తాళ్లపాక కవు లాదిగ పెక్కురు ప్రబంధ కవులు, ఆతల్లి యుగ్గుబాలతో ఆమెయొడిలోనే పెరిగిన సారస్వతవీరులు. ఈ సారస్వత వీరమాత పుత్రులలో కీ.శే. వావిలికొలను సుబ్బరావుగారొకరు.

వీరు, రామచంద్రరావు కనకమ్మగార్ల పుణ్యముల పంట. దుందుభి సంవత్సర మాఘ శుద్ధ చతుర్థీ శుక్రవారము 23-1-1863 పూర్వాభాద్రా నక్షత్రమున కుంభరాశి కుంభలగ్నమున శ్రీ వావిలి కొలను సుబ్బరావుగారి జననము. వీరికి శేషగిరిరావు అను అన్నగారు, రంగరావు అను తమ్ముడూ కలరు. ఈ అన్నదమ్ములనుగూర్చి ఇంతకంటె విశేషమేమియు తెలియదు. ఈ సోదరులలో వాసనగల పువ్వు శ్రీసుబ్బరావుగారే అని తోచుచున్నది. వీరిది భారద్వాజ గోత్రము. ఆపస్తంబ సూత్రము.

వావిలికొలను హైదరాబాదు ప్రాంతమున మహబూబ్‌నగర్ జిల్లా దేవరకొండ తాలూకాలో గలదట. ఈ ప్రాంతమున నివసించు ఆర్వేలవారి కుటుంబములు కొన్ని, శ్రీకృష్ణదేవరాయల కాలమున వైష్ణవమతమును స్వీకరించి వ్యాపారవృత్తితో జీవయాత్ర సాగించినట్లు చరిత్ర చెప్పుచున్నది. గోలుకొండను తమ ప్రధాన నివాసముగ చేసుకొని వ్యాపారము చేయుటచే, వీరికి గోల్కొండ వ్యాపారులనీ, గోల్కొండ నియోగులనీ, గోల్కొండ వైష్ణవులనీ పేర్లు వ్యవహారములోనికి

వచ్చినవి. నియోగులుగ నుండి వైష్ణవము స్వీకరించిన పై తెగవారికిమాత్రమే, గోల్కొండ వైష్ణవులను పేరు సంకేతముగ నున్నట్లు గన్పట్టుచున్నది.

వాసుదాసుగారి తాతగారు ఉద్యోగవశమున 'కడప' కాపురస్థులైరి. వీరి తండ్రిగారు 'కడప'లోనే జీవయాత్ర సాగించిరి. వీరికి చిన్నతనముననే పితృవియోగము సంభవించినది. పినతండ్రి లక్ష్మణరావుగారి పాలనలో వీరి విద్యాభ్యాసము F.A. (ఫెల్లో ఆఫ్ ఆర్ట్సు)వరకు సాగినది వీరికి కొన్ని దివ్యశక్తులు జన్మసిద్ధములైనట్లే, మొండి ఉబ్బస వ్యాధియు వీరికి జన్మసిద్ధము. పై చదువు కాలానికి, ఆ వ్యాధి బాగా ముదిరి వీరి విద్యాభ్యాసానికి స్వస్తి చెప్పించినది. ఆ స్వస్తి మార్గము ఆంధ్రుల భాగ్యాంకురమైనది. పెద్దలు, కళాశాలచదువు మాన్పించి, 'నీవు జబ్బుకుదురు వరకేమి చదువవద్దని' శాసించిరి. ఈశాసనము అంతఃప్రేరణము నాపలేకపోయినది. ఇంటిలోనున్న సంస్కృతాంధ్ర గ్రంథములన్నింటిని స్వయముగ చదివి సమన్వయించుకొనుచు పాండిత్యముపైపు చూపు నెరలించిరి. సుప్రసిద్ధపండితులూ, ఆచారానుష్ఠానము గలవారూ, కడప నివాసులగు కందాళ్ల-వాసాచార్యుల ప్రబోధము వీరి సహజ పాండిత్యానికి వన్నెగూర్చినది. కవితాకాంతయూ పాండితీ భామయూ సవతి మచ్చరము లేక వీరిని వరించినవి.

ఎన్నియున్ననేమి లాభము "ఉద్యోగేనం పురుషసింహ ముపైతి లక్ష్మీః" అనినట్లు పొట్టకూటికై ఆనాటి కడప కలెక్టరాఫీసులో నెలకి 7/- ఏడురూపాయల యుద్యోగమున వీరు నియమితులైరి. క్రమముగ రెవిన్యూ ఇన్స్పెక్టరు(ప్రథమరైవిన్యాస పరీక్షకుడు)గా వీరియుద్యోగము పెరిగినది. కడపమండలము రాజంపేట తాలూకా ఒంటూరు ఫిర్కాకు రెవిన్యూ ఇన్స్పెక్టరుగా నున్నవుడు, వీరి ప్రథమ సృష్టిగ ఆవిర్భవించిన కావ్యము శ్రీ కుమారాభ్యుదయము. హరకోపమున బూడిదయైన మరుడు, రుక్మిణీ కృష్ణులకు ప్రద్యుమ్నుడుగ జన్మించుట ఇందలి యితివృత్తము. శివసంబంధమైన కుమారసంభవమున కిది విష్ణుపర్యాయము.

అప్పటికి వీరి కిరువదియైదు నిండినవి. ప్రతిభాపాండిత్యములు తూర్పుపడమర జడివానలుగ కురిసి పారిన వర్షాకాలప్రవాహ మా కావ్యము. పదాడంబరమూ బంధకవిత్వమూ, దీర్ఘ సమాస వ్యామోహమూ, దానిలోని వస్తువుకంటె ముందుగ రొమ్ము విరుచుకొని కనపడును. దానిలోనే వీరి వంశ చరిత్రమూ, ఉద్యోగములో వీరికి గల వైరాగ్యమూ అభివ్యక్తము లగుచున్నవి. మనసు వైరాగ్యముఖముగ, కడుపు గతిలేక ఉద్యోగముపై పుగ లాగిన సంకటస్థితి దానిలో గుర్తింపవచ్చును

చం. ఇరువదియేను హాయనము లేఁగెను నేఁటికిఁ; జూడ నాయువం
దరయఁగ నర్ధ మేఁగె ననసా; నొకయప్పుడు "రామ" "కృష్ణ" యం
చిరవుగ నోరఁబల్కఁ; నిఁక నే నిటు కాలము రిత్త పుచ్చినం
గరుణఁ దలంచునే యముఁడు; కాటియవెట్టక పోవనిచ్చునే.

శ్రీకుమా-1-17.

వీరు రెవిన్యూ ఇన్స్పెక్టరుగదా మరి,

"చం. తెలతెలవాఱ లేచి కడుదీర్ఘ పథంబుల ముంగ్లు గండ్లు కా-
ల్వలు బలితంపు బేఱులును వంకలు డొంకలు రొంపికంపలు-
స్జలములు నాక త్రిమ్మరి-నిశాసమయంబున వత్తు నింటికి;
న్బలిసిన చెట్లనీడలును బావులపంచలు నావె కావాకో"

1-18

"మ. అవమానంబు సహించి, నిశ్చలత తద్ధ్యానంబు చే చేయుచున్,
బవలు న్రేయును గూర్కునాఁకలి తగన్ వారించి, శీతోష్ణ సం
భవఖేదంబున కోర్చి, జాములుగ, నిల్వంజేసితే దైవమా
యవురా సేవకవృత్తి యోగిగతిఁ జేయంజాలితే యన్నిటన్"

1-19

"ఉ. కోపము రాదుగా పలువకూఁతలు కూసిన వించునుండినన్,
దాపము తోఁప దాతపమునం జరియించుచు నెంత యుండినన్,

లేపన భూషలున్ బడయలేదు మనం బిఁక నేమి చెప్పఁగా
నోపిక లెచ్చెఁ గష్టములఁ; యోగికి మాకు నిఁకేమి భేదమో"
1-20

"చం. క్రియలను మాకు యోగికిని గీసయు భేదములే; దదెట్లనన్
భయమున మేము భుక్తికయి, భక్తిని యోగియు ముక్తిపొందె; బ
హ్రయమునఁ గష్టము ల్పడుచు ప్రాలుదు; మౌర యమోపమానులౌ
భయదులు దుష్ప్రభు ల్నిజ మవంద్యులు గారౌకా సేవకాళికిన్"
1-21

ఇంత కష్టమైనా పడి ఆ యుద్యోగము ఏల చేయవలసి వచ్చినది;

కం. ఆ పత్కాలంబందును దూషింపఁబడని కొల్వు రూఢిగఁ జేయన్
బాపంబని పిడ; నింట న్నాపదఁటకు లేదు పూఁట సామగ్రి కటా.
1-25

వాసుదాసుగారికి కడపపట్టణముపై ఎనలేని గౌరవము. "స్వర్గాదపి గరీయసీ" అను వాక్యము ప్రత్యక్ష సత్యమును గూడ కాలదన్నునంత బలముగలది కాబోలు. చాలచాల క్రొత్తక్రొత్త పథకాలతో నేటి నవనాగరక విధానముతో గూడ చెక్కుచెదరని పాతపద్ధతి గలది కడపనగరము. దానిని వీ రానాడు,

సీ. మానిత వస్తువితాన చంచద్ధామ
మై వన్నెకెక్కిన యట్టి కడప
యఖిల పురీకల్పనాభ్యాస కౌశల
స్థిర సరోజాసన సృష్ట కడప
యీశ సన్నుత వేంకటేశ పాలితదేశ
గర్భప్రవేశ సంకలిత కడప
సకల సౌభాగ్య సత్సౌఖ్య ప్రదాయకం
బై మేలు ప్రోలుగ నమరు కడప

చెలఁగు నవ్వీట సరిదాఢ్య చిత్రకూట
కూట సమ మంజులాలయ కూట మతుల
మైన సిరి కాటపట్టు బుధాళి వాట
మమరు మోచముపేట సౌఖ్యముల మూట.

శ్రీ కుమా. 1-38

అని వర్ణించిరి. వీరి యింటికి "చిత్రకూట"మని పేరు.

పై పద్యముతో కడప సౌభాగ్యమేగాక యీ కావ్య కవితా సౌభాగ్యమూ తెలియుచున్నది. కావ్యము ఎంత నిఘంటు సాపేక్షమైతే అంత గొప్పదను కోవకు చెందినది. మచ్చు కొక పద్యము:-

ఉ. కోద్భవ కోద్భవోద్భవజ కోద్భవరంజితమౌ విలాసముం
గోద్భవ కోద్భవోద్భవజ కోద్భవ రంజితమౌ ప్రతాపముం
గోద్భవ కోద్భవోద్భవజ కోద్భవ రంజితమౌ యశంబు ది
వ్యాప్సృతవృత్తి నీకె తగురా యని సత్కవు లెంత్రు లక్ష్మణున్

శ్రీ కుమా 1-62

పదకొండేండ్లు రెవిన్యూ ఇన్స్పెక్టరుగ పనిచేసిరి. ఆ కాలములోనే వీరికి రంగనాయకమ్మగారితో వివాహము జరిగినది. అత్తవారి యూరు నెల్లూరు. ఆ యమ్మగారి కొకకాలు ఐపు. అయినను పినతండ్రిగారి మాటకు మారుమాటాడక "ప్రియా తు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి" అన్నట్లు వివాహమై అనుకూల దాంపత్యమే సాగించిరి.

ఆ కాలమున, "అముద్రిత గ్రంథ చింతామణి" సాహిత్య పత్రికా నిర్వాహకులు గొప్ప విద్వాంసులు నగు పూండ్ల - రామకృష్ణయ్య మున్నగు పెద్దపెద్ద పండితులచే ఈ కావ్యము ప్రశంస లందుకొన్నది.

ఒకసారి వీరు అత్తగారింటికి పోయియుండగ. అచ్చటి విద్వాంసులు వీరి "శ్రీ కుమారాభ్యుదయము"ను విని, ఈ కుబ్జవాడేమి ఇంత ప్రౌఢమైన కావ్యమును

రచించుటేమిః పెద్దలెవరో వ్రాసినదానిని తనపేర ప్రకటించుకొన్నాడని సందే హించినారట. ఒకటి రెండు గంటల కాలమున నెల్లూరు తల్పగిరి రంగనాయక స్వామిపై ఆశువుగ ఒక శతకము చెప్పి ఆ యపకీర్తిని కడుగుకొని ఆ యూరి పండితుల తల లూపించిరి.

చిన్న యుద్యోగముతో పొట్టపోసుకొనుచు నిరంతరము సారస్వత వ్యాసంగము చేయుచున్న వీరిపై పగబూని, జన్మసిద్ధమైన ఉబ్బసవ్యాధి బలిసి తుదకు ఉద్యోగమునుండి తొలగించినది. ఉద్యోగము మాని వ్యాధితో బాధపడు చున్న వీరికి, 'నన్నే సాహెబు' అను యూనానివైద్యుడు ఒక దివ్యౌషధము నిచ్చి రోగముక్తులుగ చేసెను. వాసుదాసు శ్రీమద్రామాయణ వ్యాఖ్యాదులందు ఆ వైద్యుని కీర్తించి తమ కృతజ్ఞతను చాటుకొనిరి.

## అధ్యాపక వృత్తి

శరీరారోగ్యము కుదుటపడినందున జీవికకై మదరాసు చేరిరి. మొదట హిందూ హైస్కూలు (తిరువళ్లిక్కేణి)లో తెలుగు పండితులుగ పనిచేయుచుండిరి. కందుకూరు వీరేశలింగముగారి తరువాత ప్రెసిడెన్సీ కళాశాలలో ఆంధ్రోప న్యాసకులుగ చేరి దాదాపు 16 సంవత్సరములు పనిచేసిరి. ఆ కాలముననే శ్రీ గిడుగు రామమూర్తి పంతులు మొదలగువారు కొందరు పాఠ్యగ్రంథములందు గూడ వ్యావహారిక భాష వాడవచ్చునని వాదము లేవదీసిరి. అది 1904-1920 మధ్యకాలము.

పచ్చి వ్యాకరణ సిద్ధాన్తాభిమానులు శిష్టాచార పరాయణులగు వాసుదాసు గారు పై వాదమును ఎదుర్కొనిరి. "ఆంధ్ర భాషాభివర్ధనీ సమాజము"న వీరు ప్రముఖస్థానము వహించి, వేదము వేంకటరాయ శాస్త్రిగారు, కొక్కొండము - వేంకటరత్నము పంతులు మొదలగువారితో కలిసి గ్రాంథిక వాదమునకు పెద్ద బలము చేకూర్చిరి. గిడుగువారి "బాలకవి శరణ్యము" "పండిత భిషక్కుల భాషా భేషజములు" మున్నగునవి వ్యావహారిక భాషావాదుల కోలాహల ధ్వజ

ములు గాగా, "గ్రామ్య భాషా నిరసనము" "శారదకాంచిక కింకిణీ"లు మొదలైనవి గ్రాంథికవాదుల ప్రభంజనములైనవి. వీరీ యధ్యాపక వృత్తిలో రచించినదే "సులభ వ్యాకరణము". ఇది నాటికీ నేటికీ విశిష్ట స్థాన మలంకరించిన వ్యాకరణము. వ్యాకరణ శాస్త్ర ప్రవేశము కోరువారికీ, వ్యాకరణ శాస్త్ర విమర్శకులకూ, భాషాశాస్త్ర జిజ్ఞాసువులకు గూడ నుపకరించుటయేగాక, గ్రామ్యభాషా వాదుల నోరు మూయించుటకు మంచి శాస్త్రము.

## శ్రీరామ భక్తి

వీరి తాత తండ్రులందరును గొప్ప రామభక్తులు. పితృధనముగ వచ్చిన ఆ భక్తి వీరిలో క్రమముగ పండి పరిమళించినది. రివిన్యూ ఇన్స్పెక్టరుగా నున్నప్పుడే, రాజంపేట తాలూకా కంపసముద్ర మగ్రహార వాస్తవ్యులు శ్రీమాన్ చేట్లూరు నరసింహాచార్యులవారిచే 'శ్రీరామ షడక్షరీ' మంత్రమును ఉపదేశము పొంది నాటినుండి యావజ్జీవము విడువక జపము సేయుచుండిరి. శ్రీమద్రామాయణపారాయణ మెన్నడూ విడువలేదు. 'వైదికమార్గ నిష్ఠమగు వర్తనమున్ దగ నిర్వహించమన్'అని తిక్కనగారు వాకొన్నట్లు,జాతి వివాహితములైన నిత్యకృత్యములు వదలకుండుట, దీక్షతో రామోపాసన, శ్రీమద్రామాయణ పారాయణము. వృత్తియందు శ్రద్ధ, అనవరత సారస్వత పరిశ్రమము వీరికి తీరని వ్యసనములు

[1]వీరి యుత్తమ తపస్సిద్ధిని చాటే చరిత్ర యొకటి పెద్దలతో విన్నాను ఇది త్రిసత్యమనే వారు చెప్పుచున్నారు. కాలమూ లోకమూ దాని నిజస్వరూపాన్ని గుర్తింపగలవని నేనిం దా కథను పేర్కొనదలచితిని:-

---

1. మనోరథానా మక్లేశసిద్ధి రుత్తమ లక్షణం,
మృత్యూనాం హరణం తద్వద్దేవతా దర్శనం తథా. అని మంత్రశాస్త్రము.

వీరు రివెన్యూ ఇన్స్పెక్టరుగా (కార్కొనుగా) నున్నప్పు డొకసారి, డిప్యూటీ తహసీల్దారు ఒక మహమ్మదీయుడూ, తహసీల్దారొక హిందువూ, వీరూ కలిసి కడప జిల్లా బద్వేలు ప్రాంతములో ఒకయూరిని పరిశీలింపవలసి, కడప నుండి జట్కాబండిలో ప్రయాణమై పోవుచుండిరట. ఇప్పటివలె బస్సులు వగైరా ప్రయాణసాధనము లా రోజులలో లేనందున జట్కాలే దూరప్రయాణాలకూ సాధనములు. అడవిబాటలో పయనించునపుడు సూర్యాస్తమయము కావచ్చెనట. ఆ బాటప్రక్కన బండదొనలో నీళ్లు కలవని విని, వీరు వెంటనే అనుష్ఠానమునకై తన కృష్ణాజినముసంచితో సహా ఆ బండపైకి పోయి అనుష్ఠానతత్పరులైరి. వీరట్లు వెళ్ళిన కొంతసేపటికే అడవిలోనుండి పెద్దపులియొకటి మిగిలినవారికి దర్శనమిచ్చినదట. ఇంక చెప్పవలెనా మిగిలిన ముగ్గురూ చెట్లెక్కి గుట్టలెక్కి నానా తిప్పలూపడి ఎట్లో ప్రాణాలు గుప్పిట పెట్టుకొని కొంతసేపు ఆయువు కాపాడుకొనిరట. గుఱ్ఱము, బండితోగూడ తిరుగుమొగమై పలాయనమంత్రము పఠించినదట. పులి, కొంతసేపు తహసీల్దారాదు లెక్కిన చెట్లక్రింద తిరిగి, విసిగి బండపై బద్ధ పద్మాసనులై వెలిచూపు మాని లోచూపుతో కట్టెవలె కదలికలేక యున్న వాసుదాసును సమీపించి ఆయనయెదుట కొంచెముసేపు కాళ్లుచాచి పండుకొని, పెద్దగ గాండ్రించి వెళ్ళిపోయినదట. మరల కొంతసేపటికి సమాధి వదలి లేచిరి. అప్పటికి కొనయూపిరితోనున్న ముగ్గురూ వీరిని చూచి "యేమి సామయ్యా నీవు; పెద్దపులి మింగేశుంటే యీ యాలకు దాని కడుపులో అరిగి పోయుందువే" అని జరిగిన విషయము చెప్పగా ఇంతలో బండివాడు చావు పరుగుతోపోయి గుఱ్ఱాన్ని పట్టుకొని జట్కాతో హాజరు కాగా ఈ కథతోనే కాలక్షేపము చేస్తూ పోయి తమపని ముగించుకొని వచ్చిరట వీరి భక్తిపరిపాకమున కిది యొక నిదర్శనము కావచ్చు.

## శ్రీమద్రామాయణ రచన.

మదరాసు సర్వకళాశాలలో పనిచేయు కాలములోనే తమ మిత్రులతో కలసి సంస్కృత భారతమును, "ఆంధ్ర జయ" మను పేర తెనిగింపబూనిరి. వీరు

"అశ్వమేధ-అనుశాసనిక" పర్వములను చాలవరకు పూర్తిచేసిరి. తక్కిన మిత్రులు మాటమేరకు నడువనందున ఆ పని అసంపూర్తిగా నిలిచిపోయినది. అందులోని కొన్ని పద్యములు "కృష్ణలీలామృతము" లో అక్కడక్కడ చేర్చి ప్రకటించిరి. "శ్రీరామాశ్వమేధ" మను పద్యకావ్యమును వ్రాయుటకు ప్రారంభించిరి. అదియు అసంపూర్ణముగనే నిలిచి, చెదలుపాలైనది.

నిత్యకృత్యముగ సాగుచున్న "శ్రీమద్రామాయణ" పారాయణ విధిలో, రామాయణ మూలార్థము చెడకుండ విశేషార్థ సహితముగ తెలిగింపవలెనను సంకల్ప మొకనాడు కలిగినది. దుర్బలుడనగు నాకీ కార్యము సాధ్యమగునా అని సందేహించిరి. ఐనా రాముడేమంటాడో చూతామని రామాయణ ప్రశ్న వేసి చూచిరట. "ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్" అను శ్లోకము వచ్చినది. వెంటనే "లెమ్మా నరశార్దూలా" అని కందము నాశువుగ రచించిరి. తన తలపు రాము డంగీకరించెనని వారి యుత్సాహము ముప్పిరియైనది. ఒక ప్రక్క కళాశాలోద్యోగము, నిత్య పారాయణోపాసనలు సాగించుచు, ప్రతి దినము కొంత కొంతగ "శ్రీమద్రామాయణ" రచన పట్టువిడక నడపుచుండిరి. మూల రామాయణమున గల మంత్ర బీజాక్షరములను పొందుపరచి, ద్రాక్షా పాకముగ సులభశైలిలో రచన సాగించిరి. కానీ విశేషార్థములకు వివరణాపేక్ష తప్పలేదు. అది సహజమే గదా! ఆ రామాయణము ఒంటిమిట్ట కోదండరామ స్వామి కంకితము చేయబడినది. ఈ విషయము తరువాతి జీవిత చరిత్రలో చర్చిస్తాను.

## పోతన నివాస చర్చ

దాదాపు 1916 ప్రాంతమున పోతననివాసము కడపజిల్లా "ఒంటిమిట్ట" యని, ఓరుగల్లు సమీపమున "బొమ్మెర" యని నేటి వ్యవహారములోనున్న" "బమ్మెర" యనీ పెద్ద కోలాహలము చెలరేగినది. పోతన ఒంటిమిట్టవాడని పురాణము హయగ్రీవశాస్త్రిలు, వాసుదాసుగారు, జనమంచి-శేషాద్రిశర్మగారు ప్రభృతులూ

పోతన ఓరుగంటివాడని కందుకూరివారు, జయంతి రామయ్యపంతులూ, వంగూరి-సుబ్బారావు ప్రభృతులూ పరస్పర ఖండన మండనములతో ఈ వాదమును తారస్థాయి కెత్తిరి. ఇంతకూ, ఆంధ్రకవుల చరిత్రలో కందుకూరివారు తొలుత పోతన ఒంటిమిట్టవాడని వ్రాసి, తరువాత ఓరుగంటివాడని వ్రాయుటయే యీ వాద ప్రతివాదములకు కారణమైనది. వాదమునందు దురాగ్రహము, సత్యమునందు పారుష్యమును దోషముగా భావింపని వావిలికొలనువారి రచనలకు, ఆనాటి ఆంధ్రపత్రిక ఉగాది సంచికలు, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలూ సాక్షి. ఉభయ పక్షముల వాదములకు కోర్టువంటి ఒక విద్వత్సభ కడపలో జరుపుటకు సన్నాహమయ్యెను, దీనివలన చాల అనర్థములు సంభవించునను మధ్యవర్తుల మాటతో అది సన్నాహముగానే నిలిచిపోయినది. తరువాత వావిలికొలనువారు "పోతన నికేతన చర్చ" "పోతరాజ విజయము" అని రెండు గ్రంథములను వ్రాసి శాంత కోలాహలురైరి. ఏమైనను ఇది నేటికిని చర్చగానే మిగిలి సిద్ధాంతము కాలేకపోయినది. శ్రీమాన్ వానమామలై వరదాచార్యులును, తమ "పోతన భాగవతము" న ఈ విషయము యుక్తిగ సాధించిరి. నిత్య రామభక్తులై ఐహికమును రోసి రామసాక్షాత్కార-సాయుజ్యములకు జీవిత మంకితము చేసిన వావిలికొలనువారు, సధర్ములగు పోతనగారిపై, ఆయన నివాసచర్చపై పట్టుబట్టి వాదించుట, ఆయన నివృత్తిమార్గానికి దూషకముగాక భూషకమే యగుచున్నది. ఒంటిమిట్ట కోదండ రామస్వామి దేవళములో పోతన శిలా విగ్రహమూ, దాని దిమ్మెపై "ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి" అను పద్యము వ్రాసిన శిలయూ నేటికినీ గలవు. ఒంటిమిట్ట చెరువుక్రింద గల మొదటి కయ్యలు పోతన కయ్యలనే జనవ్యవహార మీనాటికిని సుప్రసిద్ధమే.

కం. ఏకశిలా నగరంబున
శ్రీకరముగఁ బట్టణంబు వెలఁగుచునుండన్

లోకులు తెనుఁగున నుడువుదు
రేకంబుగ నొంటిమిట్ట యిది యను పేరన్.

– ఏకశిలానగర మాహాత్మ్యము. (సాహిత్య పరిషత్తువారు ఓబిలి గ్రామమున సంపాదించినది.)

## మాతృ వియోగాదులు

శ్రీమద్రామాయణ రచనా కాలమున నడుమ సాగిన పిడకల వేట్లాట "పోతన నికేతన చర్చ". రామాయణ రచనాకాలములోనే శ్రీ రావుగారికి మాతృ వియోగము కలిగినది. కాలధర్మమే కదా! ఇంతలో వీరి కొక కుమారుడు కలిగి పసితనముననే తండ్రిని పుత్రశోకమునకు గురిచేసెను. ఆ సమయమున వీరు. "కుమార దండకము"ను "అపి గ్రావారోది త్యపిదలతి వజ్రస్యహృదయ" మను నట్లాశువుగ రచించిరట.

తమువలెనే తమ ధర్మపత్నియు నిత్యవ్యాధిగ్రస్తురాలు. కావున సుబ్బరావు గారే చాలవరకు వంటవార్పులుచేసి, మంచముపట్టిన యిల్లాలి కుపచారములు సేయుచూ కళాశాలకు పోవలసియుండెను ఐననూ ఎన్నడూ విసుగు చూపలేదు; ధర్మపత్నిపై విముఖతయూ చూపలేదు. తుదకు రంగనాయకమ్మగారును రంగ ధామము చేరిరి. దీనితో, స్వతస్సిద్ధములగు భక్తి-వైరాగ్య – సదాచారనిష్ఠలు గల సుబ్బరావుగారికి భౌతిక బంధములు పూర్తిగ తమకు తామే విడిపోయినవి.

అప్పటికి (1920 నాటికి) వారికి ఉద్యోగ విరమణవయస్సు వచ్చి ఆ బంధము తొలగినది. నెలకు నలభైయైదు రూపాయలు ఉపకారవేతనము సిద్ధించి నది. అప్పటికే వారికి యోగశాస్త్ర పరిచయమూ దానితో అణిమాదిసిద్ధియు కుదిరి. అవి వారి యారోగ్య రక్షకుగూడ నుపకరించుచుండినవి.

## రామాయణ సమర్పణ

నడుమ నడుమ కుటుంబక్లేశములు రోగములూ బాధపెట్టుచున్ననూ ఎట్లో రామాయణ రచన పూర్తిచేసిరి. వీరి మొదటి కావ్యము 'శ్రీ కుమారాభ్యుదయము'

పూర్తియైన తరువాత, 1894లో, తమ తల్లిగారి కోరికపై, మహారాష్ట్ర భాషలోని "కౌసల్యా పరిణయ"కథను ఆయమతోనే వినినదానిని. ఆ పేరుతోనే రచించిరి. కానీ అది, బ్ర॥శ్రీ॥ కొత్తపల్లి-వేంకట పద్మనాభశాస్త్రి చొరవతో మహారాజ రాజశ్రీ రాజా వెల్లంకి వేంకట్రామారావు బహద్దరు జమీందారుగారి ఆర్థిక సహాయముతో 1902న ముద్రితమై, భద్రాచలస్వామి కంకితమైనది. తరువాతిది అసంపూర్ణ భారతము. ఆ తరువాతిది పూర్ణ రామాయణము. ఈ రామాయణమే వీరిని "ఆంధ్ర వాల్మీకి" అనిపించినది. రావుగారు క్షయవ్యాధిపీడితులగుచుండియు మిత్రుల యాదరమున ఉచిత చికిత్సల నందుచు, నిత్యమరణ శంకితులై కాలము త్రోయుచు, రామాయణము పూర్తిచేయుట ఆశ్చర్యము.

ఆ గ్రంథము ఒంటిమిట్ట కోదండరామస్వామి కంకితము చేయబడినది.

శ్రీ మహిజాధవుండు జడ చేతన జీవ విధాత సద్గరీ
యోఽమర భూరుహంబు సమదారి విదారణశీలి భక్తవా
రామృతదాత సంభృతశరాస కరాంబుజుఁ డొంటిమిట్ట శ్రీ
రాముఁ డమాయవర్తనుఁడు రక్తి గ్రహించుట మన్నమస్కృతుల్.

– రామాయణ ప్రథమ పద్యము.

ఈ గ్రంథము నంకితముచేయు సమయమున ఒంటిమిట్టలో పెద్దపెండ్లి సంబరము నెలకొన్నది. ఆ సభకు మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు, మాడభూషి వేంకటాచార్యులుగారు, నాదెళ్ల పురుషోత్తమ కవిగారు, ధర్మవరము రామకృష్ణమాచార్యులు, పూండ్ల రామకృష్ణయ్యగారు మొదలగు మహామహులు విచ్చేసిరి. కొన్ని ప్రధానఘట్టములు మూలరామాయణముతో సరిపోల్చి చదివి సరిగా నున్నదని అందరంగీకరించిన తర్వాతనే ఆ గ్రంథమావిష్కరింపబడినది. ఆ మహోత్సవమునందు, ఆంధ్రనాటక పితామహులు ధర్మవరము రామకృష్ణమాచార్యులు తమ నటవర్గముతో తమ పాదుకా పట్టాభిషేక నాటకమును ప్రదర్శించి ఆ సందర్భమున కొంక నిండుదనమును చేకూర్చిరి.

మాటల సందర్భమున ధర్మవరము వారు, కవిగారికి (సుబ్బరావుగారికి) నాటక రచనా సామర్థ్యముగూడ కలదా యని మెల్లగా గిల్లిరి. ప్రెసిడెన్సీ కలాశాలలో నున్నప్పుడే కొందరు విద్యార్థుల యుత్సాహముకొలది 'సుభద్రావిజయ' మను నాటకము రచింపబడియు, శ్రీ రావుగారి మనసు రామాయణ రచనా పరాయణ మగుటచే మూలబడియున్నది. పై అచార్యుల వారి మాటపై ఇది బయటికి వచ్చు నవకాశ మేర్పడినది కవిభూషణ బిరుదాంకితులు సమయోద్దండ కోలాహల శ్రీశైలాద్దంకి లక్ష్మీనృసింహ తాతాచార్యులు గారు, బహునాటక రచనా ధురీణులగు బ్ర. శ్రీ. కోలాచలము శ్రీనివాసరావు గారూ, కట్టమంచి రామలింగా రెడ్డి గారునూ చూచి మెచ్చిన తర్వాత పై నాటకము బ్రహ్మశ్రీ కొత్తపల్లి - వేంకట పద్మనాభశాస్త్రిలచే 1928లో ముద్రింపబడినది ఒకప్పుడు, బ్రిటిష్ యువరాజుకు ఢిల్లీలో పట్టాభిషేకము జరిగినది. ఆ సమయమున వారిపై తెలుగులో వీరిచే పద్యములు వ్రాయించి వీరిని సమ్మానించుటకు ప్రభుత్వమే అభ్యర్థించినది. నరస్తుతి చేయుటకు నిరాకరించి దాని సమ్మానమునూ వీరు తృణప్రాయముగ వదలుకొనిరి.

ఉపకారవేతనము పొందిన తర్వాత, నిత్యవ్యాధి పీడితులగు శ్రీ రావుగారు 'ఘటికాచలము' (చోళింగపురము) నకు పోయి స్వామిసేవ చేయుచు, అచ్చటనే స్థిరనివాస మేర్పరుచుకొనవలెనని సంకల్పించిరి. ఆ సమయమున "ఘటికాచల వాస కేశవా" అను మకుటముతో ఒక శతకమును రచించిరి.

## స్వామి సందేశము

ఆ సమయములోనే ఒకనాడు రైలుప్రయాణము సేయుచుండగా ఆయాసముతో కొంతసేపు కన్నుమూసిరి. కలలో శ్రీ రామలక్ష్మణులు దర్శన మిచ్చిరట. ఉగ్గన లేచి చూడగ ఎదుట ఇద్దరు బైరాగులు కూర్చొనియుండిరి. వారు, "ఒంటిమిట్టలో రాములవారి సేవ చేయరాదా" అనిరి. ఆ మాటనే దైవసందేశముగ భావించి తన మనస్సు మార్చుకొని ఒంటిమిట్ట చేరిరి.

## ఒంటిమిట్ట

ఇది పుణ్యక్షేత్రములలో ఒకటి. ఇందలి కోదండరామస్వామి జాంబవంతునిచే ప్రతిష్ఠింపబడినట్లు స్థలపురాణము చెప్పుచున్నది. కడపజిల్లా సిద్ధవటము తాలూకాలో ఒంటిమిట్ట యున్నది. మదరాసు-బొంబాయి రైలుమార్గములో నందలూరు దాటిన తర్వాత ఒంటిమిట్ట రైల్వేస్టేషన్ కలదు. స్టేషన్‌కు ఒక మైలు దూరములో ఊరు. కడపనుండి రాజంపేట మీదుగ మదరాసు పోవు బస్సులీ యూరి మీదనే పోవలయును. అయ్యలరాజు రామభద్రుని ముత్తాత అయ్యలరాజు తిప్పరాజు. "ఒంటిమిట్ట రఘువీరా జానకీవల్లభా" అను మకుటముతో శతకము రచించినాడు. అయ్యలరాజు రామభద్రుడూ, అయ్యలరాజు నారాయణ కవియు ఆ యూరివారే యని ప్రసిద్ధి. విజయనగర ప్రభువులు నిర్మించిన గోపురమంటపాదులతో ఆలయము విరాజిల్లుచున్నది. సదాశివరాయలు, అచ్యుతరాయలు మొదలగువారు స్వామివారికి చాల గ్రామములు దానము చేసినట్లు శాసనములున్నవి. ఊరినడుమ శిథిలములైన కోటబురుజులు వగైరాలు దీని ప్రాచీన ప్రసిద్ధికి చిహ్నములు. దేవాలయమాన్యము లన్నియు చిన్న పెద్ద రైతుల చేతులలోపడి స్వామికి నిత్యపూజానైవేద్యములు శ్రమసాధ్యము లైనప్పుడు, దానిని ప్రభుత్వము చేపట్టి సంవత్సరానికి కొన్నివందల రూపాయలు దేవాలయమున కనుగ్రహించినది. ఆ స్వల్ప విత్తముతోనే ధర్మకర్తలు పూజలు ఉత్సవములు శాస్త్రము చెడకుండ సాగించుచుండిరి. ఈ పరిస్థితిలో శ్రీరావుగారు 1924లో శ్రీ కోదండ రామస్వామి సేవ చేయుటకు సంకల్పించుకొనిరి. శ్రీ రావుగారితో అవినాభావ సంబంధము గల దగుటచే ఒంటిమిట్టను గూర్చి మీవి వాక్యములు వ్రాయవలసివచ్చెను.

కం. "నిగనిగ మెఱయు కిరీటము
ధగధగమను పట్టుదట్టి తగిన కటారున్
ఘుగఘుగ వాసన నీకే
తగు తగురా ఒంటిమిట్ట దశరథరామా"

ఇది నా చిన్ననాటి ఆటవిడుపు పద్యము. ఇది యెవరి చాటువో తెలియదు. స్వామి ప్రశస్తిని చాటెదని ప్రస్తావించితిని.

## శ్రీ రావుగారి కోదండ రామస్వామి సేవ

### (పూర్ణ భక్తి యోగము)

1924లో శ్రీ రావుగారు ఒంటిమిట్టలో చేరినది మొదలు, భద్రాచల స్వామికివలె పూజోత్సవాదులు సాగింపవలెనని సంకల్పించిరి. ఇది మొదలుకొని వావిలికొలను సుబ్బరావు వాసుదాసులైరి. సన్న్యాసమును స్వీకరింపలేదుగాని, మోకాలివరకు కావిపంచె, పైకి చిన్న తుండుగుడ్డ మాత్రము ధరించుచుండిరి. మూడడ్డవ్రేళ్ల వెడల్పు కౌపీనమునే ధరించి. "కౌపీనవంతః ఖలు భాగ్యవంతః" అను వాక్యమును చరితార్థముగ చేసినవారూ వీరే. విధురాశ్రమమున నున్నట్లూ ఆ యాశ్రమధర్మమును శాస్త్రోక్తముగ తా నాచరించుచున్నట్లును వారు చెప్పుచుండిరి. వీరి పినతండ్రులలో నొకరైన శ్రీనివాసరావు కుమార్తె వంగూరి-సీతమ్మ సంతులేని వితంతువు, అన్నగారైన సుబ్బరావుగారి కన్నపానీయములు సమకూర్చుచు, తపశ్శుష్కమగు వారి దేహమును జీవితాంతమువరకు కాపాడినది.

ఆలయమున కొక ఫర్లాంగు దూరమున చిన్నగుట్ట గలదు. అది ఆ యూరి చెరువు నానుకొని యుండును. ఆ గుట్ట క్రిందనే అశోష్యమైన జలముతో 'రామతీర్థ' మొకటి కలదు. సుబ్బారావుగారు ఆ గుట్టపై తన సొంత ధనముతో ఒక ఆశ్రమమును కట్టుకొనిరి. ఆ గుట్టకు శృంగగిరి యని పేరు. ఆ తీర్థము వారి స్నానపానములకు, ఆ యాశ్రమము వారి తపమునకు ఏకాంతవాసమునకు నిరభ్యంతర గ్రంథరచనకు చాల అనుకూలముగ నుండినవి.

శ్రీ కోదండ రామస్వామి దర్శనార్థము వచ్చు భక్తులకు వసతిగృహముగ, స్వామివారి ఆలయమున కెదురుగ "శ్రీరామ సేవా కుటీర" మను పేర ఒక

సత్రమును నిర్మించిరి. దీనికి వలసిన ధనమంతయు వారు స్వయముగ భిక్షించి ప్రోగుచేసిరి.

సుబ్బరావుగారు ఆంధ్రదేశమంతటను తిరిగి బిచ్చమెత్తి ఒంటిమిట్ట కోదండ రామస్వామివారి కొక చక్కని తేరు నిర్మించిరి. 1929 నాటి కది పూర్తియైనది. నేటికీ శ్రీరామనవమినాడు రథోత్సవమున కా తేరుపయోగపడు చున్నది. ఆలయమున కెదురుగ నున్న సంజీవరాయని దేవళము బాగుపరచిరి. కోదండరామస్వామి దేవాలయములోని యుత్సవమూర్తులకు సంజీవరాయని యుత్సవమూర్తికి బంగారు కిరీటములను నిర్మించి సమర్పించిరి.

108 మార్లు రామాయణ పారాయణము గావించి, ఒక్కొక్క సీతా కల్యాణమునకూ ఒక్కొక్క తాళిబొట్టు (ఒక సవరలో) నిర్మించి. 108 బొట్లు గల స్వర్ణహారమును సీతమ్మవారికి సమర్పించిరి. ఈ యాభరణములు ఇనుప పెట్టెలో భద్రపరుపబడి నేటికిని ఉత్సవ సమయమునందు ధరింపచేయు చున్నారు.

108 మార్లు రామాయణ పారాయణములు ముగియగనే, ఆసేతు శీతాచల మధ్యమునగల దివ్య తీర్థములనుండి జలములు తెప్పించి, 1930 శ్రీరామనవమి నుండి ప్రారంభించి శ్రీరామ పట్టాభిషేక మహోత్సవము గావించిరి. సర్కారు ధనము రామకైంకర్యమున కుపయోగించి "రామదా" సైన కంచెర్ల-గోపన్న, ఇహలోకమున చెరసాల ననుభవించి పరలోకమున ముక్తినంది నట్లు చరిత్ర కలదు. కానీ ఇహలోకమున లౌకికమైన ఆత్మాభిమానమును వీడి బిచ్చమెత్తి రామకైంకర్యము చేసి "వా.సు.దాసు" అను పేరు గనిన వావిలికొలను-సుబ్బరావుగారు, రామదాసు కంటెగూడ ధన్యులేమో గదా ?

ఆంధ్రప్రజలలో భక్తి నిష్ఠను వ్యాపింపజేయవలెనని తలచి, "శ్రీ కోదండ రామ సేవక సమాజము"ను 1927లో నెలకొల్పిరి. సమాజ సభ్యులందరూ రామ మంత్రోపదేశమును పొంది జపము సేయవలెను. నిత్యమూ రామకోటి వ్రాయ

వలెను రామాయణము పారాయణము సేయవలెను. మెడలో ఒకవైపున, సీతా రామలక్ష్మణ హనుమంతులు గల చిత్రమును, మరియొక వైపున రామషడక్షరి గల పదకమును ధరింపవలెను. ఈ పదకములు బంగారు-వెండి-రాగి లోహము లతో సిద్ధపరచి భక్తుల కిచ్చుచుండిరి. వీరి భక్తకోటిలో అన్ని జాతులవారును గలరు. శిష్టాచార పరాయణులగు వా.సు దాసుగారు జాతి-మత భేదము లేక అందరకూ రామభక్తిని బోధించిరి ఇచ్చిపుచ్చుకొను బంధుత్వము లేకున్నను తమతమ కులాచారము వదలక సౌభ్రాత్రము కలిగియుండుట అసాధ్యము కాదని వీరి సిద్ధాంతము. ఒకపరి ఒక హరిజన భక్తుని కోరికపై వానియింటికి పోయి భక్తితో అత డిచ్చిన ఫలములు గ్రహించిరనియు చెప్పుచున్నారు.

## భక్తి సంజీవని

తా మవలంబించిన భక్తిమార్గమును ప్రచారము చేయుటకై 19:9లో "భక్తి సంజీవని" యను మాస పత్రికను ప్రారంభించిరి దానిలో భక్తిమార్గమును ప్రదర్శించుచు అడ్డమాకలు లేక ఇతర మతములను ప్రక్కపోటులతో దూసి పోయుటయు సాగినది అప్పటికి కడపలో సుప్రసిద్ధులై బహుపురాణ గ్రంథకర్త లగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు, వీరి పరమత దూషణను సహింప లేక, కమలాపురమునుండి బ్ర. శ్రీ. కైప శేషశాస్త్రి, మ.రా.రా. శ్రీ బసవరాజు-రాఘవేంద్రరావు ప్రభృతుల సాహాయ్యముతో 'బ్రహ్మవిద్యా' పత్రికను నడిపించిరి. ఆ దినములలో పై రెండు పత్రికలలో అద్వైత - విశిష్టాద్వైతములలోని గుట్టులన్నీ రట్టై చదువరులకు చాల వినోదము కల్గించుచుండెను. వా.సు. దాసు గారికి ఆంగ్ల విద్యాబలము దొడ్డది. జనమంచివారి కది లేదు. జనమంచివారికి శాస్త్ర పురాణ సంస్కృత విద్యాబలము చాల దొడ్డది. అది వా.సు. దాసుగారి కంతగ లేదు. ఇద్దరూ వైదికశ్రద్ధ, దైవభక్తి, త్యాగబుద్ధి, స్వమండలాభి మానమూ దండిగ గలవారే.జనమంచివారు శ్రీ విద్యా పరాయణులు;వావిలికొలను వారు రామసేవా పరాయణులు. వావిలికొలనువారికి మాటా వ్రాతా చాల తీవ్రమైనది. జనమంచివారికి పై రెండునూ హాస్యము కప్పుకొని అంతఃశతధారమున నుండును.

రామసేవకై వా. సు. దాసుగారు భిక్షించినపుడు వారికి గలిగిన అనుభవములను, దాతల మంచిచెడ్డలను తెలుపుచు, తాను భిక్షకు గైకొన్న టెంకాయ చిప్పను సంబోధించుచు, "టెంకాయ చిప్ప శతకము"ను రచించి సామ్రాజ్య పట్టాభిషేక సమయమున స్వామికి సమర్పించిరి. అదే సమయమున "భక్త కల్ప ద్రుమ శతకము"ను రచించి స్వామికి నివేదించిరి.

## యామర్తి సుబ్బదాసుగారు

శ్రీ వాసుదాసస్వామి శిష్యులలో యామర్తి సుబ్బదాసుగా రగ్రగణ్యులు. వీరు బాపట్ల తాలూకా 'బుద్ధాము' గ్రామకరణము. నేటికీ వీరి యల్లుడే పైగ్రామ కరణీకము చూస్తున్నారట. శ్రీ సుబ్బదాసుగారికి పత్నీవియోగము సంభవింపగా జీవితశేషమును శ్రీ వా సు. దాసుగారితోనే గడపుచుండిరి. వీరు వా. సు. దాసు గారికి, రామునికి హనుమంతునంతటి బంటు. వీరే లేకుంటే వా. సు. దాసుగారి చరిత్ర యింతపైకి రాలేదేమో? వారి హస్తాక్షరములు ముద్దు లొలుకు ముత్యాల సరాలు. వా సు. దాసుగారు త్వరత్వరగా చిత్తు కాగితములలో వ్రాసినదాన్నంతా అందమైన తమ హస్తాక్షరములతో ముద్రణకు సిద్ధపరచేవారు. ఆహారము మాత్రము ఆశ్రమములో స్వీకరిస్తూ ప్రతిఫలాపేక్ష లేక పరిచర్య చేసేవారు.

## మందరము

వాల్మీకి రామాయణమునకు సంస్కృతమున నాల్గు వ్యాఖ్యానములు గలవు. వాటిలోని సారమంతా వచ్చేటట్లు తెలుగులో రామాయణమునకు ఒక విపుల వ్యాఖ్య రచింపవలెనను సంకల్పము వా.సు. దాసుగారికి కలిగినది. అప్పటికి వీరికి 69 సంవత్సరములు. తన శక్తిని సందేహించియు, రామునిపై భారమువేసి ప్రారంభించిరి.[1] ఒంటిమిట్ట ఆశ్రమములోనే బాలకాండ వ్యాఖ్య పూర్తియైనది. అందులో,

1. తమ రామాయణానువాద పద్యములతో వాల్మీకి రామాయణ శ్లోకములను జోడించి, సంస్కృత వ్యాఖ్యా చతుష్టయానువాదముతో పెక్కు విశేషములు చేర్చి కూర్చిన వ్యాఖ్యయే మందరము.

సీ. అరువదిపైఁ దొమ్మి దరుగఁగ నేఁడులు
సాహసించితిని నసాధ్యకృతికి
నెట్లగునో యని యేల సందేహింప
సర్వమునకు రామచంద్ర విభుఁడె
కలఁడారమేశ సంకల్పంబె కొనసాగు
నరువది గడియ లహర్నిశమ్ము
జానకీశ్వర పాద సారసంబుల నిల్పు
స్వాంతంబు; లభియించె సాధనమ్ము

చెలియలున్నది సీతమ్మ సేవసేయ
సుజన వినుతుఁడు యామర్తి సుబ్బ సుకవి
మందర ధురంధరక్రియ మాధవునకు
వైనతేయుని విధమున బాసటయ్యె"

బాల-మంద-పీఠి.-7

కం. మునుపటి వ్యాఖ్యానంబులు
గనుగొని తత్త్వజ్ఞ జనుల కరుణం గని భూ
తనయాపతి ప్రేరించిన
యనువున వచియింతు నతఁడె యాచార్యుఁడుగన్.

-12

శ్రీ వా.సు. దాసుగారు, తన కుద్యోగవశమున లభించిన ఉపకార వేతనముతోనే దేహయాత్ర సాగించుచు,రామసేవార్థమై తిరిప మెత్తిన దానితో స్వామి కైంకర్యము చేయుచూ గ్రంథరచన చేయుచుండిరి వీరు బంధుగు లెవ్వరినీ దగ్గర చేర్చక భక్తులతోనే స్వామి కైంకర్యము చేయించుచుండిరి.

వా.సు. దాసుగారు ధనార్జనకై దేశము తిరుగుచుండగ, వీరార్జించిన ధనముతో ఆకేపాటి-సూరారెడ్డిగారు (ఆ యూరిలో ప్రముఖుడు) వీరాదేశించినట్లు

దేవాలయాది సంస్కారకార్య........ మండిరి. కానీ యెన్నడునూ లెక్కా పక్కా చూపించునలవాటు ఆయనకు లేదు భక్తులిచ్చిన ధనము లెక్కలేకుండ నైసాకూడ ఖర్చుపెట్టరాదని స్వామిగారి నియమము. ఆ లెక్కలడిగినందుకు శ్రీ సూరారెడ్డిగారు స్వామిగారిపై కోపగించి పగబూని జరిగే పనులకు ప్రతిబంధకములు సాగించిరి. ఆ ప్రాంతములో రెడ్ల పలుకుబడి యెక్కువ. ఈ బడుగు సామి ఆ రెడ్డిరాజుల ధాటికి నిలువగలడా?

ఇంతలో చిత్తూరుజిల్లా "నగరి" యొద్ద "మేల్పట్టు"లో నున్న ధనవంతుడు దొరస్వామినాయుడు స్వామిగారిని తమయూరి కాహ్వానించి వారికి తగు సౌకర్యములు కల్గించిరి. వారి ఆశ్రయములోనుండి 1931-1932లో అయోధ్యాకాండ వ్యాఖ్యానమును, 'ఆరణ్యకాండ'లో కొంతభాగమును పూర్తిచేసిరి.

స్వామిగారికి గుంటూరులో శిష్యసంతతి యెక్కువ. 1933లో, "సత్తెనపల్లి" వాస్తవ్యులు ధనవంతులునగు గోపాలుని కంబయ్యగారను బ్రాహ్మణ భక్తుడు, రామాలయమును కట్టించి సీతారామ లక్ష్మణులను ప్రతిష్ఠించి, దాని కనువుగ ఆశ్రమము నొకదానిని కట్టించి, శ్రీ స్వామివారి నాహ్వానించిరి. వీరక్కడ దాదాపు 2 సంవత్సరములుండి "ఆరణ్యకాండ" శేషవ్యాఖ్యను "కిష్కింధాకాండవ్యాఖ్య"ను పూర్తిచేసిరి.

ఇంతలో తెనాలిప్రక్కన "నడిగడ్డ పాలెం"లో ఒక ధనవంతుడగు చౌదరి భక్తుడు ఒక ఆశ్రమమును స్థాపించి స్వామివారి నాహ్వానించి ఆదరించెను. నేడా యాశ్రమము పాదుకాక్షేత్రమను పేరుతో విశిష్టాద్వైత ప్రచారక సంఘమువారి ఆధీనములో నున్నది. అక్కడనూ రామాయణ వ్యాఖ్యానము సాగుచునే యుండెను. ఆ పాదుకాక్షేత్రములో వా.సు. దాసుగారి శిలావిగ్రహము ప్రతిష్ఠింపబడియున్నది.

ఇవి యిట్లు జరుగుచుండగనే శ్రీ వా. సు. దాస స్వామిగారు, 1933లో ఒంటిమిట్టలోని 'శ్రీరామ సేవా కుటీరము'న సీతారామ లక్ష్మణుల ఉత్సవ

మూర్తులను మాత్రము ప్రతిష్ఠించి, ఆ స్వామికి "వరదాభయ కోదండ రామస్వామి" యని పేరిడిరి. ప్రస్తుత మీ విగ్రహములు ఒంటిమిట్టలోని ప్రధాన దేవాలయమున నున్నవి.

ఇంతలో, "లక్ష్మీనరసాపురము" జమీందారుగారి భార్య, స్వామిభక్తురాలు, వా సు దాసుగారిని ప్రార్థించి, రామాయణవ్యాఖ్య (మందరము) తమ భవనమున పూర్తిచేయవలెనని వేడుకొనెను. ఆ యమ్మగారి కోరికను మన్నించి శ్రీ స్వామి గారు, 1934, 1935 సంవత్సరములూ, 1936 కొంతభాగము వారి మందిరము ననే మందరవ్యాఖ్య పూర్తిచేసిరి. "శ్రీమద్రామాయణ" మొక పాలకడలికాగా, ఈ మందరవ్యాఖ్య మందరమువలె దానిని చిలికి అమృతోపమానములైన పెక్కు విశేషములను బయటపెట్టినదని భావము. ఈ మందరమునకు కవ్వపుత్రాడు స్వామిగారి బుద్ధిలతయే దానిని చిలికిన దేవ దానవ సముదాయము వా. సు. దాసు గారే. అమృతము మన పాలు. ఇది యొక విజ్ఞానకోశము. మచ్చుకు శ్రీమద్రామా యణము బాలకాండలోని 5, 6 శ్లోకవ్యాఖ్యానముగల "మందరము" (బాలకాండ) 147 పేజీనుండి 164 పేజీలవరకు గల భాగమునైన చదివిన పెద్ద లీ మాట త్రోయలేరు.

ఇవిగాక నడుమనడుమ మిత్రుల ప్రార్థనను అనుసరించి లోక సంగ్రహా ర్థము వారు రచించిన హితచర్యలు, ఆర్య కథా నిధిపేర రచించిన పురాణ చరిత్రలు, కృష్ణావతార రామావతార తత్త్వములు, దేవాలయ తత్త్వము మున్నగు అపూర్వ గ్రంథ సముదాయ మెంతో కలదు.

## నిర్యాణము

"యస్మైజనః స్పృహయతే నరపుంగవాయ కాలో నినీషతి తమేవ నిజం నికాయ్య" మన్నట్లు, 1-8-1936న తిరువళిక్కేణిలో వారి సొంతయింటిలో స్వామివారిని కాలపురుషుడు నిర్దయముగ కబళించినాడు, ఆనాడు ఆంధ్రదేశ మంతయు వలవల వాపోయినది.

తిరుపతి వేంకటకవులు, జనమంచి శేషాద్రి శర్మగారు ప్రభృతుల విషాద గీతముల కానాటి నానా పత్రికలు సాక్షి. బ్రతికేయున్న దినములలో విషయ విభేదముతో స్పర్ధించినను, వీరు పోయినవార్త వినగానే జనమంచివారు వెంటనే ఆ నాటి కలెక్టరుగారిద్వారా సంతాపసభ నేర్పాటు గావించి, 'పోయెనే, మన మండల రత్నము పోయెనే' అని నిండు సభలో ఎలుగెత్తి యేడ్చిన గాథను కడపవారు నేటికిని కొనియాడుచుందురు. వ్యక్తిగత ద్వేషములేక విషయగత భేదబుద్ధిగల శాంతాత్ము లందరకు నిది సాధారణమే గదా!

వీరు పరమపదించునాటికి మందరము ఆరణ్యకాండభాగము కొంచెము మాత్రమే ముద్రితమై యుండెను. ఇంత పెద్ద గ్రంథమును ముద్రించు టెట్లా యని వారి కెప్పుడు నొక చింత యుండెనట. అది చింతగానే మిగిలిపోయినది.

శ్రీ స్వామిగారి ఆస్తిగా కడప మోచముపేటలోనున్న యిల్లు, మద్రాసు తిరువళిక్కేణిలోనున్న యిల్లుగూడ శ్రీ కోదండ రామస్వామికే సమర్పించిరి. ఆ రెండు గృహము లిపుడు దేవాదాయ ధర్మాదాయశాఖ యధీనములో నున్నవి. వీరికి పుత్ర పుత్రికా సంతానము లేదు. కావున, కడప కలెక్టరు ఆఫీసులో గుమాస్తాగా నుండిన తన పినతండ్రి కుమారుడు లక్ష్మీజీరావుపేర పై గ్రంథజాత మంతా వీలునామా ద్వారా సంక్రమింపజేసిరి.

చిన్న యుద్యోగముతో తికమకపడుతూ ఈ లక్ష్మీజీరావు పై గ్రంథములతో పరిచయము లేనివాడు కావున సరిగా గమనింపక కొన్నివేల వెలచేసే గ్రంథములు చెదలుపాలు చేయవలసివచ్చినది. తరువాత వాటిని వారు దేవాలయ బోర్డు ప్రభుత్వమువారి కప్పగించిరి.

## నిర్యాణోత్తరము

గురువియోగముతో క్రుంగిపోవుచున్న యామర్తి-సుబ్బదాసుగారికి, తరువాతివారెవరూ తన్నాదరింపలేదనే నిర్వేదము బలమై ఉత్తరదేశయాత్రకు

పోయిరి. మూడేండ్లకు తిరిగి వచ్చి, రామాయణ వ్యాఖ్యానము పూర్తిగా ముద్రణము గాకుండుటకు చాల నొచ్చుకొనిరి.

వీరిని, గురువియోగముతో వెరిగిన మనస్సుగల వా. సు. దాసస్వామి శిష్యులూ, తమ శిష్యులూ కొందరు ప్రార్థింపగా, తెనాలికి నాలుగుమైళ్ల దూరమునగల "అంగలకుదురు"లో "దాసకుటి" ఆశ్రమము స్థాపించుకొనిరి. వీరికి "దాసశేష స్వామి" అని వ్యవహార మేర్పడెను. వీరు చాల శ్రమపడి, పైబోర్డువారితో ఒడంబడిక చేసుకొని, వా.సు. దాసస్వామివారి గ్రంథము లన్నిటిని ప్రచురించే అధికారమును పొందిరి. "ఆంధ్రగ్రంథ ముద్రణాలయ" ప్రతిష్ఠాపకులైన శ్రీ కోదండ రామయ్య, వీర వేంకట్రావు మొదలగువారి సహాయముతో, భక్తులిచ్చిన విరాళములతో రామాయణ మందరము నిరాంతకముగ తొలిముద్రణ పూర్తి చేసిరి. ప్రతులన్నియు అమ్ముడుపోగా, కొన్నివేల రూపాయలఖర్చుతో మందరము రెండవ ముద్రణము గూడ పూర్తిచేసిరి.

అంతమాత్రమేకాక "భక్తిసంజీవని" యను మాసపత్రికను మరల నడపుచు, శ్రీ స్వామివారి గ్రంథముల నన్నింటిని పూర్తిగ ముద్రించి ప్రకటించుచు అపారమగు తమ గురుభక్తిని లోకమునకు చాటించి, దాదాపు నాలుగేండ్లనాడు శ్రీ దాసశేష స్వామిగారుగూడ గురుపాదముల చేరిరి.

అయినను వీరి శిష్యకోటి, నేటికిని శ్రీ వా సు. దాసస్వామి గ్రంథములను ముద్రించి ప్రకటించుచునే యున్నది.

జీవితమంతయు శ్రీరామసేవకు సారస్వతసేవకూ ధారవోసిన మహాత్యాగి, పరమ భాగవతుడు, మహాయోగి, గొప్ప సారస్వతవీరుడు, అధ్యాత్మవిద్యా మర్మజ్ఞుడు, మహాకవియునగు వావిలికొలను సుబ్బరావుగారు నిత్యముక్తులలో నొకరనుట నిర్వివాద సిద్ధాంతము. ఇన్ని యుత్తమగుణములు ఒక వ్యక్తిలో సంభవించుటయు కవులు విమర్శకులు పుట్టవచ్చును గానీ, త్యాగమూ యోగమూ భక్తి దీక్షా గలవారు కోటిలో ఒకరుండుటయు అపుడే ఆత డాంధ్రుడగుట మన జాతికి

గర్వకారణము. కడపవాడ గుట ఆ మండల భాగ్యము. ఈ చరిత్ర నాచే వ్రాయిం పించిన ఆంధ్ర సాహిత్య అకాడెమీవారు పుణ్యమూర్తులు. వ్రాసిన నేనూ పుణ్యలేశము నార్జించినట్లే. ఈ చరిత్ర రచనమున నాకు ఎంతో యుపకరించిన నా మిత్రుడు శ్రీ వా. సు. దాసస్వామివారికి సాక్షాత్ప్రియ పుత్రుడు నగు శ్రీమాన్ సడా దూరి విజయరాఘవాచార్యులుగారికి, కొన్ని సందేహములు తీర్చి స్వామివారి కథలు కొన్ని చెప్పిన మిత్రులు శ్రీ మైనంపాటి సుబ్రహ్మణ్యముగారికీ నా ధన్యవాదములు.

## శ్రీ వా. సు. దాసస్వామివారి రచనలు

1. శ్రీకుమారాభ్యుదయము. (పద్యకావ్యము)
2. కౌసల్యా పరిణయము ,,
3. ఆంధ్ర వాల్మీకి రామాయణము ,,
4. సుభద్రావిజయము (నాటకము).

## వ్యాఖ్యలు

5. శ్రీ రామాయణ మందరము (7 కాండలకు).
6. అష్టశ్లోకీ వివరణము (విశిష్టాద్వైతమును చెప్పే 8 శ్లోకాలకు 'పరమార్థ తత్త్వ'మను విపులవ్యాఖ్య)
7 ప్రమేయ రత్నావళి (మధ్వాచార్యుల కృతికి వ్యాఖ్య).

## ఆర్యకథానిధి (చిన్నకథల పుస్తకములు)

8. సావిత్రీ చరిత్ర
9. వామన చరిత్ర.
10. శకుంతల చరిత్ర
11. రుక్మాంగద చరిత్ర.
12. హనుమంతుని చరిత్ర.

బొబ్బిలి 'బుధానందిని సభ' లోనే పండితకవులతో నిండిన మూడు వందల మంది పృచ్ఛకులతో పరశ్శతావధానం చేశారు రంగాచార్యులు, ఆయన ధారణ శక్తికీ, కవితా వైభవానికీ ఆశ్చర్యపడనివారు లేరు.

ఎన్నోచోట్ల ఎన్నో శతావధానాలు చేసి అవుననిపించుకున్నారు ఆచార్యులు గారు. సంస్కృతంలోనూ ఆయన కవిత సంప్రదాయ సిద్ధమైంది, సలక్షణ మైంది, సరళమైంది.

రంగాచార్యులు స్వయంగా పండితులూ కవులూ కావడమేకాదు, దేశంలో ఎంతోమంది కవుల్ని తయారు చేశారాయన కవులకు కవి ఆయన; పండితులకు పండితుడు; గురువులకు గురువు. మహోపాధ్యాయ అద్దంకి వేంకటరాయ సాంఖ్యాయనశర్మ (1864-1933) ఆచార్యుల దగ్గిరే శాస్త్రాలు చదువుకున్నారు శర్మగారు తమ స్వీయచరిత్రలో ఇది సగర్వంగా చెప్పుకున్నారు.

ఆచార్యుల శిష్యులలో మరింత ముఖ్యంగా చెప్పదగిన వ్యక్తి సంగంవలస జమీందారు మృత్యుంజయ నిశ్శంక బహద్దర్ (1824-1904).

సంగంవలస సంస్థానం కోర్టాఫ్‌వార్డ్సులో వున్నప్పుడు మైనరుగా మృత్యుం జయ నిశ్శంక విద్యాభ్యాసంకోసం విశాఖపట్నం వచ్చారు అప్పుడే ఆచార్యులగారి దగ్గిర శిష్యులై సంస్కృతం, తెలుగు భాషలలో పాండిత్యమూ, కవిత్వమూ అభ్య సించారు. శాస్త్రాలలో నిష్ణాతులయారు

1847లో మైనారిటీ తీరి ఆయన సంస్థాన పాలకులయారు. సంస్థానాధిపతి అయినా విలాసాలతో గడపక నిరంతరం సాహిత్య రసికుడుగానే గడిపారు. పదేపదే గురువుల రంగాచార్యుల సాంగత్యంతో సాహిత్యసేవ చేశారు, సంస్కృతం లోనూ, తెలుగులోనూ గ్రంథాలు రాశారు. కాళిదాసు మూడు నాటకాలకూ వ్యాఖ్యానాలు రాశారు. కళింగ ప్రాంతంలో వీటిని సాధారణంగా "సంగంవలస వ్యాఖ్యానాలు" అంటారు.

ముఖ్యమైన విశేష మేమిటంటే గురువులైన వేంకట రంగాచార్యులు వీరి జీవిత చరిత్ర పద్యకావ్యంగా రాశారు. గురువు తన శిష్యుడి జీవితచరిత రాయడం చరిత్రలో ఇది వొక్కటే ఏమో!

34. మతత్రయ దండకత్రయము.
35. దేవాలయ తత్త్వము.
36. కృష్ణావతార తత్త్వము (10 సంపుటములు)
37. రామావతార తత్త్వము ( ,, )
38. సులభ వ్యాకరణము.
39. సంధ్యా వందనము
40. వందన శతి.

తురగా కామాక్షమ్మగారు, స్వామివారి భక్తురాలు,వీరి చరిత్ర వ్రాసియున్న దట. నా కది లభింపలేదు.

నే నెరుగని విక నెన్నిగలవో! వీని కన్నిటికి ప్రాప్తిస్థానము:-

శ్రీ కోదండరామ సేవక ధర్మసమాజము
దాసకుటి
అంగలకుదురు P.O.
(via) తెనాలి.

———

అంతేకాదు, శిష్యులు కవ్విస్తే, దినానికి వొక అంకం వరసని ఏడు దినాల్లో ఏడంకాల సంస్కృత నాటకం రాశాడు. షడ్దర్శనాలు మథించాడు. షట్చాస్త్రిలు శోధించాడు. వేదాలూ వేదాంగాలూ కడముట్ట చూశాడు, తెలుగు, తమిళం, సంస్కృతం అరచేతి వుసిరిక చేసుకున్నాడు. ఆర్షపాఠశాల స్థాపించి పండితుల్ని తయారు చేశాడు. ఆర్షమత సమాజం సృష్టించి ఆర్షవిజ్ఞానం పోషించాడు. ఆత్మగౌరవంకోసం అగ్రహారమైనా కాలదన్నాడు. రాజులా మహారాజులా పాదపూజ లందుకున్నాడు.

తెలుగువారిలో తొలి మహామహోపాధ్యాయుడు పరవస్తు వేంకట రంగాచార్యులు.

హిమాలయమంతటి గీర్వాణ పండితుడైనా తెలుగును చిన్నచూపు చూడలేదాయన.

తెలుగులోనూ, సంస్కృతంలోనూ అంతలేసి ఉద్గ్రంథాలు రాసినా పిల్లల కోసం చిన్నకథలూ రాసిన సౌజన్యుడాయన.

అంతటి భాషా ప్రౌఢ సరస్వతి మావాడని విశాలాంధ్రమే గర్విస్తుంది. విశాఖపట్నం గర్వించడంలో వింతేముంది!

## పుట్టు పూర్వోత్తరాలు

పరవస్తువారి ప్రాచీనులు దక్షిణాదిని కావేరీనది వొడ్డున అరణిపురంలో వుండేవారు. పెరుమాళ్వారు వీరి ఆదిపురుషుడు. ఈయన ఎనిమిదో తరంవారు తిరుపతికి తర్లివచ్చారు. అలా వచ్చినవారిలో గోవిందరాజప్పన్ ముఖ్యుడు. ఈయన ఎనిమిదో తరంవారు తిరుపతి నుంచి వేంకటగిరికి తర్లివెళ్ళారు. వీరిలో రఘునాథాచార్యులు, రామానుజాచార్యులు మంచిపండితులు. ఈ అన్నదమ్ముల పాండిత్యానికి మెచ్చి వేంకటగిరి రాజు వారికి బోయనగుంట, గొల్లలపాలెం అని రెండు అగ్రహారాలు బహూకరించాడు.

అది కన్నుకుట్టిన జ్ఞాతులు రఘునాథాచార్యులకు కుక్కపాలతో అన్నం పెట్టారు. దాంతో ఆయన పిచ్చిపట్టి చచ్చిపోయాడు. రాచపుండు పుట్టి రామానుజాచార్యులు మరణించాడు.

రామానుజాచార్యుల కుమారుడు శ్రీనివాసాచార్యులు (1767-1835); ఈయనే వేంకట రంగాచార్యుల తండ్రి.

తండ్రి మరణించిన నాటికి శ్రీనివాసాచార్యులు పసివాడు. తాతగారు అంతకి ముందే గతించారు. మరో మగదిక్కు లేదు. తల్లీ, నాయనమ్మా, మేనత్తా శ్రీనివాసాచార్యుల్ని పెంచి పెద్దచేశారు. దాయాదులు ఉపనయన సంస్కారం చేయించి విద్య నేర్పించారు.

అవి హైదరాలీ కుంపినీవారి మీద దండయాత్రలు సాగిస్తున్న దినాలు. 1730-70 నడుమను, అరువాలను అతడు కర్ణాటంమీద దండెత్తి దారికడాకూ పట్టణాలూ, పల్లెలూ కొల్లగొట్టేవాడు. అతడి పేరు వినడంతోనే ప్రజలు ప్రాణాలు పిడికిలిలో పెట్టుకొని చుట్టుపట్ల అడవులకు పారిపోయేవారు దండు వెళ్ళిపోయిన కబురు విని తిరిగివచ్చి, ఎవరికొంపలకు వారు చేరుకునేవారు

అలాగే వేంకటగిరి పదేపదే హైదరాలీ దాడికి లోనయినప్పుడు పాపం నిస్సహాయలైన శ్రీనివాసాచార్యుల తల్లీ, నాయనమ్మా, మేనత్తలు ముగ్గురు పిల్లంతువులా బాలుణ్ణి శ్రీనివాసాచార్యుల్ని తీసుకుని అడవులకు పారిపోయి, ఏ చెట్టుకిందో, పుట్టచాటునో తలదాచుకునేవారు. తుదకి ఆ బాధలు భరించలేక అబ్బాయి వెంటపెట్టుకుని ఆ ముగ్గురూ వేంకటగిరి వొదిలిపెట్టి కాలినడకని కష్ట పడుతూ కొన్నాళ్ళకి విజయనగరం చేరుకుని బంధువుల పంచన తలదాచుకున్నారు విజయనగరంలో మాడభూషివారు దాసన్న పేటలో వసతికల్పించారు.

శ్రీనివాసాచార్యులు ఇంచుమించు పదహారేళ్ళవరకు విజయనగరంలో విద్యాభ్యాసం చేశారు. తెలుగులోనూ, సంస్కృతంలోనూ వ్యాకరణం, వేదాంతం మొదలైన శాస్త్రాల్లో అసమాన పాండిత్యం గడించారు.

పాండిత్యమే కారణంగా శ్రీనివాసాచార్యులకు విశాఖపట్నం గోడే జమీం దారుల ప్రాపకం లభించింది.

శ్రీనివాసాచార్యులకు రామానుజాచార్యులు, వేంకట రంగాచార్యులూ, అని ఇద్దరు కుమారులూ, ఇద్దరు కుమార్తెలూ కలిగారు. చివరి కుమార్తె రంగనాయకమ్మ కవయిత్రి; శ్రీకృష్ణాభ్యుదయమని ప్రబంధం రాసిన విదుషీమణి.

శ్రీనివాసాచార్యులు తమ కుమాళ్ళకు పన్నెండు, పదమూడేళ్ళ ప్రాయం వచ్చేవరకు తానే స్వయంగా విద్యాబుద్ధులు నేర్పారు; పండితులుగా తీర్చిదిద్దారు.

విశాఖపట్నంలోనే ఆయన 1885 లో కాలం చేశారు. ఆయన పెద్దకుమారుడు రామానుజాచార్యులు ముప్ఫయ్యేళ్ళ వయస్సులో మరణించారు.

## వేంకట రంగాచార్యులు

శ్రీనివాసాచార్యుల రెండో కుమారులు వేంకట రంగాచార్యులు 1822 మే 22 తేదీని విశాఖ పట్నంలో పుట్టారు; తల్లి మంగమ్మ.

రంగాచార్యులుగారు ఆగర్భ విద్యావంతులు. మాటలు వచ్చినప్పటి నించీ తండ్రిగారి దగ్గిరా, అన్నగారి దగ్గిరా చదువు నేర్చుకుంటూ వచ్చారు. బాల్యం లోనే మంచి పాండిత్యం గడించారు. వ్యాకరణం, ఛందస్సు, అలంకారం, న్యాయ శాస్త్రం, వేదాంత శాస్త్రం – అన్నిటా చక్కని జ్ఞానం సంపాదించారు కవిత్వంలో అందెవేసిన చేయి అనిపించుకొని ఎనిమిదేళ్ళ పసిప్రాయంలోనే సంస్కృతంలో "కుంభకర్ణ విజయం" రాసి తండ్రిగారిని తలవూపించారు.

వేదాంతశాస్త్రం తండ్రిగారి దగ్గిర నేర్చినంత నేర్చి, అనంతరం వారి వేదాంతగ్రంథల "వేదాంత ప్రశ్నోత్తరావళీ" వేదాంతాచార్యులవద్ద అధ్యయనంచేసి సంపూర్ణమైన పాండిత్యం సంపాదించారు.

అలాగే తండ్రిగారి దగ్గిర మిగిలినభాగం రామానుజాచార్యుల దగ్గిరా, తర్కంలో కొంతభాగం వేంకట రాఘవాచారి దగ్గిరా, అనుమానఖండం కొండపల్లి వేంకటశాస్త్రి దగ్గిరా, శబ్దఖండం బోదన మిశ్రుల దగ్గిరా నేర్చుకున్నారు. తక్కిన విద్యలన్నీ స్వయంకృషితోనే సాధించారు.

వేంకట రంగాచార్యులు తమ పద్నాలుగో ఏట సింహాచలంలో కందాళ వరాహాచార్యుల కుమార్తెను తిరువేంగళమ్మను పెళ్ళిచేసుకున్నారు. ఈయమ్మ

కడుపున వరుసగా వేంకట రంగమ్మ, రామానుజస్వామి, శ్రీనివాస జగన్నాథ స్వామి, మంగతాయారమ్మ, అండాళమ్మ కలిగారు. వీరిలో అండాళమ్మ తప్ప తక్కిన నలుగురూ తండ్రిగారి జీవితకాలంలోనే కాలంచేశారు. చివరి జీవితంలో ఆచార్యుల గారికిది బాధగానే వుండేది.

వేంకట రంగాచార్యులుగారు ఎంతటి మహాపండితులో అంత మహావక్త. "ఆర్షమత సమాజం" అని వొక సమాజం స్థాపించి ప్రతి ఆదివారం ఆయన ఉపన్యాసాలు చేసేవారు. ఆ ఉపన్యాసాలు "సంగ్రహాలు" అని చిన్న చిన్న పుస్తకాలుగా ప్రకటించేవారు అలా ప్రచురమైనవే అలంకార సంగ్రహము, గుణ సంగ్రహము, అవతార సంగ్రహము, ప్రథమోపదేశ సంగ్రహము, రహస్య సంగ్రహము, కాల సంగ్రహము, స్మృతి సంగ్రహము, బాలప్రాజ్ఞ సంవాద సంగ్రహము వేద సంగ్రహము మొదలైనవి. ఇవి ప్రజలనెంతో ఆకర్షించాయి. అందుకని తిరిగి 1924లో రంగాచార్యుల మనుమలు లక్ష్మీనరసింహస్వామి గారు పరిష్కరించి రెండు సంపుటాలుగా "ఆర్ష మతోపన్యాసములు" అని ప్రకటించారు.

వేంకట రంగాచార్యుల ఉపన్యాస ధోరణి అద్భుతమైంది. గంభీరంగా, గంగాప్రవాహంలాగ, వేదశాస్త్ర ప్రమాణాలతో, పురాణ కథలతో, ఆఖ్యానాలతో, వ్యాఖ్యానాలతో ఆయన ఉపన్యసిస్తూ వుంటే వింటున్న ప్రజలు మంత్ర ముగ్ధుల్లా కళ్ళప్పగించి వూగిపోయేవారు. వాదవివాదాల్లో ప్రతివాదులు నోరు మెదప లేక పోయేవారు. అందుకనే సంస్థానాధిపతులు పదేపదే ఆచార్యులుగారిని ఆహ్వానించి, సభలు జరిపి సన్మానించేవారు.

ఓ మారు బొబ్బిలిరాజు రంగాచార్యులు గారిని ఆహ్వానించి, తమ "బుధా నందినీ" సభలో "హిందూమత ఉత్కర్ష" గురించి ఉపన్యసించుమని కోరారు. అవాళ ఆచార్యులుగారు చేసిన మహోపన్యాసం బుధానందినీ సభను విభ్రాంత పరిచింది. దానిని రావుగారు "ఆంధ్ర ప్రకాశిక"లో అచ్చువేయించారు. ఆ ఉపన్యాసం విని ఆస్థానకవి మండపాక పార్వతీశ్వర శాస్త్రి (1833-1897) ముగ్ధులయి వందా ముప్పయి ఎనిమిది పాదాల సుదీర్ఘమైన ఉత్పలమాల రాశారు. అది 1886

ఏప్రెల్ "అముద్రిత గ్రంథ చింతామణి"లో అచ్చయింది, దాని ఆరంభం ఇలా ఉంది

పున్నియపు సన్నిధానమయి
భూవలయాభరణంబుగా నుతిం
గన్న విశాఖపట్టణము
కాపురమై - పరమైధమానులై
వన్నెయు వాసియుం గలిగి
వర్తిలు నార్షసమాజ ముఖ్యు ల
భ్యున్నతవిష్ట రోదయ న
గోపరి- శ్రీ పరవస్తు సత్కులో
త్పన్నుడు సత్కళాఢ్యుడయి
భాసిలు వేంకట రంగనాథ వి
ద్వన్నిచయాగ్రగణ్యునకు
దద్దయు సన్నిధి కేగుదెంచి- స
త్సన్నుతమైన యార్షమత
సంగ్రహ మాడిగ సంగ్రహంబు లె
న్నెన్ని యొనర్చియైన జగ
దీశ్వరతత్వము ధర్మతత్త్వముం
గొన్ని విశేష తత్త్వములు
గూరిమి మీర వచించినార లా
పన్న జగత్సముద్ధరణ
పండితుడౌ పరమేశ్వరుండు మా
కెన్నటికైన దోచునటు
లింతటి నుండి తదర్చనాది రీ
తిన్నెరయించి మీర లుప
దేశ మొసంగు డటంచు నమ్రులై
విన్నప మాచరింప- సర
విన్-విని వారల నాదరింపుచుం
బున్నమ చందమామవలె

బొల్పగు మోమున మందహాసపున్
వెన్నెలగాయ గాయజుని
వింటికి నాతని మచ్చెకంటి చే
కొన్న విపంచికిన్ మృదుల
ఘోషవిశేషము నేర్పుజాలి పై
కొన్న కలధ్వనిన్ మృదుల
కోమల సార గభీర భారతిన్
జెన్నెసలారు నారభటి
జేకొని శ్రీముఖ వత్సరాదియౌ
మొన్నటి భానువార మన
ముందటి యార్ష సభా స్థలంబునం
దన్నలినాసనుండు సన
కాదులకుం బలె సుప్రసన్నతం
గన్న హితోపదేశము ప్ర
కాశ నిదర్శన పూర్వకంబుగా
మున్నుపదేశ మిచ్చినది
మూలముగా నొనరించె దాని చొ
ప్పెన్న దరంబు గాదయిన
నెల్లరకున్ దెలియన్ వచింతు నె
ట్లన్నను —"

ఆచార్యుల మహోపన్యాసం ప్రత్యక్షంగా విని మహాకవి పార్థసారథి శాస్త్రి వర్ణించిన వర్ణన ఇది; చరిత్రాత్మకమైంది.

క్రైస్తవ మతప్రచారంవల్ల మరో మతంలో కలిసినవారు రంగాచార్యుల ఆర్షమతోపన్యాసాలు విని తిరిగి తమ మతంలో వచ్చిచేరేవారు. "మా మతం మాకు తెలియకుండా మభ్యపెట్టడం చేతనే మేం మరోమతంలో కలియవలసి వచ్చింది" అనేవారు వారు.

బొబ్బిలి 'బుధానందిని సభ' లోనే పండితకవులతో నిండిన మూడు వందల మంది పృచ్ఛకులతో పరశ్శతావధానం చేశారు రంగాచార్యులు, ఆయన ధారణ శక్తికీ, కవితా వైభవానికీ ఆశ్చర్యపడనివారు లేరు.

ఎన్నోచోట్ల ఎన్నో శతావధానాలు చేసి అవుననిపించుకన్నారు ఆచార్యులు గారు. సంస్కృతంలోనూ ఆయన కవిత సంప్రదాయ సిద్ధమైంది, సలక్షణ మైంది, సరళమైంది.

రంగాచార్యులు స్వయంగా పండితులూ కవులూ కావడమేకాదు, దేశంలో ఎంతోమంది కవుల్ని తయారు చేశారాయన కవులకు కవి ఆయన; పండితులకు పండితుడు; గురువులకు గురువు. మహోపాధ్యాయ అచంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మ (1864-1933) ఆచార్యుల దగ్గిరే శాస్త్రాలు చదువుకున్నారు శర్మగారు తమ స్వీయచరిత్రలో ఇది సగర్వంగా చెప్పుకున్నారు.

ఆచార్యుల శిష్యులలో మరింత ముఖ్యంగా చెప్పదగిన వ్యక్తి సంగంవలస జమీందారు మృత్యుంజయ నిశ్శంక బహద్దర్ (1824-1904).

సంగంవలస సంస్థానం కోర్టాఫ్‌వార్డ్సులో వున్నప్పుడు మైనరుగా మృత్యుం జయ నిశ్శంక విద్యాభ్యాసంకోసం విశాఖపట్నం వచ్చారు అప్పుడే ఆచార్యులగారి దగ్గిర శిష్యులై సంస్కృతం, తెలుగు భాషలలో పాండిత్యమూ, కవిత్వమూ అభ్య సించారు. శాస్త్రాలలో నిష్ణాతులయారు

1847లో మైనారిటీ తీరి ఆయన సంస్థాన పాలకులయారు. సంస్థానాధిపతి అయినా విలాసాలతో గడపక నిరంతరం సాహిత్య రసికుడుగానే గడిపారు. పదేపదే గురువుల రంగాచార్యుల సాంగత్యంతో సాహిత్యసేవ చేశారు, సంస్కృతం లోనూ, తెలుగులోనూ గ్రంథాలు రాశారు. కాళిదాసు మూడు నాటకాలకూ వ్యాఖ్యానాలు రాశారు కళింగ ప్రాంతంలో వీటిని సాధారణంగా "సంగంవలస వ్యాఖ్యానాలు" అంటారు.

ముఖ్యమైన విశేష మేమిటంటే గురువులైన వేంకట రంగాచార్యులు వీరి జీవిత చరిత్ర పద్యకావ్యంగా రాశారు. గురువు తన శిష్యుడి జీవితచరిత రాయడం చరిత్రలో ఇది వొక్కటే ఏమో!

శిష్యుణ్ణి గురువు ఎలావర్ణిస్తున్నాడో వొక్కపద్యం చూడండి;

సంగీత సాహిత్య సరస విద్యాగోష్టి
సకల రహస్య విజ్ఞానుడయ్యె,
తాళమాన ప్రౌఢి తత్పరుడయి వాద్య
వాదకులకు మౌళివర్తియయ్యె
శ్రౌత ప్రయోగప్రసంగ విక్రాంతుడై
స్మార్తక్రియా పరిశ్రమము నేర్చె
వరుస భేదాభేద వాద నైపుణిచేత
వేదాంతులకు సద్వినోద మొసగె

సతుల యమ నియమాసన ప్రాణ సంయ
మాదికాష్టాంగ మహిత
సారముల నెల్ల జయ్యన జూరగొనియె
సంచిత విభుండు మృత్యుంజయప్రభుండు.

రంగాచార్యులు ఈ "నిశ్శంక చరితము" తమ అరవయ్యోయేట కాపోలు సంగంవలస ముక్త్యాపట్నం మృత్యుంజయనగరంలో వుండి రాశారు. ఇది ఆచార్యుల వారి ఆర్ష ప్రెస్‌లో 1886 లో అచ్చయింది.

## ఆత్మ గౌరవం

పరవస్తువారిది ప్రాచీన కాలంనించీ గురుస్థానం. రాజాధిరాజులకైనా వారు గురుదేవులేకాని ఆశ్రితులుకారు. స్వాములు వారు.

వారిని 'స్వామి' అంటే చాలదు, 'స్వామి అయ్య' అన్నా చాలదు, "స్వామి అయ్యవారు" అన్నా చాలదు, "స్వామి అయ్యవారలు" అన్నా చాలదు, "స్వామి అయ్యవారలుం గారు" అనాలి.

ఈ ఆత్మగౌరవాదేశం మన పరవస్తు వేంకట రంగనాథస్వామి అయ్యవార లుంగారి కాలంలో మరింత పరాకాష్ఠ నందుకుంది.

తమను ఆహ్వానించే రాజుల ఆస్థానాలకు వెళ్ళాలంటే రంగాచార్యులు గారికి కొన్ని ప్రత్యేకమైన నియమాలుండేవి

ఆహ్వానించిన రాజు ఆచార్యులుగారి బసకి పల్లకీ బోయీలు పంపాలి. బసనించి కోట దేవిడీకోకి తాను పల్లకిలోనే వెళ్ళాలి పల్లకిదిగి సభదాకా పాంకోళ్ళతో వెళ్ళాలి. తనను చూడగానే రాజు సింహాసనం దిగి నమస్కరించి వేదిక మీదికి తీసుకువెళ్ళాలి. ప్రత్యేకమైన చిత్రాసనంమీద కూచోపెట్టాలి. తాను కూచున్నతరవాతనే రాజు కూచోవాలి.

తాను తిరిగి వచ్చేటప్పుడు రాజు లేచి నమస్కరించాలి ఆశీర్వాదంపొంది సెలవు తీసుకోవాలి.

ఈ నియమాల మీద పట్టుదల రంగాచార్యులుగారికి. వీటిలో ఏవొక్కటి లోపించినా సహించలేక పోయేవాడాయన. ఆయనను ఆహ్వానించే రాజులూ మహారాజులూ అక్షరాలా అవి పాలించేవారు. పాలించని చోటికి ఆయన పోయేవాడు కాదు.

విజయనగరం మహారాజు ... ఎన్నోమార్లు ఆహ్వానించారు అయితే చిత్రాసనం వీరికి వేయించడం మిగిలిన పండితులకు అవమానించడమే అని అదిమాత్రం ... డు. ఆచార్యులుగారు అంగీకరించలేదు. ఈ కారణంగా విజయనగరం కోటలో అడుగే పెట్టలేదు ఆచార్యులు.

చీకటికోట జమీందారు సంగంపలస మృత్యుంజయ నిశ్శంకుల బంధువు అప్పటి జమీందారు ఓడ్రం సంస్కృతంతోపాటు తెలుగును కూడా అభిమానించే వాడు. ఆయన తెలుగులో కూడా సంతకం చేసేవాడు.

రంగాచార్యుల ప్రతిభ విని ఆయనను చీకటికోట ఆహ్వానించి రాజలాంఛనాలతో గొప్పగా సన్మానించాడాయన. ఆయన పాండిత్య పటిమను మెచ్చుకుని వొక గ్రామం అగ్రహారం ఆచార్యులు గారికి బహూకరించాడు.

కాని వోమారు ఆచార్యులుగారిని ఆహ్వానించి, ఆచార్యులు తిరిగి వచ్చినప్పుడు ఆనవాయితీ ప్రకారం జమీందారు సింహాసనంమీంచి లేవలేదు. దానికి

నిరసనగా ఆచార్యులు జమీందారిచ్చిన అగ్రహారం తిరస్కరించి తిరిగి వచ్చేశారు. మళ్లీ చీకటికోట మొహం చూడలేదు.

అదిగో అలా ఆత్మగౌరవం కోసం అగ్రహారమంతటి దానిని గడ్డిపోచగా చూసిన పండితులెందరు? అది వొక్క రంగాచార్యులు గారికే చెల్లింది.

న్యాయపతి రామదాసుగారి సాయంతో రంగాచార్యులుగారు 1865 లో "ఆర్షవిద్యా పాఠశాల" స్థాపించారు. ఇందులో విద్యార్థులకు సంస్కృతమూ, శాస్త్రాలూ, కావ్యాలూ బోధించేవారు. ఈ పాఠశాలకు దీనికి మందసా, జగ్గమ్మ పేట, విజయనగరం, జయాపురం, బొబ్బిలి మొదలైన రాజులూ, అప్పటి జిల్లా కలెక్టరు కార్మికల్ ద్వారా ధన సహాయం చేసేవారు.

విద్య సులువుగా పట్టుబడే సూత్రాలు కనిపెట్టి ఈ పాఠశాలలో విద్యార్థులకు బోధించే ఏర్పాట్లు చేశారు రంగాచార్యులు.

పరవస్తు వేంకట రంగాచార్యుల పేరు దేశమంతటా వ్యాపిస్తూ వచ్చింది. విదేశాలలో కూడా మారుమోగింది. ఆయన ప్రచురించే గ్రంథాలు జర్మనీ పండితులు కూడా తెప్పించుకునేవారు. ఆనాడు రంగాచార్యులుగారంతటి పండితుడు దేశంలో మరొకరు లేరంటే అతిశయోక్తి కాదనిపిస్తుంది.

మైసూరు మహారాజు రంగాచార్యులు గారిని ఆహ్వానించి అపూర్వమైన సన్మానం జరిగించారు. వారిని బసనించి కోటకి పల్లకిలో తీసుకువెళ్లారు. పల్లకి రెండు వేపులా, ముందూ వెనకా బోయీలూ, నిషానీ బల్లెం బరదార్లూ, తాషా మర్ఫాలూ, బిళ్ళబంట్రోతులూ రాజలాంఛనాలతో నడిపించారు. తమ నియమం ప్రకారం ఆచార్యులు రాజసభకి పాంకోళ్లతోనే వెళ్ళారు. ఆయన అవుపడగానే మహారాజు సింహాసనం దిగాడు నమస్కరించాడు. ఎదురువచ్చి వేదిక మీదికి తీసుకువెళ్ళాడు. ప్రత్యేకమైన ఆసనంమీద కూచోపెట్టాడు. స్వయంగా పూల దండ వేశాడు. తన చేతులతో బంగారంతోడాలు తొడిగాడు. దుశ్శాలువలు కప్పాడు. సంపూర్ణమైన పండిత సన్మాన, సత్కారాలు చేశాడు. వేదోక్తంగా మంత్రాక్షతలు పుచ్చుకున్నాడు, ఫలా లందుకున్నాడు.

## షష్టి పూర్తి

రంగాచార్యులుగారి షష్టిపూర్తి 1882 లో సంగంవలస మృత్యుంజయ నగరంలో వైభవంగా జరిగింది. నిశ్శంక బహద్దరు అధ్వర్యం వహించారు. ఆస్థానపండితులు ఆకెళ్ళ వేంకటశాస్త్రి, హద్దునూరి వేంకటరాయడు, ఈ కృష్ణ రావు, దేవరాజు వేంకటరాయడు, బహుగ్రంథకర్త తణికెళ్ళ ప్రకాశశాస్త్రి. మొదలైనవారేకాక ఇతర చోట్లనుంచి ఎంతోమంది కవులూ పండితులూ ప్రముఖులూ వచ్చి ఉత్సవంలో పాల్గొన్నారు. రాజులూ, జమీందారులూ కానుకలంపి పాదపూజలర్పించారు. శిష్యులూ, ప్రశిష్యులూ గురుపూజ చేసి, అభివందనా లర్పించారు అయితే సంతాన వియోగంవల్ల అనుభవించవలసినంత ఆనందం అనుభవించ లేకపోయారు ఆచార్యులుగారు

## తొలి మహా మహోపాధ్యాయుడు

బ్రిటిష్ ప్రభుత్వం 1887 లో "మహా మహోపాధ్యాయ" బిరుదం కల్పించింది ఆయేడు భారతదేశంలో నలుగురికే ఈ బిరుదు లభించింది. ఆ నలుగురిలో పరవస్తు వేంకట రంగాచార్యులుగారే ప్రథములు. తెలుగువారిలోనూ తొలివారు. అంతేకాదు 1878 నాటి ఆరమ్సు ఆక్టు రంగాచార్యులు గారికి వర్తించకుండా ప్రభుత్వం సన్నదు జారీచేసింది. అంటే సామాన్యమైన అయుధాలు ఆయన వుంచుకోవచ్చు నన్నమాట.

## సంస్కృత నాటకాల తొలి తెలుగుసేత

మనం అంగీకరిస్తే అనువాదంతోనే ఆరంభమయింది ఆంధ్రసాహిత్యం. అయితే ఇతిహాస పురాణాలు అనువదించిన మన ప్రాచీనులు పందొమ్మిదో శతాబ్దం దాకా నాటకాలు అనువాదం చేసిన పాపాన పోలేదు ప్రబంధాలమీద మోజుతో సంస్కృత నాటకాలు ఆంధ్ర ప్రబంధాలుగా మలుస్తూ వచ్చారు వారు.

దీనికి కారణం మరి ఏదైనా కావచ్చు.

"నాటకమునందు పాత్రల ననుసరించి గ్రామ్యభాషను వ్యవహరింప వలసివచ్చునని కాబోలును వారు (పూర్వకవులు) నాటకములను తెనిగింపవలసి

వచ్చినప్పుడు దృశ్యకావ్యములుగా మార్పక, శ్రవ్యప్రబంధములుగానే వ్రాయుచు వచ్చిరి" అన్నారు కొమర్రాజు లక్ష్మణరావుగారు. (ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము సం. 2. పు. 217).

ఇది నిరాధారమైన ఊహ. ఒకవేళ పూర్వకవులకు అలాటి భావనేఉంటే అంతకంటె తెలివితక్కువ మరొకటి వుండదు.

"నాటకరచనకి తెలుగు పనికిరాదని అనుకునేవారు." అన్నారు ధర్మవరం కృష్ణమాచార్యులుగారు ఇదికూడ తొలి భావన వంటిదే.

ఏమైతేనేం, పందొమ్మిదో శతాబ్దం పూర్వార్థం ఆరంభంలోకానీ సంస్కృత నాటకాల తెలుగుసేత జరగలెదు.

అయితే "దీనికి ఆద్యులెవరు?" అని పండితులలోనూ, పరిశోధకులలోనూ కొంత రగడ రేగింది

'సంస్కృతంనుంచి నాటకం మొదట నేనే తెలిగించాను' అని స్వీయ చరిత్రలో రాసుకున్నారు వీరేశలింగంగారు.

"సంస్కృతనాటకాల ఆంధ్రీకరణములో ప్రథమ కర్తృత్వం నాదే" అని తమ నరకాసుర వ్యాయోగంలో చెప్పుకున్నారు కొక్కొండవారు.*

"అవును, సంస్కృత నాటకానువాదకల్లో కొక్కొండవారే అద్యులు" అని పల్లవి పట్టారు శివశంకర పాండ్యాగారు.

"కాదు, మా గురువులు కోరాడ రామచంద్ర శాస్త్రిగారు" మొదటివారు. అన్నారు వావిలాల వాసుదేవ శాస్త్రిగారు.

ఈ రాతలన్నీ కొంత చర్చించి ఇలా క్రోడీకరించారు మిత్రులు డా. అక్కిరాజు రమాపతి రావుగారు.

"తొలి తెలుగు సంస్కృతానువాద రూపకము వేణీసంహారము. శ్రీరామ చంద్ర శాస్త్రిగారిచే 1870వ సంవత్సర ప్రాంతమున విరచితము. 1872వ

* "ఆంధ్రమున రూపకాద్యమిది" న. వ్యా. సూత్రధారుడు.

సంవత్సరమున శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులవారు సంస్కృతమున ధర్మసూరి విరచిత నరకాసుర విజయ వ్యాయోగమును, 1875 వ సంవత్సరమున పరవస్తు వేంకట రంగాచార్యులవారు, అభిజ్ఞాన శాకుంతలము నాంధ్రీకరించి ప్రకటించిరి." (1872.)

"ప్రప్రథమంలో సంస్కృత నాటకాన్ని అనువదించింది కోరాడ రామ చంద్రశాస్త్రిగారు" అంటారు ఆంధ్రనాటకరంగ చరిత్రలో మిక్కిలినేని రాధా కృష్ణమూర్తిగారు.

కాని ఈ ప్రముఖుల రాతలు నిజం తెలిసి రాసినవి మాత్రము కాదని చెప్పడానికి విచారపడుతున్నాను.

సంస్కృత నాటకాలు ప్రప్రథమంగా తెలుగులోకి అనువాదం చేసిన ఆద్యులు పరవస్తు వేంకట రంగాచార్యులుగారు. వీరు 1859 కి ముందే రాజచూడా మణి దీక్షితుల సంస్కృత నాటిక 'కమలినీ కలహంసమూ', కాళిదాసు "అభిజ్ఞాన శాకుంతలము" తెలుగు చేశారు.

ఆద్యు లెవరని చర్చించిన వారందరు శాకుంతలం గురించి తప్ప 'కమలినీ కలహంసం' తడివినవారు లేరు. శాకుంతలానికి ముందే ఆచార్యులుగారు కమలినీ కలహంసం అనువదించినట్టు అనుపిస్తుంది.

ఆచార్యులగారి అనువాదం "ఆంధ్రాభిజ్ఞాన శాకుంతలము" పూర్తి అయిన ఏడెనిమిదేళ్ళ తరవాత 1875 లో గూడూరి వెంకట కృష్ణారావు సంపాదకత్వంతో విశాఖపట్నం నుంచి వెలువడిన "సకల విద్యాభివర్ధని" మాసపత్రికలో మూడం కాలు వెలువడింది. (వీరేశలింగంగారు రెండంకాలని" స్వీయచరిత్రలో రాశారు బహుశా అదేచూసి ఆంధ్ర రచయితలలో మిత్రులు మధునాపంతులవారూ రెండం కాలే అని రాశారు అక్కిరాజువారు మాత్రం మూడంకాలే అన్నారు. మిత్రులు బంగోరేవారు "సకల విద్యాభివర్ధని" నుంచి ఆ మూడంకాలు "ఫోటోస్టాట్" కాపీ నాకు పంపించారు.)

"సకల విద్యాభివర్ధని"లో ప్రచురణ పురస్కరించుకుని పరిశోధకులు రంగాచార్యులు 1875లో అనువాదం చేసినట్టు భ్రమపడ్డారు కొందరు. దాంతో

ఆయనను సంస్కృత నాటకానువాదకులలో ప్రథమస్థానం నించి వెనకకినెట్టారు.

శ్రీ వేంకట రంగాచార్యులుగారు తమ "శబ్దార్థసర్వస్వము" ఆరంభించ డానికి ముందే రాజచూడామణి దీక్షితుల కమలినీ కలహంస, కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలం తెలుగుచేశానని తమ "లఘు శబ్దార్థ సర్వస్వం" లో చేర్చిన స్వీయచరిత్రలో వివరించారు. ఈ స్వీయచరిత్ర వందా పన్నెండు శ్లోకాలలో ఉంది. 1877 లో విశాఖపట్టణం ఆర్షాప్రెస్‌లో అచ్చయింది. అందులో ఇలా వుంది.

"శేషాంచిదభ్యర్థనయా కేచిద్గ్రన్థా మయాకృతాః
నాటికాం కలహంసస్య కమలిన్యశ్చ యాం కథామ్
రాజ చూడామణిశ్చక్రే తస్యాశ్చాయాన్ధ్ర భాషాయా,
కాళిదాస నిబద్ధస్య తథా శాకున్తలస్యచ." శ్లో. 67, 68.

అనంతరం రంగాచార్యులుగారి జీవితకాలంలోనే 1898 లో వారి ఛందశ్శాస్త్రం "శ్రీనివాస లక్షణము" అచ్చువేసిన వారి మనుమలు వేంకట రంగనాథ స్వామిగారు ఆచార్యులుగారి "చరిత్ర సంగ్రహము" లో కూడా ఇలా రాశారు:

"ఆంధ్రాభిజ్ఞాన శాకుంతలము-దీనిని శబ్దార్థ సర్వస్వమును ఆరంభింపక మున్న చేసిరి." (పు. 8)

శబ్దార్థ సర్వస్వము రంగాచార్యులు తమ ముప్పయివకో ఏట 1859 సిద్ధార్థి సంవత్సరంలో ఆరంభించినట్టు స్వీయచరిత్రలోనే చెప్పారు (చూ.శ్లో.72)

"శబ్దార్థ సర్వస్వం" ఆరంభానికి ముందు కనీసం రెండేళ్ళనుకున్నా ఆచార్యుల సంస్కృత నాటకాల తెనిగింపు 1857 అవుతుంది. అయినప్పుడు పరవస్తు వేంకట రంగాచార్యులుగారే ఆంధ్ర సాహిత్యంలో కొత్తబాట తెరచిన ఆద్యులూ. ఆరాధ్యులు అనడంరో సందేహం లేదు.

విచారకరమైన విషయమేమంటే మన పరిశోధకులు పలువురు చూడవలసినంత లోతులకు చూడక పైపైనే వొకరుచెప్పిందే మరొకరు వల్లించడం.

ఉదాహరణకు మిత్రులు డా.ఐ పాండురంగరావుగారు "ఆంధ్ర - హిందీరూపక్, తులనాత్మకమైన పరిశోధనా గ్రంథంరాసి పి హెచ్‌డి పట్టం పుచ్చుకున్నారు. వీరి గ్రంథంలో పరవస్తువారి ప్రసక్తేలేదు సంస్కృత నాటకాల తెలుగు అనువాదకులలో. శాకుంతలం తెలుగు చేసిన వారిలో తమ గ్రంథానికి నాలుగేళ్ళముందు అచ్చయిన రాయప్రోలువారి శకుంతలపేరు కనపడదు. శాకుంతలం ప్రబంధంగా రాసిన పిల్లలమర్రిని మాత్రం ఉటంకించారు. కాని మాడభూషివారి "భరతాభ్యుదయం" మాట ఎత్తలేదు

"సకల విద్యాభివర్ధని" అచ్చయిన మూడంకాలే తప్ప రంగాచార్యులుగారు పూర్తిగ శాకుంతలం అనువదించలేదని కొందరి సందేహం. అది పొరపాటు. పూర్తినాటకం రాత ప్రతి కాపీ ఈ ఉపన్యాసకుడి దగ్గిర కూడ వుంది

చివరి ఏడో అంకంలో చిన్న పద్యం వినండి.

గీ. ప్రేప్సి తార్థార్థన ప్రసారితము గ్రథిత
మృదుతరాంగుళ యగు కేలు మెరయుచున్న
దప్రదృశ్య దళాంతరోదగ్ర రాగ
నవ్య సంధ్యా స్ఫుటారవిందంబు కరణి.

## శబ్దార్థ సర్వస్వమ్

వేంకట రంగాచార్యులు మనకిచ్చిపోయిన బ్రహ్మాండమైన రత్నాలగని "శబ్దార్థ సర్వస్వమ్". వందమంది మహాపండితులు తమ జీవితమంతా వెచ్చించినా సాధించలేనంత మహాగ్రంథ మిది.

దీనిగురించి ఆచార్యులుగారి మనవడు 1898 లోనే వారి చరిత్రసంగ్రహ ములో ఇలా రాశారు : "ఇంగ్లీషు భాషలోని 'ఎన్‌సైక్లోపీడిఆ బ్రిటానికా' గ్రంథ ముంజూచి యటుల సంస్కృతమునకుం జేయవలెనని తలంచి దీనిని సిద్ధార్థ సంవత్సరమున నారంభించిరి. నేటికి (1898 నాటికి) ముప్పదిమూడు సంవత్స రము లాయెను. ప్రథమమున దీనిని వ్రాయించుటకు గుమాస్తాల జీతములు మొద

లగు ఖర్చులు కొంతకాలము వరకును శ్రీరాజా గజపతి రాయణింగారు దయ చేయించుచు వచ్చిరి. దాని నచ్చువేయించుటకై వారితో మనవి చేసినను ఉపేక్షించిరి అంతట స్వయముగా నచ్చువేయించుటకై ప్రయత్నము చేయగా శ్రీబొబ్బిలి రాణీ లక్ష్మీ చల్లయ్యమ్మ బహదూరుగారు ముద్రాశాలోపకరణములను దయచేయించిరి. దానిని స్థాపించి ఆర్షముద్రాశాల యని నామకరణము జేసిరి.*

అంతట ఇనస్పెక్టరు ఆఫ్ స్కూల్స్ అను నధికారముతో నీ దేశమునకు విచ్చేసిన శ్రీమాన్ నిడాద్గూరి వేదాంతాచార్యులు గారి ప్రేరణచే ఆ శబ్దార్థసర్వస్వము నుండి సంగ్రహించి "లఘు శబ్దార్థసర్వస్వము"ను రచియించి అకారాది భాగమును ఆంగీరస (1873) సంవత్సరమున నార్షముద్రాక్షరశాలలోనే ముద్రింపనారంభించిరి. దీనికి ఆ శ్రీమద్వేదాంతాచార్యుల ప్రేరితులై యనేకులుదారులును ప్రభువులును ధనసహాయముం జేసిరి.

ఆ ప్రేరకులు పరమపదించుటచే ప్రథమమున ప్రతిజ్ఞ చేసిన మహాత్ములు కూడ నిచ్చుటను మానిరి అంగుచేత అకారముతో నిలిచిపోయినది. ఆపైని చాలా కాలమునకు ఆకారాది భాగమును వారు స్వయముగా ధనవ్యయము చేసియే అచ్చువేయింప నారంభించి మెల్లమెల్లగా జరిగింపుచున్నారు. ఇప్పుడు ఆశ్రయ గుణక అను శబ్దము వరకును అయినది. ఈ ఆకారము అచ్చుపడుచున్న క్రమమున నచ్చుపడునెడల గ్రంథమంతయు పూర్తియగు వరకు 200 సంవత్సరములగును "

మల్లంపల్లి సోమశేఖర శర్మగారు ఇలా రాశారు:

"భారతదేశమున నిట్టి "ఎన్‌సైక్లోపీడియా" ప్రకటితమైనట్లు వినము. అచార్యులవారు దీనిని పరసహాయము లేకయే స్వయముగ ఒక్కచేతిమీదుగ రచింపబూనుకొని ముగించుట ప్రస్తుతింపదగిన గొప్ప విశేషము. ఈ విజ్ఞాన కోశము సంస్కృత వాఙ్మయమునందుగల జిజ్ఞాస్య విషయములను సవిస్తరముగా వివరించుటయేగాక నిఘంటు రూపమున కూడ సంతరించబడినది. దీనిని మత, శాస్త్ర, వాఙ్మయ సర్వస్వమని చెప్పవచ్చును. ఇది రంగాచార్యస్వామి

* ఇది ఈ పేరుతోనే ఇప్పుడు నవీన పరికరాలతో పరవస్తువారింటనే వుంది.

వారి అత్యద్భుత కూలంకష పాండిత్యమునకు తార్కాణము. శాస్త్రములందు కూడ దుర్లభమగు వైశద్యము శాస్త్రవిషయ నిరూపణమున నిందు కన్పట్టును. ఈ సర్వస్వమున పొందుపరుపబడ వలసిన విషయములను పగలు అవలోడన చేసికొని రాత్రిపూట ఏకాంతముగా నున్న సమయమునందు ఆయన వాటిని వ్రాయుచుండినట్లును, పగటిపూట అవలోడనము చేసికొన్న విషయము లన్నియు మరునాడుదయమునకు వ్రాయుట ముగింపబడుచుండి నట్లును చెప్పుదురు. అట్లు అహోరాత్రములు నిరంతర కృషితో వేంకట రంగాచార్యులుగారు సంపూర్ణ ముగా సిద్ధముచేసిన ఈ లఘుశబ్దార్థసర్వస్వపు సంపుటములలో మొదటిదగు 'అ' యను అక్షరముతో మొదలగు విషయములు గలది తెలుగులిపిలో విశాఖపట్టణ మున వారిదేయగు ఆర్ష ముద్రాక్షరశాలయందు 1877 లో ముద్రితమైనది.

ఇది డెమీ క్వార్టోసైజున 412 పుటల గ్రంథము. 'ఆ' యక్షరముతో నారంభమగు విషయములుగల రెండవ సంపుటము 1898 లో అచ్చయినది. ఇందలి పుటలు **244.** అటు పిదప వేంకట రంగాచార్యులుగారు పరమపదించుట చేత దేశ దౌర్భాగ్య వశమున తరువాతి సంపుటములు ముద్రణభాగ్యమునకు నోచుకొనలేదు".

—తెలుగు విజ్ఞాన సర్వస్వం.
సం. 3. పు. 1082 (1959)

లఘుశబ్దార్థ సర్వస్వం అ, ఆలు చూసి రాశారు శర్మగారు రంగాచార్యులు గారి "శబ్దార్థ సర్వస్వం" రాతప్రతి సంపుటాలు తిరుపతిలో మూలుగుతున్నాయి.

రంగాచార్యులు గారి గ్రంథాలయం అమూల్యమైంది, దానిని వారి మున్మన మలు శ్రీమాన్ నంబార్ గారు ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఇచ్చేశారు; మంచి పని చేశారు అది ఇచ్చినప్పుడు వొక వొప్పందంకూడా వుందంటారు వారు. వీరి గ్రంథాలయం అలాగే ఇచ్చేయడానికీ, వారు "శబ్దార్థ సర్వస్వం" అచ్చువేయ డానికీ ఆ వొప్పందం. ఇంతవరకు అది వెలుగు చూడ లేదు.

లఘు శబ్దార్థ సర్వస్వములో వొక శబ్దం అక్షరం అర్థం చూడండి:

అక్షర - (అశూ - సర) [నఞ్ - క్షర] గవాదిః - పు. శివః - విష్ణుః - బ్రహ్మ - న. ఓఙ్కారః - ధర్మః - ప్రకృతిః-తపః - యజ్ఞః - వర్ణః - మోక్షః - ఆకాశః - పరబ్రహ్మః - విధిః - వ్యఞ్జన సహితోచ్ - త్రి. వికారరహితః - అక్షర లేఖనాభ్యాసో ఽ క్షరాభ్యాసో ఽ క్షరస్వీకారో ఽ క్షర గ్రహణ మితి చోద్యతే. అక్షర సమూహ విశేషశ్ఛన్ద ఇత్యుచ్యతే.

అక్షరై రఙ్కనిర్దేశో యథా.

కాదయో నవ -టాదయో నవ-పాదయః పఞ్చ - యాద యోష్టౌ - క్రమే ణైకాద్యఙ్క బోధకాః - అకారాదయ స్వరాః - ఞకార నకారాచ శూన్యబోధకాః - సంయుక్తాక్షరేషు సంయోగే చరమ వ్యఞ్జనస్యాఙ్క ఏవ గ్రాహ్యః - అక్షర శబ్దార్థ విషయ మధికరణ మక్షరాధి కరణమ్ - అక్షరామ్బర విశిష్టాస్సంగీత శాస్త్రే కేచి దప్రసిద్ధా సంకీర్ణస్థా యాస్సన్తి - తేత స్మాన్మన్నైవ ప్రసిద్ధాః.

## రంగాచార్యుల ఇతర గ్రంథాలు

మంజుల నైషధము - ఏడునాళ్ళలో రాసిన ఏడంకాల సంస్కృత నాటకం.

లఘు వ్యాకరణము - వ్యాకరణం సముద్రం. దానిని బాలలు భయపడ కుండా క్రీడాసరస్సు చేశానని రచయిత.

ప్రపత్తివాదము- బొబ్బిలి సంస్థాన పండితులు సుసర్ల సీతారామ శాస్త్రి గారితో జరిపిన వేదాంత వాదం.

అనర్ఘరాఘవ వ్యాఖ్య.

ఉపనిషత్సార గీతములు- గొడే నారాయణ గజపతిగారికోసం రాసిన వేదాంత సంగీతకృతులు.

శ్రీనివాస లక్షణము- ఛందశ్శాస్త్రం.

బాల ప్రాజ్ఞ సంవాదము.

మహాప్రభు శతకము- శతకకవుల చరిత్రలో కనపడదు.

పరమానంద శిష్యుల కథలు.

తిరుప్పల్లాండు.

కథా సంగ్రహము- బాలులకోసం రాసిన కథలు. ఇందులో మహాపాతక పుర కథ,లక్కగేదె కథ, నల్లమందు సేవించు కథ, బైరాగుల కథ, కంబళీని నేను వదిలిన నది నన్ను వదలదన్న కథ, వణిగ్జనుల యొక కంత్యము, మార్జాలహత్య కథ, గతానుగతిక కథ, తలమీదనున్న నూగింజ కథ, నారపీచు కథ, మేకల తెగుళ్ళ కథ, అల్లుడను కాకుంచే నా తుంబయు దుడ్డు నిచ్చి వేయు మనుకథ, యదార్థమైనను ప్రకటన చేయకూడదన్న కథ, భైరవశాస్త్రి కథ, అయ్యదాసరులకు నమ్మ జంగములకుం బెట్టు కథ, బుద్ధిహీనుని కథ, చెవిటి కథ, సోమరుల కథ, ఆవిమ్మృశ్యకారుల కథ' గుఱ్ఱమెక్కించు కథ, బెబ్బె బెబ్బే కథ, గాడిదను మనుష్యుని చేయు కథ, అరే అల్లా అన్న కథ, భేతాళుని పంపు కథ, తోటకూర పెరటి కథ, పట్టువస్త్రము కథ, బ్రహ్మరక్షస్సును బెదరించిన కథ అని ఇరవయ్యారు కథలున్నాయి.

పది ఉపనిషత్తులు - అనువాద గ్రంథం.

## అస్తమయం

వేంకట రంగాచార్యులుగారు మైసూరునుంచి విశాఖపట్నం తిరిగివస్తూ తునిలో అగి, సంస్థానం సత్రంలో బసచేసారు, అప్పటికే ఆచార్యుల ప్రసిద్ధి నెరిగిన తునిరాజు ఆయనను సగౌరవంగా కోటకు ఆహ్వానించారు. ఘనంగా సన్మానించారు. చివరి దినాలు తమ ఆస్థానంలోనే గడుపమని ప్రార్థించారు. వారికి తునిలో గృహ వసతి కల్పించి, ఏడాదికి వెయ్యి రూపాయల లెక్కని నెలకు ఎనభై మూడు రూపాయల అయిదణాల నాలుగు దమ్మిలు గౌరవభృతి ఏర్పరిచారు.

ఆచార్యులుగారు తమ జీవితములో చివరి రెండేళ్ళు తునిలోనే గడిపారు. ఆయన తుని భవనం ఇప్పుడు తుని హైస్కూలులో కలిసిపోయింది.

రంగాచార్యులుగారు 78 సంవత్సరాలు మాత్రం జీవించారు. 1900 జనవరి 20 తేదీని తునిలోనే కాలధర్మం పొందారు. ప్రాణం విడిచేదాకా ఆయన తెలివిగానే వున్నారు. తన రెండో మనమడు వేంకట భట్టనాథ స్వామిగారితో చివరిమాట చెప్పి శరీరం వొదిలి పెట్టారు.

తుని రాజుగారు సక్రమంగా రంగాచార్యుల అంత్యక్రియలు జరిగించారు.

అలా ఆంధ్రుల విజ్ఞాన మహాజ్యోతి తాండవనది దక్షిణం వొడ్డున శాశ్వతంగా ఆరిపోయింది.

———